అపరాధ పరిశోధన అనుబంధం — 60

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మృత్యుకళ

రచన : వసుంధర

## పరువా? ప్రాణమా?

రచన : 'సికిందర్'

## ఎడారిలో బంగళా!

రచన : ఏ. వీ. మోహన్రావ్

## ఏడుగురు దొంగలు

రచన : అజీజ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—60
డిశంబర్, 1978
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మృత్యుకళ!

వసుంధర

"హత్యలదేముందండీ, ఏమీ ప్రమాదంలేదు" అన్నాడు రాము చాలా మామూలుగా.

వెంకట్రావు రామువంక ఆశ్చర్యంగా చూసి "నా సమస్య అంతా హత్యల్లోనేవుంది. ప్రమాదం లేకుండా హత్యలు జరిగితే అంతకంటే కావలసినది యేముంది?" అన్నాడు.

"మీకు కావలసింది హత్యలు. నా కావలసింది డబ్బు. మీరు డబ్బుకు వెనుకాడని పక్షంలో యెన్ని హత్యలయినా చేసి పెడతాను. మీకూ ప్రమాదముండదు. నాకూ ప్రమాదముండదు" అన్నాడు రాము.

"ఎంతకావాలి?"

"ఏంతో అక్కర్లేదు—హత్యకొక లక్ష."

"కొంచెం ఎక్కువే" అన్నాడు వెంకట్రావు.

"ఎక్కువ కాదనుకుంటేనే ఈపని అప్పగించండి."

వెంకట్రావు సాలోచనగా తలపంకించాడు. తర్వాత నెమ్మదిగా "సుదర్శనరావు తెలుసా నీకు?" అడిగాడు.

"తెలియదు" అన్నాడు రాము.

"సరస్వతీ విలాస్ కాఫీహోటల్ ప్రొప్రయిటరు."

"ఓ ఆయనా, నాకు బాగా తెలుసు..." అన్నాడు రాము.

"ఎలా?"

"వాళ్ళబ్బాయికీ నాకూ క్లబ్బులో పరిచయం. వాళ్ళ అమ్మాయికీ నాకూ రోడ్డుమీద పరిచయం. మొదటి పరిచయం అతనికి సరదా. రెండో పరిచయం నాకు సరదా"

"నీతో పరిచయం సుదర్శనరావు కొడుక్కు సరదాగా ఉంటుందా? ఎందుకు?" అన్నాడు వెంకట్రావు.

"పేకాటలో ఎప్పుడూ నేనే ఓడిపోతూంటాను. నా మూలంగా అతడికిప్పటివరకూ అయిదారువేల వరకూ వచ్చింది" అన్నాడు రాము.

"అయిదారు వేలే. అంత డబ్బెక్కడిది నీకు?"

"ఇప్పటికి పాతిక వేలు అప్పయింది నాకు. మీరిచ్చే లక్ష రూపాయల ఆశతో నేను చాలా జోరుగా డబ్బు ఖర్చు పెడుతున్నాను" అన్నాడు రాము.

"పేకాట మంచి అలవాటుకాదు. ఎన్ని లక్షలు సంపాదించినా పోతాయి."

"పేకాట నా అలవాటుకాదు. సుదర్శనరావు కొడుకు చెంగల్రావుతో పరిచయం కోసమే పేకాడుతున్నాన్నాను" అన్నాడు రాము.

"చెంగల్రావుతో పరిచయమెందుకు?"

"చెంగల్రావు చెల్లెలు స్వాతిని నేను ప్రేమిస్తున్నాను."

వెంకట్రావు నవ్వి, "మిస్టర్ రామూ, నీలో చాలా ఆశలున్నాయి. స్వాతి అందమైనదే కాక చురుకయినది

కూడా. నీలాంటి వాణ్ణామె పెళ్ళాడదు'' అన్నాడు.

''సుదర్శనరావుని మీరు చంపలేకపోతున్నారు. ఆ పని నాకు అప్పజెప్పాలనుకుంటున్నారు. అంటే మీవల్ల కానిపని నావల్లనౌతుందనే కదా మీరనుకుంటున్నారు! స్వాతిని పెళ్ళి చేసుకోవడం మీకు అసాధ్యమేమోగానీ నాకు కాదు'' అన్నాడు రాము.

''సుదర్శనరావు ఇంటికి చాలా రక్షణ సదుపాయాలు వున్నాయి. గేటుదగ్గర గూర్ఖా వుంటాడు. వాడికి మాత్రమే తెలిసిన స్విచ్ ఒకటి గేటుదగ్గర వుంది. వాడి ప్రాణం తీసినా దానిసంగతి చెప్పడు వాడు. గూర్ఖా అనుమతి లేకుండా ఎవరింట్లో అడుగుపెట్టినా పెద్దఅలారం మ్రోగుతుంది. ఎవరయినా ఆ ఇంట్లో అడుగుపెట్టేముందు గూర్ఖాకు చెప్పాలి. అప్పుడు వాడు అక్కడున్న స్విచ్ ఆపరేట్ చేస్తాడు. అదెలా ఆపరేట్ చేస్తాడో ఆ పరమాత్మునికే తెలియాలి. వాడా స్విచ్ ఆపరేట్ చేయక పోతే మాత్రం అలారం మ్రోగితీరుతుంది. ఆ విధంగా అది లోనే హంసపాదు'' అన్నాడు వెంకట్రావు.

''అయితే?'' అన్నాడు రాము నిర్లక్ష్యంగా.

''ఇలా అడుగడుగునా రక్షణ ఏర్పాట్లు చేసుకోవడం వల్లనే సుదర్శనరావుని ఎవ్వరూ ఏమీ చేయలేక పోతున్నారు'' అన్నాడు వెంకట్రావు.

''అయినా సుదర్శనరావును చంపడానికి యింటికి వెళ్ళడమెందుకు? ఏ నడిరోడ్డుమీదనో చంపేస్తే వదలిపోలేదూ?'' అన్నాడు రాము.

''అది ప్రమాదంతో కూడినపని.''

''అందరికీ కావచ్చు. కానీ నాకుమాత్రం కాదు.''

వెంకట్రావు ఆశ్చర్యంగా రామువంక చూసి ''సరే-

మిస్టర్ రామూ! నీకు లక్షరూపాయలిస్తాను. ఎల్లుండి కల్లా పని ముగించుకుని రావాలి. అయితే పని పూర్త య్యాకనే నీకు డబ్బు ముడుతుంది. సరేనా?''అన్నాడు.

''అలాగే__యెల్లుండికి లక్షరూపాయలు సిద్ధంచేసి ఉంచండి'' అని అక్కడ్నించి కదలివెళ్ళాడు రాము.

# 2

''మిస్టర్ వెంకట్రావ్-చెప్పినపని చేశావా?''అన్నాడు గోవిందరావు.

''పనింకా కాలేదు కానీ యేర్పాట్లు జరుగుతున్నా యండి. ఎల్లుండికల్లా సుదర్శనరావు పనిపూర్తవుతుంది. అయితే మొదట్లో అనుకున్నట్లుకాక ఖర్చు రెండులక్షలు అయ్యేలాగుంది.''

''డబ్బుకేముంది? అలాగే కానీ ... కానీ ఎల్లుండి కల్లా...''

''అందులో మీకేమీ సందేహం లేదండి'' అన్నాడు వెంకట్రావు.

గోవిందరావు సంతృప్తిగా తలాడించాడు.

గోవిందరావు ఆ ఊళ్ళో పేరుమోసిన ఇనుప వ్యాపా రస్థుడు. ఇనుపవస్తువుల తయారీకి సంబంధించి ఒక పెద్ద ఫ్యాక్టరీకూడా ఉందాయనకు. ఇది ఆయన న్యాయంగా సంపాదిస్తోన్న డబ్బు.

అవూళ్ళోనే నడుపబడుతున్న ''సెక్స్ అండ్ ఓన్లీ సెక్స్'' నైట్ క్లబ్ లో ఆయన ముఖ్యభాగస్థుడన్న విషయం చాలామందికి తెలియదు. ఆ నైట్ క్లబ్ చూడ్డా నికి సామాన్యంగానే ఉన్నప్పటికీ__అందులో దొరకని నదుపాయాలులేవు. అయితే అక్కడి సదుపాయాలు అప్పటికప్పుడు లభించవు. ముందుగా ఏజెంట్లద్వారా

అన్నీ ఏర్పాట్లూ చేసుకోవాలి. అప్పటికప్పుడు వెళ్ళిన వాళ్ళకు అది మామూలు బార్సలాగే వుంటుంది. ఆ క్లబ్‌లో చాలా రహస్యపు స్థలాలున్నాయని అంతా అనుకుంటూంటారు.

సుదర్శనరావు గోవిందరావు సాయంతో పైకి వచ్చిన సామాన్యుడు. ఆయన ఇచ్చిన పెట్టుబడి డబ్బులతోటే సరస్వతీవిలాస్ కాఫీహోటల్ చిన్నయెత్తున ప్రారంభమై ఇప్పటికి పెద్ద హోటలయ్యింది. ఊళ్ళోని మంచి హోటళ్ళలో అది ఒకటైనప్పటికీ సుదర్శనరావు అసలు ఆదాయం వేరేవుంది. అదే "సెక్స్ అండ్ ఓన్లీసెక్స్ నైట్ క్లబ్" ద్వారా వచ్చేది. ఆ క్లబ్‌కు అతను యజమాని. ఆ యాజమాన్యం పేరుకు మాత్రమేనని, అసలు యజమాని గోవింద రావనీ చాలా తక్కువమందికి తెలిసిన నిజం.

సుదర్శనరావు గోవిందరావుకు నమ్మకస్థుడైన భాగస్థుడే. ఎప్పుడూ ఆయన గోవిందరావును మోసంచేయడానికి ప్రయత్నించలేదు. అందుక్కారణం సుదర్శనరావు విశ్వాసం కాదు. గోవిందరావు అప్రమత్తత.

అయితే ఇటీవలే చిన్న ఇబ్బంది వచ్చి పడింది. గోవిందరావు కొడుకు ప్రభాకర్, సుదర్శనరావు కూతురు స్వాతిని ప్రేమించాడు. కానీ స్వాతి ప్రభాకర్ అంటే ఇష్టపడలేదు. స్వాతిని పెళ్ళి చేసుకోకపోతే బ్రతుకలేనని ప్రభాకర్ అన్నాడు. ఈ విషయంలో గోవిందరావు కలగజేసుకుని సుదర్శనరావుపై ఒత్తిడి తీసుకు వచ్చాడు.

"అమ్మాయికి యిష్టం లేదుట .." అన్నాడు సుదర్శనరావు.

"చిన్నపిల్ల. నువ్వు నచ్చజెపితే వింటుంది. నయానో భయానో చెప్పి ఒప్పించు" అన్నాడు గోవిందరావు.

"నా బ్రతుకంతా నా పిల్లలకోసం. వాళ్ళ మనసు నొప్పించడం నావల్ల కాదు."

"వాటం చూస్తే అసలు నీకే ఈ పెళ్ళి ఇష్టం లేనట్లుంది."

సుదర్శనరావు భయపడలేదు కానీ వినయాన్ని వదిలి పెట్టలేదు. "మీరు నన్నేమయినా అనండి_పడతాను. నన్ను శిక్షించండి_అనుభవిస్తాను. శాసించండి, అమలు చేస్తాను. కానీ నా పిల్లల్ని శాసించకండి. శాసించమని నాకు చెప్పకండి" అన్నాడు.

"ఫలితాలు తీవ్రంగా ఉండవచ్చు_తెలుసా?" అని బెదిరించాడు గోవిందరావు.

"భయం లేదు. కానీ నాకు నేనై ఏ పరిస్థితుల్లోనూ అన్యాయం తలపెట్టను. ఇప్పటికింతకాలాన్నుండీ మీకు నమ్మకంగా పనులు చేసిపెడుతున్నాను. అది మీరూ గుర్తుంచుకోవాలి. మీరు నాకు అన్యాయం తలపెడితే మాత్రం నేను ఎదురుతిరుగుతాను. ఎదురుతిరిగితే బహుశా నేను మీకంటే గొప్పవాడ్ననుకుంటాను" అన్నాడు సుదర్శనరావు.

"సరే_వెళ్ళు. ఆలోచించి మళ్ళీ కబురు చేస్తాను" అన్నాడు గోవిందరావు. సుదర్శనరావు వెళ్ళిపోయాడు. గోవిందరావు ఆలోచించి కబురు చేశాడు_సుదర్శనరావుకి కాదు, వెంకట్రావుకు.

సుదర్శనరావు, వెంకట్రావు రెండు భుజాలాయనకు. అయితే అందులో ఎవరు కుడిభుజమో, ఎవరు ఎడమ భుజమో చెప్పడం కష్టం.

సుదర్శనరావుకు గోవిందరావులోని రసికుడు, హంత కుడు తెలియదు. వ్యాపారి మాత్రమే తెలుసును. వెంక

ట్రావుకు గోవిందరావు రసికత, రక్తదాహం బాగా తెలుసు.

అనుకున్న పని సాధించడం కోసం వలలు పన్న డమూ, ఎత్తులు వేయడమూ, రంగులు మార్చడమూ సుదర్శనరావు అలవాటు. అవి అమలు చేయడం వెంక ట్రావు పద్ధతి.

సుదర్శనరావును చంపించాలని గోవిందరావు తీసు కున్న నిర్ణయం ఆవేశంవల్ల కలిగినది కాదు. ఆయనలో ఎంతో కాలంగా రేగుతున్న అనుమానా లారోజు ధృవ పడ్డాయి.

ఒక మనిషిని ఒకే స్థితిలో ఎక్కువ కాలముంచడం వల్ల అతడు ప్రమాదకారిగా పరిణమించే అవకాశమున్న దని ఆయనకు తెలుసు. "సెక్స్ అండ్ ఒన్లీ సెక్స్" నైట్ క్లబ్‌కు కొత్త యజమానిని ఆయన నిర్ణయించి కొద్ది కాలం ఆయింది. సుదర్శనరావునా స్థానం నుంచి ఎలా తొలగించాలా అని ఆయన ఆలోచిస్తున్నాడు.

వెంకట్రావుకు తన కోరిక చెప్పాడాయన. వెంక ట్రావుకు అనుకోకుండా రాముతో పరిచయం లభించింది. లక్ష రూపాయలకు బేరం పెట్టాడు. రెండు లక్షలని గోవిందరావుకు చెప్పాడు.

"ఈ వ్యవహారంలో ఒక లక్ష లాభం. కానీ లాభాన్ని రెండు లక్షలుగా కూడా చేయవచ్చేమో చూడాలి..." అనుకున్నాడు వెంకట్రావు.

## 3

"నమస్కారమండీ—నా పేరు రాము" అన్నాడు రాము.

సుదర్శనరావు చిరాగ్గా అతని వంక చూసి. "నాదు మీకేం పని?" అన్నాడు.

రాము కంగారుగా ఆయనవంక చూసి "ఏమీ అనుకోవద్దు. మీ ముఖంలో మృత్యుకళ కనిపిస్తోంది. ఒకటి లేక రెండు రోజులకంటె మీరు బ్రతకరనుకుంటాను..." అన్నాడు.

సుదర్శనరావు ముందు కంగారుపడ్డా తమాయించుకుని "కారెక్కుతావా?" అన్నాడు.

"మీ రెక్కమంటే — అలాగే!" అంటూ కార్లో కూచున్నాడు రాము. కారులో యింకెవ్వరూ లేరు. కారును సుదర్శనరావ్ డ్రైవ్ చేస్తున్నాడు.

"నే నెవరో తెలుసా?" అన్నాడు సుదర్శనరావు.

"తెలియదండి."

"తెలిసే ఉండాలి. లేకపోతే నా చావు గురించి ఎందుకు చెపుతావు?"

"ఊరికే పని లేకుండా ఇక్కడ నిలబడ్డానండి. ఇంతలో మీరు కనబడ్డారు. చూడగానే మీ ముఖంలో మృత్యు కళ కొట్టవచ్చినట్లు కనబడింది. వెంటనే చెప్పాలనిపించి చెప్పేశాను. మీరేమో కారెక్కమన్నారు" అన్నాడు రాము.

"నీ మాటలు నేను నమ్మను. నువ్వు గోవిందరావు మనిషివి..." అన్నాడు సుదర్శనరావు. రాము గోవింద రావెవరో తెలియనట్లుగా ఆశ్చర్యంగా ముఖం పెట్టాడు.

"నువ్వు నటిస్తున్నావు..." అన్నాడు సుదర్శనరావు.

"పెద్దవాళ్ళ గొడవలు నాకు తెలియవు. మీకు నా మీద ఎందుకు అనుమానంగా వుందో తెలియడం లేదు. ఇంతవరకూ నేను మృత్యుకళ ఉందని చెప్పినవాళ్లెవ్వరూ

బ్రతకలేదు. మీకు ముందుగా కాస్త సమయం వుంటుం దని చెబుతున్నాను. ఏమయినా వీలునామాలు వగైరా బాకీలుంటే తొందరగా రాసేసుకోండి. నా మాట అబద్ధం కాదు. నమ్మండి. మీకోసం చెబుతున్నాను..." అన్నాడు రాము.

"నిన్ను పోలీసులకు అప్పజెపుతాను" అన్నాడు సుదర్శనరావు.

"అందువల్ల మీ ప్రాణాలు రక్షించబడవు. మిమ్మల్నెవ్వరూ హత్య చెయ్యబోవడం లేదు. మీకు చావు వచ్చేస్తోంది. మిమ్మల్నెవ్వరూ రక్షించలేరు. రక్షిస్తే ఆ పరమ శివుడే మిమ్మల్ని రక్షించగలగాలి. వెళ్ళి ఆ శివుడికో కొబ్బరికాయ కొట్టుకుని అందులో నాకో చిన్న ముక్క పెట్టి తినగలిగినంత మీరు తినండి. అదృష్టం బాగుంటే ప్రాణాలు దక్కుతాయి. లేదూ కర్మఫలాన్ని తప్పించ లేం..." అన్నాడు రాము.

సుదర్శనరావు అతని మాటలకు జవాబివ్వకుండా ఆలోచనలో పడ్డాడు. ఎవరీ మనిషి? ఎందుకిలా నన్ను పలకరించి భయపెడుతున్నాడు? గోవిందరావు పంపిన మనిషి కాకపోతే ఇతనిలా ఎందుకు చెబుతున్నాడు? నిజంగానే తన ముఖంలో మృత్యుకళ కనబడుతోందా? అన్ని విధాలా ఆరోగ్యంగా ఫీలవుతున్న అతను ఎందుకు చచ్చిపోతాడు?

ఇలా ఆలోచిస్తూనే సుదర్శనరావు కారును అప్రయత్నంగా ఓ శివాలయం ముందు ఆపాడు. గుడి ముందు కొబ్బరికాయలు అమ్ముతున్నారు. సుదర్శనరావో కాయ కొని గుళ్లోకి వెళ్ళాడు. రాము ఆయనతోపాటు గుడిలోకి వెళ్ళలేదు. ఆయనకోసం బయటే ఎదురు చూస్తూ నిల

బడ్డాడు. కాసేపటికి చేతిలో కొబ్బరి చెక్కతో తిరిగి వచ్చాడు సుదర్శనరావు.

"నాకొక్క ప్రసాదం పెడితే నా దారిన నేను పోతాను..." అన్నాడు రాము.

సుదర్శనరావు అక్కడికక్కడ చెక్క బద్దలుకొట్టి తనోముక్క నోట్లో వేసుకుని, రాముకోముక్క ఇచ్చాడు.

"వెంటనే ఇంటికివెళ్ళి వీలునామా రాసుకోండి. మీ ముఖంలో మృత్యుకళ పెరుగుతోంది" అన్నాడు బాబు.

ఈసారి సుదర్శనరావుకు నిజంగానే భయంవేసింది. ఆయన కారెక్కి స్పీడుగా డ్రయివ్ చేసుకుంటూ ఇల్లు చేరాడు.

ఇల్లు చేరేక ఆయనకు చాలా ధైర్యంవచ్చింది. తనింట్లో తనని ఎవ్వరూ ఏమీచేయలేరు. పరిస్థితులు చూస్తుంటే తనో రెండుమూడు రోజులపాటు ఇల్లు కదలక పోవడం మంచిదేమోనని ఆయనకు అనిపించింది.

ఎందుకయినా మంచిదని ఆయన లాయర్‌కికూడా ఫోన్ చేశాడు.

# 4

"డబ్బు సిద్ధంగావుందా?" అన్నాడు రాము.

"పని పూర్తయ్యాక నేకదా డబ్బిస్తానని చెప్పాను" అన్నాడు వెంకట్రావు.

"పని పూర్తయిందిగాబట్టే డబ్బు సంగతి అడిగాను" అన్నాడు రాము.

"ఏడిసినట్లుంది. ఈరోజు సుదర్శనరావు ఇల్లు కదల లేదు."

"శవం కదలడం ఎక్కడయినా విన్నారా?"

"లేదు."

"అయితే సుదర్శనరావూ ఇల్లు కదలడు."

వెంకట్రావు ఆశ్చర్యంగా రాముకేసి చూస్తూ—"అయితే సుదర్శనరావు శవంగా మారేడంటావ్?" అన్నాడు.

"ఓసారి వాళ్ళింటికి ఫోన్ చేసి చూడండి" అన్నాడు రాము.

వెంకట్రావు వెంటనే రిసీవర్ ఎత్తి ఓ నంబర్ డయల్ చేసి "హలో, సుదర్శనరావుగారున్నారా, అర్జంటుగా మాట్లాడాలి" అన్నాడు. అవతలినుంచి వచ్చిన సమాధానం వింటూనే అతను తడబడి "అయాం వెరీ సారీ" అంటూ ఫోన్ పెట్టేసి రామువంక అదోలా చూశాడు.

ఈ పర్యాయం అతనికి రామును చూస్తే భయం కలిగింది. గుండెలు తీసిన బంటులా కనిపించాడు రాము అతనికి.

"చాలా ఆశ్చర్యంగావుందే, ఎలా చేశావీ హత్య?" అన్నాడు వెంకట్రావు.

"నేను హత్య చేయడమేమిటి? సుదర్శనరావు చచ్చిపోయాడు. అంతేగా."

"అవును. కానీ ఆయన చచ్చిపోతాడని నీకు ముందే తెలును..."

"చచ్చిపోయేముందు మనుషుల ముఖాల్లో మృత్యుకళ వస్తుంది. అది అందరూ కనిపెట్టలేరు. ఓ గురువుకు శుశ్రూష చేసి నేర్చుకున్నానది. సుదర్శనరావు ముఖంలో మృత్యుకళ చూసేకనే నేను మీదగ్గరకు వచ్చాను—" అన్నాడు రాము.

"అతన్ని నేను చంపాలనుకుంటున్నట్లు నీకెలా తెలుసు?"

రాముకు జవాబేమీ తోచినట్లులేదు. "అది మీకు చెప్ప

కూడదు, రహస్యం'' అని వూరుకున్నాడు.

''ఇప్పుడు నేను నీకు డబ్బివ్వను. ఏం చేస్తావ్?'' అన్నాడు వెంకట్రావు.

''నిన్ను చంపేస్తాను'' అన్నాడు రాము కోపంగా.

''చంపితే జైలుకు వెడతావ్.''

''సుదర్శనరావు చస్తే వెళ్ళాను గనుకనా, నిన్ను చంపితే వెళ్ళడానికి?''

''అంటే సుదర్శనరావును చంపినట్టే నన్నూ చంపుతావన్నమాట. దీన్నిబట్టి హత్యచేయడానికి నీకేదో విచిత్రమైన పద్ధతి ఉన్నదనిపిస్తోంది. మృత్యుకళ అన్న మాట అబద్ధం.''

రాము నవ్వాడు. ''నాకిప్పుడు నీ ముఖంలో మృత్యుకళ కనిపిస్తోంది. బహుశా నువ్వుకూడా ఒకటి రెండు రోజులకంటె బ్రతకవేమో?''

వెంకట్రావు కంగారుగా ''నీ డబ్బు నీకిస్తానుగానీ ఆ మాట మాత్రం అనొద్దు'' అంటూ వోసారి లోపలికెళ్ళి వో చిన్న సంచీతో తిరిగివచ్చాడు.

''సరిగ్గా లక్ష. లెక్కపెట్టుకో'' అన్నాడు వెంకట్రావు.

రాము లెక్కపెట్టుకుని తృప్తిగా తలాడించాడు.

''అడ్వాన్సు తీసుకోకుండా పనిచేశావ్. మోసం చేస్తే ఏం చేద్దువు?'' అన్నాడు వెంకట్రావు.

''ఏదయినా వైధవపని చేయడానికి నువ్వో మాంత్రికుడి సాయం తీసుకున్నావనుకో. ఆ మాంత్రికుడి శక్తులు స్వయంగా తిలకించేక వాణ్ని మోసం చేయాలంటే నీకు భయంగా వుంటుంది. నా విషయంలోనూ అంతే! నేను మాంత్రికుడిలాంటి వాణ్ని'' అన్నాడు రాము.

"అయితే ఓ విషయం మర్చిపోకూడదు నువ్వు. సుదర్శనరావుది హత్యనీ, హంతకుడివి నువ్వనీ తెలిసిన ఏకైక వ్యక్తిని నేను. అందువల్ల నా విషయంలో శాస్త్ర జాగ్రత్తగా ఉండాలి నువ్వు."

రాము చిరాగ్గా సుదర్శనరావు వంక చూచి "ఎందుకీ పనికిమాలిన బెదిరింపులు? సుదర్శనరావుది హత్య అని ఋజువు చేయడం ఎవరితరమూ కాదు. మృత్యుకళను కనిపెట్టగలిగిన వాడిని కాబట్టి నాకు తెలిసింది. నీకు చెప్పాను. అంతమాత్రాన నన్ను హంతకుడనుకోవడం నీకు ఆరోగ్యం కాదు. ముఖంలో మృత్యుకళ కనిపించిందంటే చావడానికి రెండు రోజులు కూడా పట్టదు. అది రాకుండా జాగ్రత్తపడు..." అన్నాడు.

"ఇంతకీ ఇప్పుడు నా ముఖంలో మృత్యుకళ వుందా?" అన్నాడు వెంకట్రావు.

"ప్రస్తుతానికి లేదు. కనిపించినప్పుడు నే స్వయంగా చెబుతాను" అని అక్కడ్నించి వెళ్ళిపోయాడు రాము.

"నీలాంటివాడ్ని తెలివిగా వుపయోగించుకుంటాం కానీ, తెలివి తక్కువగా చంపుకుంటామా?" అనుకున్నాడు వెంకట్రావు.

## 5

బీచివద్ద ఒంటరిగా కూర్చుని వుంది స్వాతి. ఆమె కళ్ళలో విచారం గూడు కట్టుకున్నట్లుంది. ఆ విచారం వెనుక ఏదో ఆలోచన కూడా కనబడుతోంది. ఆ సమయంలో ఎవరో పలకరిస్తే ఉలిక్కిపడి తలెత్తి చూసింది స్వాతి.

"నేను తెలుసుకానీ నా పేరు మీకు తెలియదు. అందుకే చెబుతున్నాను. నా పేరు రాము. నన్ను మీరు

యొరక్కపోయినా మీ పేరు నాకు తెలుసు. స్వాతి''
అన్నాడు రాము.

''మీరు నాకు బాగా తెలుసు. చాలా కాలంగా నా వెంటబడుతూ నన్ను విసిగిస్తున్నారు'' అంది స్వాతి చిరాగ్గా.

''అందుకే నన్ను మీ రెరుగరని చెప్పాను. నేనురోడ్డు పైన రోమియోనని మీరనుకుంటున్నారు. కానీ షేక్స్పియర్ రోమియోనని మీకు తెలియదు.''

''ఎవరో ఒకరు. మీరంటే నాకిష్టంలేదు'' అంది స్వాతి.

''మీ వెంటబడడమే నేను చేసిన తప్పయితే అదే మీ అయిష్టానికి కారణమయితే మీఇష్టప్రకారమే నడచుకుంటాను. కానీ ఈ ఒక్క రోజుకూ నాతో కాసేపు మాట్లాడండి. నా బాధ అర్థం చేసుకోండి. నాకో అవకాశమివ్వండి'' అన్నాడు రాము.

''చెప్పండి'' అంది స్వాతి.

''మీరు అందంగా వుంటారు. చాలామంది అందంగా వుంటారు. మీ అందం నాకు నచ్చింది. మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. అది తప్పంటారా?''

''కాదు.''

''మీకు నేను నచ్చనిపక్షంలో అందుకు కారణం తెలుసుకోగోరుతున్నాను. తప్పంటారా?''

''కాదు. కొన్నింటికి కారణాలుండవు. ఉన్నా కొందరికి చెప్పేశక్తి వుండదు. కొందరికి ఎన్టీ రామారావంటే ఇష్టం. కొందరికి నాగేశ్వరరావంటే ఇష్టం. నాగేశ్వరరావును అభిమానించేవారికి రామారావు బాగా నటించినా నచ్చదు. రామారావు అభిమానులకు నాగేశ్వ

ప్రావు బాగా నటించినా బాగుండదు. అందుకు కారణ మడిగితే ఏమిటి చెప్పడం? చేస్తు... అంతే! మీ ప్రవర్తన నాకు సంతృప్తికరంగా అగుపించలేదు. మీరేమిటి? ఆ మాటకొస్తే నాకు మగవాళ్ళెవరన్నా మంటే! ఆడదాని వంక మృగాల్లా చూస్తూంటారు" అంది స్వాతి.

"నేను మీకు నచ్చలేదు. అయినా నేను మిమ్మల్ని ఆరాధిస్తున్నాను. తప్పా?"

"తప్పుకాదు."

"అయితే నా యీ చిన్న కానుకను స్వీకరించి నన్ను ధన్యుడ్ని చేయండి" అంటూ ఓ చిన్న పెట్టె స్వాతికి అందించాడు. స్వాతి అప్రయత్నంగా ఆ పెట్టె అందు కుని చూసి అదిరిపడింది. అందులో డైమండ్ నెక్లెస్ ఉంది.

"డైమండ్ నెక్లెస్. చాలా ఖరీదుంటుంది?" అంది స్వాతి ఆశ్చర్యంగా.

"దాని ఖరీదు పాతిక వేలు మాత్రమే! కానీ దాని విలువ నా ప్రేమతో పోలిస్తే చాలా స్వల్పం" అన్నాడు రాము.

"ఈ కానుక ఇవ్వడంలో మీ వుద్దేశ్యం?"

"దురుద్దేశ్యం మాత్రం కాదు. మిమ్మల్ని డబ్బుతో కొనలేనని తెలుసు. మీ తాహతుకుతగ్గ బహుమతులివ్వ గల స్తోమత నాకు లేదు. అయినా ధైర్యం చేశాను."

స్వాతి మనసులో అతనిపట్ల రవంత ఆదరభావం కలి గింది. పాతిక వేలు విలువజేసే డైమండ్ నెక్లెస్‌ని ఆరా ధనతో కూడిన కానుకగా సమర్పించుకుంటున్న ఆ యువకుడి వంక కొత్తరకమయిన కుతూహలంతో చూసిం

దామె. ఆమె చూపులు రాముకు నిజంగా పరవశం కలిగించాయి.

"మీరేం చేస్తుంటారు?" అనడిగిందామె.

"పెద్దలు సంపాదించిన ఆస్తిని అనుభవిస్తున్నాను. ఏమీ పని లేదు. మిమ్మల్ని చూసేవరకూ నా జీవితానికో లక్ష్యమంటూ లేదు. మిమ్మల్ని చూసేక మీ ప్రేమను సంపాదించడమే నా జీవితలక్ష్యంగా తోచింది. మీకీ కానుకను ఎప్పుడో సమర్పించుకోవలసింది. కానీ తండ్రి పోయిన దుఃఖంలో ఉంటారని భావించి మిమ్మల్ని సమీపించడానిక్కూడా యింతకాలమూ సాహసించలేక పోయాను" అన్నాడు రాము.

"నా తండ్రి చావుగురించి దుఃఖించాలో కూడదో తెలియని పరిస్థితి నాది" అంది స్వాతి.

"ఆయన డబ్బు అన్యాయంగా కూడ బెడుతున్నాడు. డబ్బుకోసం ఎన్నో తప్పులు చేస్తున్నాడు. ఆయన పద్ధతులు నాకు నచ్చక ఆయన్నసహ్యించుకుంటూంటాను. కానీ నా అసహ్యాన్నాయన లెక్క చేయడు. నేనంటే ఆయనకెంత ప్రేమో చెప్పలేను. నేనెన్ని తిట్టినా ఆయన కోపగించుకునేవాడు కాదు.

ఒక్క ధన సంపాదన విషయంలో తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ నా ఇష్టప్రకారమే మసలుకునేవాడు. ఆ విషయం నేనన్నప్పుడల్లా—స్వాతీ, నీకు తెలియదమ్మా! డబ్బు సంపాదించడం చాలా కష్టం. లక్ష్మి చంచలమయినది. ఎవరికి, ఏ విధంగా లభిస్తుందో చెప్పలేం. కొందరికి నీతివర్తన లాభించవచ్చు. కొందరికి అవినీతి లాభించవచ్చు. కొందరు నీతి కారణంగా నిర్భాగ్యులయిపోతే మరికొందరు అవినీతి కారణంగా అన్నీ పోగొట్టుకోవచ్చు.

మనకు కలిసివచ్చిన పద్ధతిని విడనాడ్డం నాకిష్టంలేదు. డబ్బు విలువ అది పోయినప్పుడుగానీ తెలియదు. నీకు డబ్బు విలువ తెలియజెప్పడంకోసంకూడా డబ్బుపోవడం నా కిష్టంలేదు_అంటూండేవాడు నాతండ్రి.

అన్యాయపు ధనంతో నా శరీరం పెరుగుతోందనీ, ఊపిరి పీల్చుకుంటోందనీ అర్థమై నాకు చాలా బాధగా వుండేది. అందుకుని ఇప్పుడు నేనొక విచిత్రావస్థలో వున్నాను. ఆయన పోయినందుకు సంతోషించాలా, విచారించాలా అన్నది తేలలేదు. మనసుకుమాత్రం బాధగానే వుంది."

స్వాతి అంత వివరంగా మాట్లాడుతుందని రాము అనుకోలేదు. తననామె ఆత్మీయుడిగా భావించిందని అతను గ్రహించి సంతోషించాడు.

"న్యాయానికీ, అన్యాయానికీ సరయిన అర్థాలులేవు. మనిషి మనిషికీ మారిపోతాయవి. మిమ్మల్ని ప్రేమించిన మీ తండ్రిని మీరూ ప్రేమించాలి. ఆయన ఎలా డబ్బు సంపాదిస్తేనేం — సమాజంలో గౌరవం సంపాదించుకున్నాడు గదా! సమాజానికి మాత్రం ఆయన పద్ధతులు తెలియవు గనుకనా. సమాజం ఆమోదించినది న్యాయమే అవుతుంది. అందువల్ల మీరు మీతండ్రి అవినీతికి పాల్పడుతున్నాడని విచారించడం అనవసరం" అన్నాడు రాము.

"పోనీ అలా సరిపెట్టుకుందామన్నా లాభంలేదు. నా తండ్రి పాల్పడిన అవినీతి కారణంగానే నేనిపుడు చిక్కుల్లో పడ్డాను" అంది స్వాతి.

"ఎన్నోలక్షలకు వారసురాలైన మీకు చిక్కులా?" అన్నాడు రాము.

"అవినీతికి పాల్పడిన మాతండ్రిగారికి అన్నీ చిక్కులే. ఆయన గోవిందరావుగారి భాగస్వామి. నాన్నగారు పోవడంతో వ్యాపారాలన్నీ ఆయన చేతిలోకి వెళ్ళిపోయాయి. ఈ క్షణంలో ఆయన తలచుకుంటే మమ్మల్ని వీధిలో నిలబెట్టగలడు. కానీ అలాచేయడు. అంతకంటె దారుణమైన షరతు పెట్టాడు" అంది స్వాతి.

"ఏమిటది?"

"ఆయన కొడుకు ప్రభాకర్ని పెళ్ళిచేసుకోవాలిట."

రాము తేలిగ్గా నవ్వేసి "ఈడూజోడూ బాగానే వుంటుందిగదా!" అన్నాడు.

"డబ్బున్నచోట అవినీతి వుంటుంది. దాన్నించి తప్పించుకోవాలన్నదే నా ఆశ. ప్రభాకర్ సంగతి నాకు బాగా తెలుసు. అతడికి లేని దురలవాటు లేదు."

"అయితే చేసుకోకండి."

"నేను పెళ్ళి చేసుకోకపోతే మా అమ్మ, అన్నయ్య ఇబ్బంది పడతారు. వాళ్ళ గురించిన ఆలోచన లేకపోతే నాకేబాధా లేదు" అంది స్వాతి.

"మీరలా మమకారాలు పెంచుకోకూడదు. మీ తండ్రికిలాగే మిగతా బంధువులుకూడా చచ్చిపోవచ్చు. వాళ్ళగురించి మీ ఆశలు చంపుకోకండి."

"నా ఆశలకోసం నా బంధువులు చావాలని నేననుకోవడం లేదు. అంతకంటె సులభమైన మార్గాలుంటాయి."

"అదికాదు. మీ నాన్నగారు హత్యచేయబడ్డారుకదా- అలాగే మీ కుటుంబంలోని సభ్యులొక్కొక్కరే హత్య చేయబడితే?" అన్నాడు రాము.

స్వాతి చిత్రంగా రాముకంక చూసి "మా నాన్న హత్య చేయబడ్డాడని ఎవరు చెప్పారు మీకు? ఆయనది సహజ మరణం" అంది.

"హఠాత్తుగా ఏ రోగం లేకుండా చనిపోతే హత్యయేమో ననుకున్నాను."

"ఏ రోగంలేని మాట నిజమే. కాని ఎందుకో ఆయన హార్ట్ ఫెయిలయింది. అంతే!" అంది స్వాతి.

రాము ఓసారి గొంతు సవరించుకొని "మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను కాబట్టి ఈ విషయంలో మీకు సాయపడగలను. ఇప్పుడున్న ఇబ్బందినుండి బయటపడడానికి మీరు ప్రభాకర్‌నించి దూరం కావాలనుకుంటున్నారా, అమ్మ, అన్నలనించి దూరం కావాలనుకుంటున్నారా?" అన్నాడు.

"అది చెప్పడంవల్ల ప్రయోజనం?"

"నాకు మనుషుల ముఖాలుచూసి మృత్యుకళ వుంటే చెప్పగలశక్తివుంది. ప్రభాకర్ చావుత్వరలో వున్నదో, లేదో అతని ముఖంచూసి చెప్పగలను. అలాగే మీ..."

"ఆగండి" అంది స్వాతి. "అంటే మీరు ప్రభాకర్ని హత్యచేస్తారా?"

"అలా ఎందుకనుకున్నారు?"

"ఎందుకంటే" అని ఆగింది స్వాతి. "మృత్యుకళ ముఖంలో ఉందో లేదో చెప్పడానికీ, నా యిష్టానికీ లంకెపెట్టారు మీరు. నేను అమ్మ, అన్న అక్కర్లేదనుకొంటే మృత్యుకళను వారి ముఖాల్లోకి మార్చేశక్తి మీకు వుందా?"

"మృత్యుకళను చదవగల శక్తిమాత్రమే నాకుంది" అన్నాడు రాము. "అయితే మిమ్మల్ని నేనా ప్రశ్న

అడగటానికి వేరే కారణముంది. మీ జవాబుని బట్టి, నిజాన్ని దాచిపెట్టడం కానీ చెప్పడంకానీ చేయాలను కున్నాను."

స్వాతి నిట్టూర్చి "ప్రభాకర్ బారినుంచి నన్నురక్షిస్తే నేను మిమ్మల్ని ప్రేమించడం ప్రారంభించినా ఆశ్చర్యం లేదు" అంది.

# 6

"అరే బాప్ రే—" అన్నాడు రాము.

"ఎవరు మీరు?" అన్నాడు ప్రభాకర్.

"నా పేరు రాము. మనుషులకు మామూలుగా తెలియని కొన్ని రహస్యాలు చెప్పగలను" అన్నాడు.

"రహస్యాలంటే నాకు ఆసక్తిలేదు.కానీ మీరు నన్ను చూసి అరేబాప్ రే అన్నారు. ఎందుకో చెప్పాలి!"

"అది రహస్యం! రహస్యాలంటే మీకు ఆసక్తి లేదు కదా!".

ప్రభాకర్ చిరాగ్గా అతని వంక చూసి అశ్రద్ధ చేసి కదలబోయాడు.

"మీరు స్వాతి అనే అమ్మాయిని ప్రేమించారు. ఆ అమ్మాయి మిమ్మల్నింతవరకూ ప్రేమించలేదు. అయితే ఇదే సమయం. మీరు బలవంతంగానయినా వెళ్ళి ఆ అమ్మాయిని అనుభవించాలి. గత్యంతరం లేదు" అన్నాడు రాము.

ప్రభాకర్ చటుక్కున వెనక్కి తిరిగి "ఇవన్నీ మీ కెలా తెలుసు?" అన్నాడు.

"రహస్యాలు చాలా తెలుసు నాకు."

"అదిసరే-నాకిష్టమయిన అమ్మాయిని బలవంతంగా

అనుభవించడం మినహా గత్యంతరంలేని సమయం ఇదే అన్నారు. ఎందుకు?"

"ఏందుకా?" అని నవ్వాడు రాము. "చెబితే విని భరించగలవా?"

ప్రభాకర్ కంగారుగా—"త్వరగా చెప్పండి" అని అన్నాడు.

"మీ ముఖంలో మృత్యుకళ కొట్టవచ్చినట్లు కనబడుతోంది. బహుశా ఇంకొక్క రోజు బ్రతుకుతారేమో" అన్నాడు రాము.

ప్రభాకర్ ముఖంలో చెమట్లుపోశాయి—"ఏమిటన్నారు?" అన్నాడు.

రాము నవ్వి. "ఇదే జోస్యం నేను సుదర్శనరావుగారికి కూడా చనిపోయేముందు చెప్పాను. ఆయన నమ్మలేదు..." అన్నాడు.

"ఎవర్నువ్వు?" అన్నాడు ప్రభాకర్.

"నీ శ్రేయోభిలాషిని. నీది అదృష్ట జాతకం. అన్నింటికీ పెట్టి పుట్టినవాడివి. నీవన్న లోటల్లా ఒక్కటే-స్వాతిని అనుభవించడం. ఆ కోరిక తీరకుండా నువ్వు చావకూడదు. ముందుగా చావు తెలియడం ఎంతో అదృష్టం. వెంటనే బయల్దేరు" అన్నాడు రాము.

"నీ మాటలు నమ్మాలంటావా?"

"ఓ సలహా యిస్తాను. ఇద్దరం కలిసి ఇక్కడికి దగ్గరలో వున్న శివుడి గుడికి వెడదాం. నువ్వు లోపలకి వెళ్ళి ఓ కొబ్బరికాయ కొట్టు. ప్రసాదం నాక్కాస్త పెట్టి నువ్వు కాస్త తిను. అదృష్టం బాగుంటే ప్రాణాలు దక్కుతాయి."

"అలాగెందుకు చేయడం?"

"యమధర్మరాజా బారినుంచి మార్కండేయుణ్ణి శివుడేగదా రక్షించాడు? నీ ప్రయత్నం నువ్వు చేసుకో. గుడినించి తిన్నగా స్వాతి ఇంటికి వెళ్ళు. ఆ ఇంట్లో నీకు అడ్డు లేదుగా. స్వాతిని బలవంతంగానయినా నీదాన్ని చేసుకో" అన్నాడు రాము.

ప్రభాకర్‌కు రాము సలహా నచ్చింది. ఇద్దరూ కలిసి శివుడి గుడికి వెళ్ళారు.

ప్రభాకర్ ఓ కొబ్బరికాయ కొనుక్కుని గుళ్ళోకి వెళ్ళి ఓ చెక్కతో తిరిగి వచ్చాడు. అక్కడికక్కడ ముక్క కొట్టి కొద్దిగా రాముకిచ్చి తను కాస్త తిన్నాడు. రాము కొబ్బరి ముక్క తినకుండా జేబులో వేసుకుని "నాకు కావలసిన ప్రియురాలుంది. దేవుడి ప్రసాదాన్ని మేమిద్దరమూ కలిసి తింటాము" అన్నాడు.

ప్రభాకర్ రాము వంక చూసి నవ్వి "నువ్వు చెప్పిన మృత్యుకళ సంగతి నేను నమ్మినా నమ్మకపోయినా స్వాతి విషయంలో నువ్విచ్చిన సలహా మాత్రం చాలా బాగుంది. నాలో నిద్రాణమైన కోర్కెను ఇన్నాళ్ళకు తట్టి లేపావు. థాంక్స్" అన్నాడు.

ప్రభాకర్ వెళ్ళిపోయాక రాము తన జేబులోంచి ఓ సిగరెట్ పెట్టె తీశాడు. అందులోంచి ఓ సిగరెట్ తీశాడు. తన జేబులోని కొబ్బరి ముక్కలను చిన్న చిన్న తుంపులుగా చేసి ఆ సిగరెట్లో వేశాడు.

అందులో ఏమాత్రం ఖాళీ వుందోగానీ ఆ తుంపులు అందులో పట్టాయి. తార్వాత సిగరెట్‌ని మళ్ళీ పెట్టిలో పెట్టి__సిగరెట్ పెట్టి జేబులో పెట్టేసుకున్నాడు.

# 7

"ఈ యింట్లో నాకు ఎదురుందా?" అన్నాడు ప్రభాకర్.

సుదర్శనరావు భార్య మాలతి ఏమీ మాట్లాడలేదు.

"అత్తయ్యా-నేను చేసిన తప్పేమిటి? స్వాతి నన్నెందుకు పెళ్ళి చేసుకోదు—నువ్వే చెప్పాలి!" అన్నాడు ప్రభాకర్.

"మేమిచ్చిన స్వేచ్ఛ దాన్ని పాడు చేసింది. మా మాటే వినడం లేదు ఇప్పుడది" అంది మాలతి.

"స్వాతి ఇప్పుడేం చేస్తోంది?" అన్నాడు ప్రభాకర్.

"మేడమీద గదిలో చదువుకుంటోంది" అంది మాలతి బాధగా.

కూతురి పద్ధతి ఆవిడకేమాత్రమూ నచ్చలేదు. మాలతి డబ్బుకోసం గడ్డి తినమన్నా సందేహించదు. ఆవిడ కారణంగానే సుదర్శనరావు డబ్బు కోసం తప్పుదార్లు తొక్కాడు.

మాలతి యిప్పుడు విలాస జీవితానికి బాగా అలవాటు పడింది. మాలతి కొడుకు చెంగల్రావు కూడా అన్నీ ల్లి పోలికలే వచ్చాయి. ఎటొచ్చీ స్వాతి మాత్రమే ఆ యింట్లో తప్పబుట్టినట్లు కనబడుతోంది.

ఇప్పుడు భర్త పోయాక గోవిందరావు మాలతిని బెదిరిస్తున్నాడు. తన కొడుకు ప్రభాకర్ని స్వాతి చేసుకోని పక్షంలో ఆ కుటుంబాన్ని కట్టు గుడ్డలతో నడివీధిలో నిలబెడతానని ఆయన మాలతిని హెచ్చరించాడు. మాలతి స్వాతికి ఎన్నో విధాల చెప్పి చూసింది.

"అత్తయ్యా-నువ్వేమీ అనుకోనంటే నాకు ఒక్కటే దారి కనబడుతోంది. నేను స్వాతిని బలవంతంగా లొంగ

దీసుకుంటాను. ఆ తర్వాత ఎలాగూ ఆమె నాకు భార్య అవుతుంది."

మాలతి కంగారుగా ప్రభాకర్ వంక చూసింది. ఆమె కళ్ళల్లో కూతురి భవిష్యత్తు గురించిన ఆవేదన కనబడ లేదు. కూతురు తనగురించి ఏమనుకుంటుందోనన్న బెదురు కనిపించింది. డబ్బుగురించిన ఆశ ఆమె గుండెలచుట్టూ కట్టిన బలమైన గోడను ప్రభాకర్ మాటలు ఛేదించుకుని వెళ్ళలేకపోయాయి. అర్థాంగీకారంగా ఆవిడ తల ఆడిం చింది.

ప్రభాకర్ గబగబా మేడమెట్లు ఎక్కాడు. అతని శరీరంలో ఉద్రిక్తత ప్రారంభమైంది. మెట్లన్నీ ఎక్కాక అతని నడకలో వేగం తగ్గింది. నెమ్మదిగా నడుచుకుంటూ స్వాతి గదిదగ్గరకు వెళ్ళి ఆగాడు. ఓ క్షణం తటపటా యించి రహస్యంగా గదిలోకి చూశాడు.

మంచంమీద బోర్లా పడుకుని ఏదో పుస్తకం చదువు తోంది స్వాతి. ఆమె కళ్ళు పుస్తకం వైపే కేంద్రీకరించ బడి వున్నాయి. పాదాలు పైకెత్తి అటూ ఇటూ ఆడి స్తోంది. నోట్లో లాకెట్ గొలుసు పెట్టుకుంది. పైట జారి వుంది.

ఆ పోజులో ఆమెను చూస్తూంటే దివినుంచి భువికి దిగివచ్చిన దేవకన్యలా అనిపించింది ప్రభాకర్ కి. క్షణం పాటు వూపిరైనా పీల్చుకోకుండా ఆమె వంకచూసి చటుక్కున గదిలో అడుగువేట్టి క్షణంలో తలుపు మూసి గడియ వేసేశాడు.

చటుక్కున తలెత్తిచూసింది స్వాతి. ప్రభాకర్ ని చూసి నిర్లక్ష్యంగా—"నువ్వా?" అంది.

"అవును. నేనే—ఎలా కనబడుతున్నాను?"

"మామూలుగానే వున్నావు. ఏం?"

"ఒకతను నాకు బజార్లో కనబడి నా ముఖంలో మృత్యు కళ వుందనీ—ఇంక ఒక్క రోజుకు మించి బ్రతుకవనీ—తీరని కోరికలేమైనా వుంటే వెంటనే వెళ్ళి తీర్చుకోమనీ చెప్పాడు. అందుకని వెంటనే ఇక్కడకు వచ్చాను—"

"ఇక్కడికెందుకు వచ్చావ్? తీరని కోరికలు తీరేచోటు ఇదికాదు కదా—" అంది స్వాతి వెటకారంగా.

"నాకు తీరనికోరికలంటేమీ లేవు. నిన్ను అనుభవించాలన్న దొక్కటే నాకింతవరకూ తీరని కోరిక" అన్నాడు ప్రభాకర్.

"అది ఇప్పటికీ ఎప్పటికీ తీరని కోరిక" అంది స్వాతి.

"చావుకు తెగించిన వాణ్ని. ఏమైనా చేయగలను!" అన్నాడు ప్రభాకర్.

"ఏమైనా అంటే?" అంది స్వాతి.

"ఇప్పుడే తెలుస్తుంది..." అన్నాడు ప్రభాకర్.

"ఈలోగా నేను నవల చదువుకుంటూను..." అంటూ స్వాతి నిర్లక్ష్యంగా పుస్తకాన్ని తన చేతిలోకి తీసుకుంది.

"స్వాతీ!" అన్నాడు ప్రభాకర్.

స్వాతి పుస్తకంవైపే చూస్తోంది కానీ ఆమె శరీరం కంపిస్తోంది. మనసు తప్పించుకోవడం గురించి ఆలోచిస్తోంది. నవలలో పేజీ తిరగడంలేదు. ప్రభాకర్ ఆమెను ఇంకా సమీపించలేదు. అలా అయిదునిముషాలు గడిచాక వుండబట్టలేక స్వాతి ప్రభాకర్ వైపు చూసింది.

అతనింకా అలాగే గుమ్మంవద్ద నిలబడి వున్నాడిడు. ఓ చెయ్యి గోడను ఆని వుంది. రెప్ప వెయ్యకుండా అతను స్వాతివంక చూస్తున్నాడు.

"ఊఁ చెప్పు. ఏం చేస్తావో చెప్పు" అంది స్వాతి.

ప్రభాకర్ బదులివ్వకుండా ఆమెవంకనే చూస్తున్నాడు.

స్వాతికది అసహజంగా తోచింది. తనను దగ్గరగా రప్పించుకోవడాని కతను పన్నిన పన్నాగమేమోనని అనుమానంకూడా కలిగిందామెకు. అందుకే తెగించి అటు వెళ్ళలేదు. అలా ఎంతసేపు నిలబడతాడో తనూ చూడా లనుకుందామె.

అయిదు, పది, పదిహేను నిముషాలు గడిచాయి. ప్రభాకర్ కదలలేదు.

ఇంతలో ఎవరో తలుపుకొట్టారు—"స్వాతీ-స్వాతీ!" అంటోంది తల్లి.

"ఊఁ మా అమ్మ వచ్చిందే. తలుపు తియ్యి—" అంది స్వాతి. అయినా ప్రభాకర్ కదలలేదు.

స్వాతి చిరాగ్గా మంచంమీంచి లేచి గుమ్మందగ్గరకు వచ్చి తలుపు గడియతీసింది. అయినా ప్రభాకర్ కదల లేదు. తలుపు తోసుకుని మాలతి కంగారుగా లోపలకు వచ్చి—"ఏమిటయిందమ్మా—" అంది.

"అవడాని కేముంది? ప్రభాకర్ గదిలోకివచ్చి తలుపు గడియపెట్టి అక్కడ నుంచుని కదలడంలేదు..." అంది స్వాతి. ఇంకా ప్రభాకర్ కదలకపోవడంతో స్వాతికి అనుమానంకూడా వచ్చి అతని దగ్గరకూ వెళ్ళి—పట్టుకు కుదిపింది. ప్రభాకర్ కొయ్యబొమ్మలా ఆమెపైన పడ్డాడు.

కెవ్వుమని కేక వేసింది స్వాతి.

## 8

"చాలా ఆశ్చర్యంగా వుంది—" అంది స్వాతి.

"నాకూ ఆశ్చర్యంగానే వుంది. మీ నాన్నగారుకూడా ఇలాగే చచ్చిపోయారంటున్నావు. మాట్లాడుతూ మాట్లా

డుతూ హఠాత్తుగా చచ్చిపోవడమూ, డాక్టర్లు పరిశీలించి అది సహజమరణమని చెప్పడమూ నాకు నమ్మశక్యంగా లేదు—" అన్నాడు రాము.

"నిజమేమరి—మా నాన్నగారి చావుకూ, ప్రభాకర్ చావుకూ చాలా పోలికలున్నాయి. నాకు నిన్నుగురించి అనుమానంగా వుంది—" అంది స్వాతి.

"నాగురించా — ఎందుకు?" అన్నాడు రాము ఆశ్చర్యంగా.

"మృత్యుకళ ముఖంలో ముందుగానే చూడగలనని నువ్వు నాకు చెప్పావు. ఆదేమాట ప్రభాకర్ తనకు ఎవరో చెప్పారని చచ్చిపోయేముందు నాతో అన్నాడు. నువ్వే అయుంటావని నా నమ్మకం. అదలాగుంచితే ప్రభాకర్ ఇలా చెప్పిన విషయం నేను చెప్పగా మా అమ్మ ఆశ్చర్యపడి తనకూ మా నాన్నగారు చనిపోయేముందు ఎవరో ముఖంలో మృత్యుకళ కనబడుతోందని అన్నారని అంది. ఆ మనిషివికూడా నువ్వే అయుండాలి—" అంది స్వాతి.

"నీ వూహ కరెక్టే. మీ నాన్నగారికీ, ప్రభాకర్‌కీ ముఖంలో మృత్యుకళ కనిపెట్టి చెప్పినవాడిని నేనే! ఒప్పుకుంటున్నాను—" అన్నాడు రాము.

"అయితే ఎలా తెలుస్తుంది నీకు మృత్యుకళ—చంపబోయే ముందా?"

"హరిహరీ—" అంటూ చెవులు మూసుకున్నాడు రాము—"ప్రేమించిన ప్రియురాలి నోటివెంట ఎటువంటి మాటలు వినవలసి వచ్చిందీ?"

"మిస్టర్ రామూ — మర్యాదగా నిజంచెప్పు..." అంది స్వాతి.

"నువ్వు చాలా మూర్ఖంగా మాట్లాడుతున్నావు స్వాతీ! రెండు నిండు ప్రాణాలను తీయవలసిన అవసరం నాకే ముంది? నీ తండ్రిని చంపితే నాకేమిటి లాభం? నీ ప్రేమ కోసం ప్రభాకర్ని చంపేటంత మూర్ఖపుస్థాయికి నేనింకా దిగజారిపోలేదు" అన్నాడు రాము.

"హత్యలు నువ్వు చేయలేదంటావు?" అంది స్వాతి.

"లేదు—"

"అంటే హత్యలు చేయలేదంటావు?" అంది స్వాతి మళ్ళీ.

ఉలిక్కిపడ్డాడు రాము—"ఏమిటన్నావ్?"

"ఆ హత్యలు నువ్వే చేసివుంటే బాగుండేది. ధైర్యంగా నాకు వచ్చిన ఇబ్బందిని చెప్పుకునేదాన్ని" అంది స్వాతి. ఆమె కళ్ళలో నీరు తిరిగింది.

రాము ఇరుకులో పడ్డాడు. "నేను హత్యలు చేయలేదు. గానీ నీకోసం ఏమైనా చేయగలను. నీ ఇబ్బంది ఏమిటో చెప్పు... నా శక్తికొద్దీ నిన్నాదుకునేందుకు ప్రయత్నిస్తాను..."

స్వాతి కళ్ళనీరు తుడుచుకునేందుకు ఒక్క నిముషం ఆగింది. "ప్రపంచంలో ఇంత అమానుషం కనీవినీ ఎరుగం. ప్రభాకర్ చావులో నా పాత్ర వుందని గోవిందరావు నన్ననుమానిస్తున్నాడు. డాక్టర్ పరీక్షలో ఏమీ అనుమానాస్పద విషయం బయల్పడలేదు. అయినా ఆయన నన్ననుమానిస్తున్నాడు. మా అమ్మకుకూడా నామీద అనుమానంగా వుంది. చూస్తూండగా ప్రభాకర్ ఎలా చచ్చిపోతాడు? అందులోనూ నిక్షేపంలా వున్న మనిషి! ఇలా ఆలోచిస్తున్నప్పుడు నామీద నాకే అనుమానంగా వుంటోంది—"

"గోవిందరావు నన్ను పోలీసుకేసులో ఇరికించాలనుకున్నాడా?"

"అలా చేసినా బాగుండేది. ఈ పాడు జీవితం అంత మయ్యేది! అంతకంటే ఘోరం చేయదల్చుకున్నాడాయన."

"ఏమిటది?" ఆత్రుతగా అడిగాడు రాము.

"గోవిందరావు నన్ను పెళ్ళిచేసుకుంటాడుట..." అంది స్వాతి.

పక్కలో బాంబుపడ్డట్లు అదిరిపడ్డాడు రాము. క్షణం పాటు అతనికి నోట మాటరాలేదు__"తన కోడుక్కు చేసుకుందామనుకున్న నిన్ను తను పెళ్ళిచేసుకుండాటా?"

"నామీద ప్రేమకొద్దీ కాదు. కక్షకొద్దీ. నాకు జీవితంలో నరకం చూపించడమే ఆయన ధ్యేయమట. ప్రభాకర్ ఆయనకంటే వెయ్యిరెట్లు మెరుగు. నా అభీష్టానికి వ్యతిరేకంగా నన్ను పెళ్ళి చేసుకోవడానికతను జంకాడు. గోవిందరావు బలవంత వివాహానికి పునాదులు వేస్తున్నాడు. కొడుకుపోయిన దుఃఖం పేరులో కొంత కాలంపాటు నా జోలికి రాకపోవచ్చు. కానీ ఆ తర్వాత..."

"ఇందుకు మీ అమ్మ ఒప్పుకుంటుందా?"

"ఒప్పుకోక ఏం చేస్తుంది? ఆవిడకు పేదరికమంటే భయం. గోవిందరావంటే ఇంకా భయం. ఈ భయాలు నాపై ప్రేమను కప్పేస్తున్నాయి..."

"మీ అన్నయ్య?"

"వాడికీ గోవిందరావంటే భయం. అమ్మా వాడూ ఒక్కటే!"

"ఏం చేయాలిప్పుడు?"

"నువ్వు దయతో గోవిందరావును కలుసుకుని ఆయన ముఖంలో మృత్యుకళ వున్నదీ లేనిదీ చూసిరావాలి__"

రాము కంగారుగా—"ఏం చెప్పగలం? నేను మృత్యు కళను చెప్పగలను కానీ-రప్పించలేను..." అన్నాడు.

"గోవిందరావు చచ్చిపోతే నా లక్షల ఆస్తిమీద నాకు స్వతంత్ర్యం వస్తుంది. ఆ ఆస్తితో నేను నీ స్వంత మవుతాను..." అంది స్వాతి.

"నా దగ్గర కూడబెట్టిన డబ్బంతా డైమండ్ నెక్లెస్‌గా మార్చి నీ కిచ్చేశాను. నాకు డబ్బుమీద మోజులేదు. మీ నాన్న అన్యాయంగా సంపాదించిన డబ్బుమీద నీకూ మోజులేదు. మనకిక గోవిందరావు గొడవెందుకు? ఊఁ అంటే ఎక్కడికైనా వెళ్ళిపోదాం..."

"గోవిందరావు బ్రతికుండగా అది సాధ్యంకాదు. ఆయన సంగతి నీకు తెలియదు. కొంతడబ్బు సంపాదించు కున్నాక మా నాన్నకు నీతిగా బ్రతకాలని కోరిక కలిగింది. అందుకు నా పోరూ కొంత కారణం. కానీ గోవిందరావు మా నాన్నని వదలలేదు. దారుణంగా బెదిరించి తన తొత్తును చేసుకున్నాడు. ఆయన సృష్టించిన విషవలయం నుంచి బయటపడకుండానే మా నాన్న ఈ లోకంనుంచి నిష్క్రమించాడు. ఇప్పుడాయన నా చుట్టూ వలయం పన్నుతున్నాడు."

రాము సాలోచనగా—"నువ్వు చెప్పింది వింటూంటే నాకు చాలా భయంగా వుంది. నువ్వు చెప్పినట్లే ఓ పర్యాయం గోవిందరావును కలుసుకుంటూను. కానీ ఆయన ముఖంలో జీవకళ ఉట్టిపడుతూ కనిపిస్తే-నేనేం చేసేది?" అన్నాడు.

"నీ ప్రయత్నం నువ్వు చేయి...నాకోసం!" అంది స్వాతి.

రాముకు స్వాతి బాధ అర్థమయింది. గోవిందరావు పథకం అమానుషమైనది. ఆ పథకంతో స్వాతి జీవితాన్ని బలితీసుకోవాలనుకుంటున్నాడా దుర్మార్గుడు. తను దానికి అడ్డుపడాలి. అంటే గోవిందరావు ముఖంలో మృత్యుకళలు వెదకాలి!

"నా ప్రయత్నం నేను చేస్తాను స్వాతీ—ఆపైన నీ అదృష్టం!" అంటూ అక్కణ్నించి లేచాడు రాము.

## 9

"నీకో మంచి బేరం" అన్నాడు వెంకట్రావు.

"ఏమిటిది?" అడిగాడు రాము.

"ఒకటి కాదు, రెండు కాదు...అయిదు లక్షలు."

"దేనికి, ఎలా?"

"ఒకే ఒక్క హత్య చేయాలి."

"అంత ఖరీదైన మనిషి ఎవరు?"

"స్వాతి!" అన్నాడు వెంకట్రావు.

రాము కళ్ళు ఎర్రబడ్డాయి — "స్వాతి నా ప్రాణం. ఆమెను హత్యచేయమని నాకు చెప్పడానికి నీకెన్ని గుండెలు?" అన్నాడు.

"నాకున్నది ఒక్కటే గుండె. కానీ ఈ ప్రపంచంలో స్వాతిని మించిన ఆడవాళ్ళెంతా బోలెడుమంది వున్నారు. అయిదు లక్షలు సంపాదించుకుంటే పాదాలముందు వాలే అప్సరసలు బోలెడుమంది."

"అయిదు లక్షలు కాదు—అరవై కోట్లిచ్చినా ఈ పని జరగదు."

వెంకట్రావు అదోలా నవ్వి - "అరవై కోట్లు కాదు. ఈ ప్రపంచంలోని సంపదనంతా ఒకచోట జేర్చి ధారపోసినా

చాలనంత విలువైన దింకొకటుంది. తెలుసా?" అన్నాడు.

"నాకు తెలిసిన విలువైన మనిషి స్వాతి మాత్రమే!"

"స్వాతి కాదు—నీ ప్రాణం—"

"నా ప్రాణం గురించి మాట్లాడ్డానికి నీకన్ని గుండెలు? జాగ్రత్త—నీ ముఖంలో మృత్యుకళ కనిపించగలదు."

"నా దగ్గర సుమారు పదిమంది ఉద్దండ పిండా లున్నారు. నీ ప్రాణం తీయడానికి వాళ్ళలో ఎందరి ముఖాల్లో మృత్యుకళ వచ్చినా ఫరవాలేదు. నువ్వు పోతే చాలు"

రాము ఆలోచనలో పడ్డాడు. వెంకట్రావు తనను బెదిరిస్తున్నాడు. అతను చెప్పినపనికి ఒప్పుకోకపోతే వెతికి వెతికి వేటాడి తనను చంపటానికి ప్రయత్నిస్తాడు. అన్నంత పని చేయగల శక్తి వెంకట్రావుకు లేకపోలేదు. కానీ అతను ఓ పట్టాన తన ప్రాణాలజోలికి రాడు. తన విలువ అతనికి తెలుసు.

"మిస్టర్ వెంకట్రావ్? నా సంగతి నీకు తెలుసు. నాలాంటి వాళ్ళవల్ల నాకంటె నీకే ఎక్కువ ప్రయోజనం. మృత్యుకళను చదవగల విద్యతోపాటు నువ్వు కోరిన వ్యక్తి ముఖంలో మృత్యుకళ చూడగల అదృష్టంకూడా వున్న మనిషిని నేను. నా ప్రాణాలమీద దృష్టిపడడం వల్ల నీకే నష్టం. అసలు నీ ఇబ్బంది ఏమిటి? స్వాతి ప్రాణాల జోలికి నువ్వెందుకు వెళ్ళాల్సొచ్చింది?" అనడిగాడు రాము.

వెంకట్రావు ముఖం విషాదంగా అయిపోయింది. "స్వాతి బంగారుబొమ్మ. అటువంటి అమ్మాయిని చంపాలని ఏ మగాడూ అనుకోడు. కానీ నేను స్వతంత్రుణ్ని కాను. ఒక వ్యక్తి ఆదేశాలకు లోబడి నడుచుకుంటున్న వాణ్ని."

"నీ అంతటి సమర్థుడు కొంతమందికి లోబడిపోవడం నాకు నచ్చలేదు."

"కొంతమంది కాదు. నేను భయపడేది ఒకే వ్యక్తికి."

"ఎవరతను?"

"ఆయన పేరు గోవిందరావు."

"గోవిందరావు లేకపోతే."

"నేను సర్వ స్వతంత్రుణ్ని" అన్నాడు వెంకట్రావు.

"సరే - నేను గోవిందరావు ముఖంలో మృత్యుకళ వున్నదేమో చూడ్డానికి ప్రయత్నిస్తాను. నా అదృష్టం మీద నాకు నమ్మకముంది. నా కళ్ళు ఆయన ముఖంమీద పడ్డ మరుక్షణంలో నే మృత్యుకళ ఆయన ముఖంలోకి రాక తప్పదు. అయితే స్వాతి ప్రాణాల విషయంలో నువ్వు నాకు హామీ యివ్వాలి" అన్నాడు రాము.

"గోవిందరావును ఈ లోకంనుంచి తప్పించగలిగితే నీకు ఆజన్మాంతం ఋణపడి వుంటాను."

"సరే-కస్తాను. అయితే బేరం పదిలక్షలకు. అయిదు లక్షలు అడ్వాన్సుగా యివ్వాలి" అన్నాడు రాము.

వెంకట్రావు కాసేపు ఆలోచించి లోపలకు వెళ్ళి ఓ బ్రీఫ్ కేసు తెచ్చి రాముకు ఇచ్చాడు. రాము పెట్టె తెరిచి లోపల ఏమున్నాయో చూశాడు. నోట్ల కట్టలు తప్ప ఇంకేమీ లేవు. ఓసారి డబ్బు లెక్కించి చూసుకుని—

"ఓ కే!" అన్నాడు.

"నువ్వు నమ్మకస్థుడవని తెలుసు కాబట్టి - మోసానికి ప్రతిఫలం ఏమిటో హెచ్చరించడంలేదు..." అన్నాడు వెంకట్రావు.

"ఆ అవసరం లేదు. ఇకముందుకూడా రాదు" అన్నాడు రాము. అతను బ్రీఫ్ కేసు చేతో పట్టుకుని

బయటకు నడిచివెళ్ళాడు. అతను కొంతదూరం వెళ్ళేక మరో వ్యక్తి అతన్ని వెంటాడసాగాడు.

గామునూ, ఆ వెంటాడుతున్న వ్యక్తినీ చూసి తృప్తిగా తలాడించేడు వెంకట్రావు. మరో నిముషంలోనే లోపల్నుంచి గోవిందరావు వచ్చాడు..

"శభాష్ వెంకట్రావ్! వ్యక్రాణ్ని బాగా బోల్తా కొట్టించావు వాడి రహస్యమేమిటో తెలుసుకోగలమంటావా?" అన్నాడు గోవిందరావు.

"తెలుసుకోగలం కానీ మీరీ విషయంలో రిస్కు తీసుకుంటున్నారేమోననీ, కోరి మృత్యువు నాహ్వానిస్తున్నారనీ నాకు భయంగా వుంది" అన్నాడు వెంకట్రావు.

"అవసరమైన జాగ్రత్తలన్నీ తీసుకుంటాను. వాడు ఏదో పథకం వెయ్యాలి. ఏదోవిధంగా నన్ను కలుసుకోవాలి. అయితే నీకు తెలుసుగదా–నేను అన్ని పథకాలకూ అతీతుడనని." అంటూ నవ్వాడు గోవిందరావు.

మరి కాసేపటికి అక్కడికి ఓ మనిషి వచ్చాడు.

"ఏమిట్రా విశేషాలు?" అన్నాడు ఆత్రుతగా వెంకట్రావు.

"ఆయన ముందు ఓ బ్యాంకులోకి వెళ్ళాడండి. తర్వాత అక్కణ్నుంచి బయటకువచ్చి దేవుడిగుడిలోకి వెళ్ళారండి. ఆ తర్వాత ఇంటికి వెళ్ళారండి. ఇంటిముందు మనవాడు ఒకడు కాపలా వున్నాడండి. ఇప్పటికింతే విశేషాలు."

"నా ముఖంలో మృత్యుకళ రప్పించడానికి దైవ ప్రార్థన చేసివుంటాడు. వాడికి తెలియదేమో – నన్ను దేవుడుకూడా ఏమీ చేయలేడని" అంటూ మళ్ళీ నవ్వాడు గోవిందరావు.

# 10

"పూజారిగారు ప్రసాదం తెచ్చి యిచ్చాడండీ—" అంది గోవిందరావు భార్య సుభద్రమ్మ.

"కొబ్బరికాయ ముక్కగా" అని నవ్వాడు గోవిందరావు.

ప్రతి సోమవారమూ శివాలయంలో గోవిందరావు పేరిట అర్చన జరుగుతుంది. పూజారి పూజానంతరం ప్రసాదం తీసుకువెళ్ళి స్వయంగా గోవిందరావుగారింట్లో ఇచ్చి దక్షిణ వసూలు చేసుకుపోతాడు. ఇది చాలా ఏళ్ళుగా జరుగుతోంది.

గోవిందరావు ప్రసాదం అందుకుని నోట్లో వేసుకున్నాడు - "నువ్వు తిన్నావా?" అనడిగాడు భార్యని.

"మీరు తినకుండానా?" అంది సుభద్రమ్మ.

"అయితే ఇంకా వుందా?"

"లేదండీ - ఈసారి ప్రసాదం కాస్తే తెచ్చాడు పూజారిగారు."

"మరి ముందుగా చెప్పలేదేం."

"ఇన్నేళ్ళుగా ప్రసాదం తింటూంటే నాకు మిగిలిందేమిటి? కన్నీళ్ళుగా" అంటూ కళ్ళొత్తుకుంది సుభద్రమ్మ.

గోవిందరావు కళ్ళుకూడా చెమర్చాయి - "ఏడవకే— ఏడిస్తేమాత్రం పోయినవాడు బ్రతికి వస్తాడా? మన అబ్బాయి చావుకు కారణమైన వాడిమీద పగ తీర్చుకునేదాకా నిద్రపోను."

"ఎవళ్ళనో అనుకోవడమెందుకండీ - మన పాపాలే మన్ని కొట్టాయి. దేవుడికి పూజలుచేసి ఆ ప్రసాదాలు తింటే మన పాపాలు పోవు. అనుభవించాల్సిందే!" అంది సుభద్రమ్మ.

"అంటే నీ ఉద్దేశ్యం!"

"నేనింక దేవుడిపూజలు మానేస్తాను. భక్తి వదిలి పెట్టేస్తాను. కొండమీంచి క్రిందికిదూకుతూ ఇంకాకూడా ఆహార పదార్థాలుంచుకున్నట్లు - పాపాల పుట్టగా బ్రతుకు గడుపుతూ మధ్యలో దేవుడి పూజలుకూడా ఎందుకండీ" అంది సుభద్రమ్మ.

గోవిందరావు మాట్లాడలేదు. కొడుకు చనిపోకముందు భార్య ఇలాంటి మాటలంటే ఆయన ఏమాత్రమూ సహించే వాడు కాదు. కానీ ఇప్పుడాయన పూర్తిగా లొంగి పోయాడు. కొడుకు శోకంలో ఆవేశంలో వున్న ఆ మాతృమూర్తికి తానివ్వగలిగిందేమీ లేదు. కనీసం ఆమె మాటలు భరిస్తేచాలు!

"నీ ఉద్దేశ్యం నాకు తెలిసిందిలేవే - నేను పాపాల పుట్టననేగదా నీ అభిప్రాయం. ఎవరికోసం చేస్తున్నా నంటావ్ ఇవన్నీ" అన్నాడాయన.

"మీరే చెప్పండి. ఎవరికోసం ఇవన్నీ చేస్తున్నారు?"

గోవిందరావుకు నోటమాటరాలేదు. ఒక్కగానొక్క కొడుకు ప్రభాకర్ చచ్చిపోయాడు. ఇంకా ఎవరికోసం తనివన్నీ చేస్తున్నట్లు?

# 11

"మిస్టర్ వెంకట్రావ్ - గోవిందరావు ముఖంలో మృత్యుకళ తాండవిస్తోంది. ఈ రాత్రి గడుస్తుందని నాకు తోచదు. ఒకోసారి యమభటులు ఓ ప్రాణిని తీసుకు నేం దుకు వెళ్ళి అక్కడింకా ఎవరైనా వుంటే వాళ్ళనుకూడా తీసుకుపోతారు. అనవసరంగా ఎక్కువ ప్రాణాలు పోవడం నేను సహించలేదు. సుభద్రమ్మగారి ప్రాణాలు

కాపాడాలి. ఆవిణ్ని ఈరోజుకు సాయంత్రం ఆర్నుంచి తొమ్మిదివరకూ ఇంట్లో లేకుండా చెయ్యి.”

అవతల క్లిక్ మంది. వెంకట్రావు తనూ ఫోన్ క్రెడిల్ మీద వుంచి వెంటనే గోవిందరావుకు ఫోన్ చేసి తనకు ఫోన్ చేసిన వివరాలు చెప్పాడు.

“అలాగా – వాడి సంగతి నేను చూసుకుంటాను. మీ అమ్మను పంపిస్తే – ఆడవాళ్ళిద్దరూ ఫస్టుషో సినిమాకు వెడతారు” అన్నాడు గోవిందరావు.

“సార్ – మీరు చాలా పెద్ద రిస్కు...” అన్నాడు వెంకట్రావు.

“ఇందులో రిస్కేమీ లేదు. నా కొడుకు చావులోని మిస్టరీ విడిపోవాలి. అంతవరకూ నాకు నిద్రపట్టదు. ఈ ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినా ఫరవాలేదు” అన్నాడు గోవిందరావు.

వెంకట్రావు మరేమీ మాట్లాడకుండా ఫోన్ పెట్టేశాడు. గోవిందరావు ఏం చేయబోతున్నాడో అతనికి తెలియడం లేదు. కానీ ఆయన చెప్పినట్లే చేశాడతను.

సాయంత్రం ఆరుగంటలకు సుభద్రమ్మ, వెంట్రావుతల్లి సినిమాకు వెళ్ళిపోయారు. గోవిందరావు పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేశాడు.

“హలో ఇన్‌స్పెక్టర్ రామనాథంగారేనా – వోసారి అర్జంటుగా మా ఇంటికి రావాలిసార్ – చాలా ముఖ్యమైన వార్త ఒకటి చెప్పాలి మీకు” అన్నాడు.

“ఏమిటది?”

“ఈరోజు ఇంకో రెండుమూడు గంటల్లో నా ప్రాణం పోవచ్చు.”

“వ్వాట్ – ఏమిటి మీరనేది?”

"ఇలాగని ఒకడు జోస్యం చెప్పాడు" అన్నాడు గోవిందరావు.

"ఆ జోస్యాన్ని మీరు నమ్ముతున్నారా?"

"నమ్మినా నమ్మకపోయినా మీ సాయం కోరుతున్నాను. ఇదివరలో సుదర్శనరావు, ప్రభాకర్, ఇప్పుడు నేను — ఒకేరకంగా చావబోతున్నాము. ఆ దుఃఖ కారణం చెప్పగల ఒకే ఒక వ్యక్తి వున్నాడు. వాడి వివరాలు మీకు నేను చెబుతాను. ఈరోజు కాసేపు మీరు నాతో గడపాలి."

"ఆమనిషిగురించి మీకు కాక ఇంకెవరికైనా తెలుసా?"

"నా వ్యవహారాలు చూస్తూందే వెంకట్రావుకూడా తెలుసు."

"అయితే సరే — వెంటనే బయల్దేరి వస్తున్నాను."

గోవిందరావు ఫోన్ పెట్టేసి తృప్తిగా నిట్టూర్చి— "ఇంకెక్కడికి పోతావ్? నీ అడ్రస్ పోలీసుల దగ్గరకు వెడుతోంది" అనుకున్నాడు.

# 12

ఓ కిళ్ళీకొట్టుకు పక్కగా నిలబడి గోవిందరావు ఇంటివైపే చూస్తున్నాడు రాము. మాటిమాటికీ అసహనంగా గడియారంవైపు చూసుకుంటున్నాడు.

అతను చూస్తుండగా గోవిందరావు ఇంటిముందు పోలీస్ జీపు ఆగింది.

రాము ఉలిక్కిపడ్డాడు. గోవిందరావు యింటికి పోలీసు లెందుకు వస్తున్నారు? గోవిందరావు రమ్మనిపిలిచేడా లేక తనను అనుమానించడం జరిగిందా లేక కాకతాళీయమా? తనని అనుమానిస్తేమాత్రం ఏంచేయగలరు?

రాము జేబులోంచి సిగరెట్ పెట్టె తీశాడు. అందు లోంచి ఓ సిగరెట్ తీసి పెట్టె మళ్ళీ జేబులోకి తోసేశాడు. అతను చూస్తూండగా ఇన్‌స్పెక్టర్ రామనాథం గోవింద రావు ఇంట్లో అడుగుపెట్టాడు.

"రండి ఇన్‌స్పెక్టర్ గారూ!" అంటూ ఆహ్వానించాడు గోవిందరావు.

"నిజానికి నాకు తీరుబడిలేదు. కానీ మీరు రమ్మన్నారు కాబట్టి రాక తప్పలేదు. సంగతి వివరంగా చెప్పండి" అన్నాడు రామనాథం.

"ఈ రాత్రి నామీద హత్యాప్రయత్నం జరుగనున్న దని నా అనుమానం. అదీ నా భార్య సినిమానుంచి తిరిగి వచ్చేలోగా. అందుకని అంతవరకూ మీరు నాదగ్గర వుంటే వో హత్యనాపినవారౌతారు. మీరు నా దగ్గర ఉ త్తినే కూర్చున్నట్లు కాక-మీకు వో కేసుకు సమాచారం ఉన్నంగా చెబుతాను" అన్నాడు గోవిందరావు.

నిజం చెప్పాలంటే రామనాథానికి మనసులో చాలా విసుగ్గా వుంది. గోవిందరావు నగర ప్రముఖుడు కావడం వల్ల తన విసుగుదల నతను పైకి ప్రదర్శించకుండా— "చెప్పండి!" అన్నాడు.

గోవిందరావు ఏదో చెప్పడానికి సంసిద్ధుడై ఆగి పోయాడు. చటుక్కున కుర్చీలో వెనక్కి జారిగిల పడ్డాడు. ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఆయన కళ్ళు మూత బడ్డాయి.

రామనాథం ఆయన మాట్లాడతాడేమోనని సుమారు అయిదు నిముషాలు ఎదురుచూసి — "ఎందుకో సందేహి స్తున్నారు, ఫరవాలేదు చెప్పండి!" అన్నాడు.

గోవిందరావు మాట్లాడలేదు.

రామనాథం ఇంకో పది నిముషాలు వోపికతో ఎదురు చూశాడు. అతడి సహనం నశించింది. నెమ్మదిగా మనసులో అనుమానం కూడా చోటుచేసుకుంది. లేచి గోవిందరావు దగ్గరకు వెళ్ళి గట్టిగా పిలిచాడు. ఆయనలో చలనం కలక్క పోయేసరికి భుజంతట్టి పిలవబోయాడు. అతను భుజం తట్టగానే ఆయన కుర్చీలో అటు వాలిపోయాడు.

రామనాథం అనుమానం బలపడింది. ఆయన ముక్కు వద్ద చేయిపెట్టి చూశాడు. శ్వాస ఆడుతున్నట్లు లేదు.

రామనాథానికి కంగారుపుట్టింది. చుట్టూ చూశాడు. తామున్న గదిలో అన్ని వేపులనుంచీ తలుపులు దగ్గరగా వేసివున్నాయి. గదిలో మరోమనిషి లేదు. రామనాథం వెంటనే ఫోన్ వద్దకు పరుగెత్తి నంబర్ డయల్ చేశాడు.

# 13

"వండర్ ఫుల్!" అంది స్వాతి.

"స్వాతీ - నువ్విక నన్ను కరుణించాలి" అన్నాడు రాము.

"కరుణించకపోతే?"

"నాకీ లోకంలో ఎవ్వరూ లేరు. అసలు నాకు జీవితేచ్ఛలేదు. నిన్ను చూశాకనే నాకు జీవితేచ్ఛ కలిగింది. ప్రతిమనిషి ముఖంలోనూ మృత్యుకళలు వెతుక్కుంటూ బ్రతకవలసిన అవసరం నాకులేదు. ఈ జీవితానికి సరిపడ డబ్బుంది నాదగ్గర. నాకు నీ ఆస్తిమీద మోజులేదు. కావాలనుకుంటే అది నీ తల్లికీ, అన్నకూ వదిలేసి నాతో వచ్చేసేయ్. మనం హాయిగా జీవిద్దాం" అన్నాడు రాము.

స్వాతి ముఖంలో మళ్ళీ విషాదం కనబడింది - "నీకు తెలియదు మిస్టర్ రాముా - నా ఇబ్బందులన్నీ యింకా పూర్తిగా తొలగినట్లు కాదు."

"ఏ ఇబ్బందైనా నేను తొలగించగలనుగదా - నాకు వివరంగా చెప్పు. నీకోసం యింత చేశాను.ఇంకా ఏమైనా చేయగలను" అన్నాడు రాము.

"మాటిమాటికీ నిన్ను ఇబ్బంది పెట్టడం నాకు బాగో లేదు. అదీగాక తప్పనిసరి పరిస్థితుల్లో నా స్వార్థంకోసం నా కిష్టంలేని పనులు నీచేత చేయించాల్సి వచ్చింది" అంది స్వాతి.

"ఫరవాలేదు. నీ ఇబ్బంది ఏమిటో చెప్పు. కానీ ఇలా ఒక్కటొక్కటిగా కాక ఉన్న ఇబ్బందులన్నీ ఒక్క సారిగా చెప్పేస్తే అన్నీ ఒక్క దెబ్బతో తీర్చేసి నిన్ను నాదాన్ని చేసుకుంటాను" అన్నాడు రాము.

"అయితే నీకు తెలియకుండా దాచిపెట్టిన విశేష మొకటుంది. అదిప్పుడు నీకు చెబుతాను విను" అంది స్వాతి.

గోవిందరావు కొడుకు ప్రభాకర్, స్వాతిని ప్రేమిం చాడు. స్వాతి, వెంకట్రావును ప్రేమించింది. వెంకట్రావు ప్రేమను స్వాతి తండ్రి సుదర్శనరావు నిరాకరించడమే కాక వెంకట్రావు పరమ దుర్మార్గుడన్న విషయాన్ని ఆయన స్వాతికి తెలియబర్చాడు.

స్వాతి వెంకట్రావును నిరాకరించింది.

వెంకట్రావు సుదర్శనరావుమీద పగబట్టాడు. కొడుకు కారణంగా గోవిందరావుకూడా సుదర్శనరావుమీద పగ బట్టాడు. ఇద్దరూ ఏకమైన కారణంగా సుదర్శనరావు మరణించాడు. అది హత్య అవునో, కాదో తెలియదు.

తండ్రి పోయేక స్వాతిపై గోవిందరావు ఒత్తిడి ఎక్కు వయింది. ముందుగా ప్రభాకర్‌నీ, ఆ తర్వాత గోవింద రావునీ స్వాతి వదుల్చుకోగలిగింది.

వెంకట్రావు, గోవిందరావును రామునిమీదకు ఉసిగొల్పి తెలివిగా రంగంలోంచి ఆయన్ను తప్పించాడు. రాము సామర్థ్యం వెంకట్రావుకు తెలిసినంతగా గోవిందరావుకు తెలియదు.

ప్రభాకర్, గోవిందరావులను రంగంలోంచి తప్పించడంకోసం స్వాతి వెంకట్రావుతో ప్రేమను నటించింది. ఇప్పుడామె వెంకట్రావును పెళ్ళిచేసుకోవలసి వుంది. కానీ అదామెకు ఇష్టంలేదు. వెంకట్రావుకూడా రంగంలోంచి తప్పుకుంటే ఆమె రామును పెళ్ళి చేసుకునేందుకు అడ్డంకులేమీ వుండవు...

స్వాతి చెప్పిన కథంతా వోపిగ్గా విన్నాడు రాము. కథ వింటూంటే అతనికి మతిపోయినట్లయింది.

అతను స్వాతివంక పరిశీలనగా చూసి నిట్టూర్చాడు—

"నాకు రెండురోజులు వ్యవధికావాలి. ఏం చేయాలో తోచడంలేదు. నిన్ననే వెంకట్రావును చూశాను. అతడి ముఖంలో మృత్యుకళ లేదు."

"నిన్న లేకపోవచ్చు. కానీ రేపు రావచ్చుగా—" అంది స్వాతి.

"రావచ్చు. రాకపోవచ్చు. నేనేమీ హత్యలు చేయడం లేదుగదా..." అన్నాడు రాము.

స్వాతి అదోలా నవ్వి "ఇంకా నన్ను మభ్యపెట్టాలని ఎందుకు చూస్తావు? నిజం చెప్పు — నిజంగా నువ్వు నన్ను ప్రేమిస్తూన్న పక్షంలో అబద్ధమాడకూడదు. మృత్యుకళ గురించి నువ్వు చెబుతున్నది అబద్ధం! నువ్వు హత్యలు చేస్తున్నావు. అవునా?" అంది.

రాము కూడా నవ్వి "వెంకట్రావు చనిపోగానే నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానన్న మాట నిజమని

దేవుడి మీద ఒట్టేసి చెప్పు. అప్పుడు నా సంగతి చెబుతాను..." అన్నాడు.

స్వాతి ఆశ్చర్యంగా చూసింది రాము వంక. "నీకు నామీద అనుమానం కలిగిందన్నమాట! అది పొరపాటని త్వరలోనే తెలుసుకుంటావ్!" అంది.

"అలా తెలుసుకోవాలనే నా ఆశ!" అన్నాడు రాము.

## 14

రాము కోరిక మీద తన యింట్లో పెద్ద డిన్నర్ పార్టీ ఏర్పాటు చేసింది స్వాతి.

ఆ ఇంట్లోనివారు కాక ఆ డిన్నర్ కాహ్వానించబడిన వ్యక్తులు రాము, వెంకట్రావు! డిన్నర్‌కు ప్రతి ఒక్కరూ ఒక ప్రత్యేకమైన తినుబండారం అదనంగా తీసుకు రావాలని స్వాతి చెప్పింది. అదీ రాము కోరిక మీదే.

స్వాతితల్లి మాలతి బజార్నించి చాక్‌లెట్సు తెప్పించింది. అన్న రాజు రసగుల్లా తెచ్చాడు. స్వాతి చిప్స్ తెచ్చింది. వెంకట్రావు మిరపకాయ బజ్జీలు తెచ్చాడు. రాము మాత్రం చేతిలో ఒక డబ్బాతో వచ్చాడు. అందులో ఏముందో ఎవ్వరికీ చూపించలేదు.

"అంతా చూపించేశాం కాబట్టి నువ్వు చూపించాలి" అన్నాడు వెంకట్రావు.

"మీలో ఎవరికయినా దేవుడిమీద నమ్మకముందా?"

"నాకుంది!" అంది స్వాతి వెంటనే. మిగతా అందరూ కూడా వుందని అన్నారు.

"నాకు మాత్రం లేదు. అయినా మీ అందరి కోసం దేవుడి ప్రసాదం తీసుకు వచ్చాను..." అంటూ డబ్బా

మూత తెరిచాడు రాము. అందరూ ఆత్రుతగా చూశారు. అందులో కొబ్బరికాయ ముక్కలున్నాయి.

"నీలాంటివాడిని నమ్మడం కష్టం. ప్రసాదం ముందుగా నువ్వు కొంత తినాలి..." అన్నాడు వెంకట్రావు.

"దేవుణ్ని నమ్మే మీరు మనిషిని నమ్మలేరు. ఆ దేవుడు కూడా మీకు మనిషిమీద నమ్మకం పుట్టించలేకపోతు న్నాడు. నేను తెచ్చిన ప్రసాదంలో తనకు తోచిన కొబ్బరిముక్క స్వాతి నా నోట్లో పెడితే నేను చాలా సంతోషిస్తాను" అన్నాడు రాము.

స్వాతి, రాముకు మాత్రమే కాకుండా అక్కడున్న అందరికీ ప్రసాదం నోట్లో పెట్టింది.

"మీకు అభ్యంతరం లేకపోతే సిగరెట్ కాల్చు కుంటాను." అన్నాడు రాము. అంటూనే అతను తన జేబులోంచి సిగరెట్ పెట్టి తీసి టేబుల్ మీద పెట్టి— "ఇప్పుడు నేను మీకు నా కథ చెప్పాల్సి వుంది..." అన్నాడు.

అక్కడున్న అందరికీ అతనికథ వినాలని ఆత్రుతగా వుంది.

# 15

"ఒక దుర్మార్గుడు మా నాన్నను ఘోరంగా హత్య చేయించాడ నేందుకు బలమైన సాక్ష్యాలున్నప్పటికీ డబ్బు లంచంపట్టి పోలీసులు కేసును మసిపూసి మారేడుకాయ చేసేశారు. ఆ దుర్మార్గుణ్ని సమూలంగా నాశనం చేయా లని నేనీ నగరం వచ్చాను. నా పగ వాడిమీద, వాడి కుటుంబంమీద, అసమర్థులైన పోలీసులమీద!

ఆ దురాత్ముడి పేరు సుదర్శనరావు. ఇక్కడకు వచ్చి ఆతని కుటుంబాన్ని చూసేక స్వాతి నాలో కొత్త ఆశలు రేపింది. ఆమెను తొలిచూపులోనే ప్రేమించాను. సుదర్శనరావునూ ఆతని కుటుంబాన్ని నాశనం చేయాలన్న ఆలోచన విరమించుకున్నాను.

అయితే ఇక్కడకు చేరిన కొద్ది రోజుల్లోనే సుదర్శన రావు ఇంకా ఘోరాలు చేస్తూనే ఉన్నాడనీ అతగాడు సంఘానికి పట్టిన చీడపురుగు అనీ గ్రహించాను. వెంకట్రావుకు అతనిపై పగవున్నదని తెలిసి అతన్ని కలిశాను. సుదర్శనరావు పని అయిపోయింది.

స్వాతిని కలుసుకుని నా కోరిక చెప్పుకున్నాను. ఆమె మొదట ప్రభాకర్ అడ్డం అంది. ప్రభాకర్ చనిపోయాడు. తర్వాత గోవిందరావు అడ్డం అంది. ఆయనా చని పోయాడు. ఆ తర్వాత వెంకట్రావు అడ్డం అంది.

అప్పుడే స్వాతిలోని రక్తదాహాన్ని గుర్తించాను. రహస్యంగా వాళ్ళింటికి వెళ్ళి మాటు వేసి విన్న సంభాషణ ప్రకారం వాళ్ళు వెంకట్రావునూ, నన్నుకూడా చంపా లనుకుంటున్నారు. మొత్తం రెండు కుటుంబాల ఆస్తికీ, వ్యాపారాలకూ సర్వాధిపత్యం వహించాలని అనుకుంటు న్నారు.

స్వాతి అసలు స్వరూపం తెలిసేక నాకు స్త్రీజాతి అన్నా, ఈ జీవితం అన్నా అసహ్యం వేసింది. చావాలని పించింది. కానీ చచ్చేముందు నా కథను అందరికీ వినిపించాలి.

ఇంతవరకూ జరిగిన హత్యలు, ఇకముందు జరుగనున్న హత్యలు ఎలా జరిగాయో తెలియక పోలీసులు కొట్టుకు

చావాలి. పోలీసుల నేడిపించడానికి నా కింతకంటె మార్గం కనిపించలేదు'' అని ఆగాడు రాము.

అతని మాటను వినగానే అక్కడున్న అందరి ముఖాల్లోనూ ముచ్చెమటలు పోశాయి.

''నువ్వంటున్నవన్నీ అబద్ధం. అసలు మా యింటికి రహస్యంగా ఎవ్వరూ రాలేరు. గేటువద్ద పటిష్టమైన ఏర్పాటుంది'' అంది స్వాతి.

''ఇంతవరకూ వాచ్‌మన్‌కి పదిహేను వేలిస్తానని ఉండరు'' అని నవ్వాడు రాము. ఆ నవ్వు చూస్తూండగా వికటంగా మారింది.

''అయితే ఆ హత్యలన్నీ ఎలా చేశావ్?'' అన్నాడు వెంకట్రావు.

''నేను రెండు సంవత్సరాలు ఆఫ్రికాలో వున్నాను. అక్కడ ఓ కొత్తరకం ఈగల్ని చూశాను. సుందరం అని ఓ ఇండియన్ సైంటిస్టు అక్కడ రకరకాల ఈగల మీద పరిశోధన చేస్తున్నాడు. ఈ ఈగలు కొబ్బరి వాసనను ఇట్టే పట్టేస్తాయి. ఏ మనిషయినా కొబ్బరి తింటే ఈ ఈగలు సుమారు రెండు కిలోమీటర్ల ఆవరణలో ఆ మనిషి వాసన పసిగడతాయి.

ఒకే చెక్కలోని కొబ్బరి ఈ ఈగలకూ, ఓ మనిషికీ పెడితే రెండు కిలోమీటర్ల వరకూ అవి అతిసులభంగా ఆ మనిషిని గుర్తించగలవు. ఈ ఈగల్లోని రెండో విశేషం కొబ్బరి తిన్న మనిషిని ఇవి కుడితే ఆ మనిషి వెంటనే మారు మాట్లాడకుండా గుండె ఆగి మరణిస్తాడు. ఆ దేవుడే దిగివచ్చినా అది హత్య అని తెలుసుకోలేడు. నేనా ఈగల్ని ప్రయోగించి ఇంతవరకూ మూడు

హత్యలు చేశాను. మిగతావి యిప్పుడు చేయబోతు న్నాను...'' అని ఆగాడు రాము.

అక్కడున్న అందరి ముఖాల్లోనూ భయం స్పష్టంగా కనబడుతోంది.

''మనం సరిగ్గా అయిదుగురం. ఒకసారి మనిషిని కుట్టేక ఈ ఈగకున్న విష ప్రభావం పోతుంది. ప్రస్తుతం నావద్ద మిగిలినవి మన అయిదుగురి కోసం అయిదు ఈగలు. మనమందరం ఒకేసారి సహజంగా ఎలా మర ణించామో తెలియక పోలీసులు బుర్రలు బద్దలు కొట్టు కుంటారు'' అంటూ రాము సిగరెట్ పెట్టెలోని సిగ రెట్లు తీశాడు. సరిగా అయిదు సిగరెట్లున్నాయి.

''వీటిల్లో వున్నాయి — ఒకో సిగరెట్లో ఒకో ఈగ చొప్పున. అంతా దైవప్రార్థన చేసుకోండి'' అన్నాడు రాము. ''ఇప్పుడు మీ అందరి ముఖాల్లోనూ మృత్యుకళ అద్భుతంగా కనబడుతోంది.''

వెంకట్రావు, రాజు ముందుకు వురకబోయారు.

''సాహసం చావును దగ్గర చేస్తుంది. మీరు ముందు కురికితే మిమ్మల్ని మీరు రక్షించుకోగలగడం కల్ల. ఒక్క నిమిషం టైమిస్తున్నాను. చేతనయితే రెండు కిలోమీటర్ల దూరం పరుగెత్తండి. చావు తప్పించు కుంటారు. ఊఁ క్విక్!'' అన్నాడు రాము.

రాము నోటమ్మట ఆ మాటలు రావడంతోటే నలు గురూ ఆ గదిలోంచి ఒక్కసారిగా పరుగు లంకించు

ఉన్నారు. ఒక్కొక్కరే తమ శక్తంతా కూడగట్టుకుని పరుగుపెడుతున్నారు...

మర్నాట్నించి___

అంతవరకూ పోయిన ముగ్గురూ కాక మరో అయిదుగురు ఒక్కసారిగా సహజ మరణం ఎలా పొందారో తెలియక పోలీసులు బుర్ర బద్దలు కొట్టుకోవడం ప్రారంభమైంది.

—: ఐపోయింది :—

# పరువా? ప్రాణమా?

'సికిందర్'

"బ్లూసీ—పిక్నిక్ కాటేజెస్ & రెస్టారెంట్."

ఆ బోర్డుమీది అక్షరాలనీ, అక్కడి వాతావరణాన్నీ చూసి ముచ్చటపడింది శ్యామల. "బాగుంది!" అంది. "చాలా బావుంది!" అన్నాను.

యూనిఫాంలో వున్న ఒక మనిషి మా దగ్గిరికి వచ్చాడు. "కాటేజీ కావాలా సార్?" అనడిగాడు వచ్చీరాని తెలుగులో. నేను మోటార్ సైకిల్ ఇంజనాఫ్ చేసి వద్దన్నట్టు తెలిపాను. శ్యామల మింగేసేలా చూసింది.

ఆమె అలా మింగేసేలా చూస్తే మొదట్లో భయపడేవాణ్ని. ఇప్పుడా భయం పోయింది. పైగా వినోదంగా వుంటోంది.

"ఎందుకు వద్దూ?" కసిరిందామె. నేనా మనిషి వేపు తిరిగి 'డిసీజ్ పర్సనల్' అన్నట్టుగా చూశాను. అతను అర్థంచేసుకుని వెళ్ళిపోయాడు. నేను శ్యామలవేపు తిరిగి సిగరెట్ వెలిగించాను. "నా దగ్గర డబ్బులేదు." అన్నాను నెమ్మదిగా.

"అయితే ఇక్కడికి ఎందుకు తీసుకవచ్చారు?" తీవ్రంగా అంది శ్యామల.

"ఇక్కడి దృశ్యాలు చూపిద్దామని." అన్నాను.

"ఏమిటిక్కడ చూసేది! రాళ్ళూ రప్పలూ! పదండి పోదాం!"

"అప్పుడేనా? నాకు అలసటగా వుంది. బండి నేను నడపలేను. నువ్వు నడుపుతావా?" అడిగాను.

ఆమె "హుఁ!" అని కసిరి, మింగేసేలా చూసి, "ఈ ఒక్క ఆదివారమైనా సరదాగా గడపవచ్చనుకున్నాను. ఇంత మోసం జరుగుతుందనుకోలేదు! పదండి పోదాం! మీతో కాలక్షేపం కోరడం నా బుద్ధి తక్కువ!" అంది.

"శాంతించు, శ్యాం! అలా వెళ్ళి కూచుందాం, పద! మూడు గంటలవరకు నేను ఫ్రీగా వుంటాను. ఆ తర్వాత ఎడిటర్‌ని కలుసుకోవాలి!!

"మీ ఉద్యోగం నాకు నచ్చలేదు!" అందామె విసుగ్గా.

"ఆ వూసెత్తకు. ఏవేనా కొత్త విషయాలు మాట్లాడు."

ఆమె మాట్లాడలేదు. నిశ్శబ్దంగా ఇసుకలో కొంత దూరం నడిచాం. సమయం పదకొండుగంటలైంది. ఎండ తీవ్రంగా వుంది. సూర్యకిరణాలు సాగర్ చెరువులో పడి కళ్ళు చెదరగొడుతున్నాయి.

"అక్కడ కూచుందాం" అన్నాను గుబురుగా వున్న పొదల్ని చూపిస్తూ.

ఆమె సాలోచనగా తలూపింది. మేం ఇప్పుడు పూర్తిగా నిర్జనంగా వున్న ప్రదేశం చేరుకున్నాం. ఇసుకలో నడకకష్టంగా వుంది. ఆ పొదల దగ్గర కూచున్నాక ఇసుకలో వలయం గీశాను.

"మీరు డబ్బు ఎందుకు సంపాదించకూడదు?" అడిగిం దామె అకస్మాత్తుగా.

నేను తృళ్ళిపడి ఆమె ముఖంలోకి చూశాను. "ఎలా?"

"మరో నవల వ్రాసి."

"ఓపిక లేదు. వున్నా తీరిక లేదు."

"ఆ ఉద్యోగం మానెయ్యకూడదా?"

"ఆ ఉద్యోగం చాలా పవిత్రమైనది శ్యాం."

నవ్విందామె. "అవినీతి, అన్యాయాలమీద యుద్ధం సాగిస్తున్న మీకు ఎక్కడేనా పవిత్రత కన్పించిందా?"

"లేదు."

"ఈ సమాజాన్ని ఈ రోజుల్లో సంస్కరించడం అసాధ్యమని ఒప్పుకుంటారా?"

"బాస్ ఒప్పుకోడు. సాధ్యమని ఆయన నమ్మకం. ఆయన ఆశయాల్ని, లక్ష్యాల్ని విమర్శించే హక్కు ఎవరికీ లేదు శ్యాం. ఇక ఈ విషయం చర్చించడం అనవసరం! వేరే విషయాలు మాట్లాడు. వచ్చే నెలలో పాతిక వేలకి ఇన్సూరెన్స్ చేయించాలనుకుంటున్నాను. నీ అభిప్రాయ మేమిటి?"

"మీ ప్రాణాలకంటే నాకేదీ ఎక్కువ కాదు!" అందామె.

"అర్థమయేలా చెప్పు!"

"ఈ ఉద్యోగంలో మీకు రోజురోజుకీ శత్రువులు పెరిగిపోతున్నారు—గూండాలు, స్మగ్లర్లు, హంతకులు. మీ బాస్ కోటీశ్వరుడు. ఆయన్ను ఎవరూ ఏమీ చేయ లేరు! ఆయన శత్రువుల దుర్మార్గాలకి బలయ్యేది ఆయన ఉద్యోగులే! మీ బాస్ ఆశయాలు నాకేమీ నచ్చ లేదండీ!"

శాస్త్రపు ఆలోచించాను. "శ్యాం. ఆయనదగ్గర పని చేసే ఉద్యోగులకి పూర్తి రక్షణ వుంటుంది. ఇంతవరకు మాపైన ఎలాంటి అఘాయిత్యాలూ జరగలేదు. జరగవు! నీకు చాలాసార్లు చెప్పాను, నా ఉద్యోగం వూసు ఎత్త వద్దని!"

"గుడ్ మార్నింగ్ మిస్టర్ సోమసుందర్ జీ!" వినిపించాయి మాటలు.

నేను తికమకపడి వెనక్కి తిరిగిచూసి అదిరిపడ్డాను.

ధరమ్ దేవ్! వీడిక్కడికి ఎందుకు వచ్చాడు!?

శ్యామల నా భయం పసిగట్టి దగ్గరగా జరిగింది.

ఆ మనిషి గబగబ నడిచివచ్చి నా ఎదురుగా నిలబడ్డాడు. నేను భయపడుతూ లేచి నిలబడ్డాను.

"నమస్తే బహెన్ జీ!" శ్యామలను చూసి పలకరించాడతను. "మిస్టర్ సుందర్. మీతో ముఖ్య విషయం మాట్లాడాలి. ఆమె ముందు మాట్లాడవచ్చా?"

"ఏ విషయం మాట్లాడాలి?" భయం దూరం చేసుకుని ధైర్యంగా అడిగాను.

అతనికి ముప్ఫై ఏళ్ళుంటాయి. ఎర్రబడ్డ జుత్తు. పిల్లికళ్ళు. నున్నగా గీసుకున్న గడ్డం. బ్లూ కలర్ జీన్స్ లో వున్నాడతను.

"టేప్స్ అండ్ రిపోర్ట్స్" అన్నాడతను అదోలా నవ్వుతూ.

తిరిగి భయం ఎక్కువైంది నాకు. "మీ రెవరు?" అర్చాను గట్టిగా. శ్యామల నా చెయ్యి గట్టిగా పట్టుకుని దగ్గరగా జరిగింది.

"మీకు తెలుసు సుందర్. నన్ను ఫోటోలు తీశారు, నా మాటలు రికార్డ్ చేశారు. నామీద రిపోర్ట్ వ్రాశారు

సుందర్, బొంబాయి స్మగ్లర్స్‌తో ఆట చాలా ప్రమాద కరం. వాటిని ఇచ్చేయండి!"

"మీరేం చెప్తున్నారో అర్థంగావడంలేదు. మిమ్మల్నెక్కడా చూడలేదు. మీ పేరేమిటో కూడా తెలియదు!" ఆత్రుత అణుచుకుంటూ అర్చాను.

ఫకాలున నవ్వాడతను. "బుకాయించి లాభంలేదు సుందర్ జీ! కంపాలా హోటల్ గదిలో నాకూ గణేష్‌కీ మధ్య జరిగిన సంభాషణల్ని పక్క గదిలో కూచోని మైక్రోఫోన్‌తో మీరు రికార్డ్ చేశారు. నిరూపణ కావాలంటారా? అయితే ఈ విజిటింగ్ కార్డు చూడండి. మా పక్కగదిలో దొరికింది. ఒప్పుకుంటారా?"

"అబద్ధం. అక్కడ దొరక లేదు! మరెక్కడైనా దొరికి వుండవచ్చు!"

"మీరంత తెలివి తక్కువగా ఎందుకు బుకాయిస్తున్నారు సుందర్? హోటల్ రిజిస్టర్‌లో మీ పేరు వుంది– మారు పేరు. పేరు మార్చుకున్నారు కాని వేషం మార్చలేదు. మిమ్మల్ని కౌంటర్ క్లర్క్ గుర్తుపడతాడు" నవ్వాడతను.

నాకు చెమటలు పట్టాయి. ఇక నా బుకాయింపులు పనికిరావు.

"సుందర్" అన్నాడతను మళ్ళీ. "మీరు చేసిన ఘన కార్యం తెలిసి మిమ్మల్ని చంపేస్తానని బయలుదేరాడు గణేష్. నేనే అతన్ని శాంతపర్చి వచ్చాను. మర్యాదగా ఆ ఫోటోలు, టేప్స్, రిపోర్ట్స్ నాకిచ్చేయండి. ఇంకెప్పుడూ ఇలాటి పొరపాటు చేయకండి!"

శ్యామల అయోమయంగా చూస్తోంది.

"ఇప్పుడు...ఇప్పుడు ... అవి నా దగ్గర లేవు దేవ్. బాస్ చేతిలో కెళ్ళాయి. ఆయనకి చిక్కిన వస్తువు ఎవరూ దక్కించుకోలేరని మీకు తెలుసా?"

"ప్చ్, నేను x జేమ్‌ని పంపిన్వవలసింది!" బాధపడ్డా డతను.

నేను గాభరాపడ్డాను. "x జేమ్ ఎక్కడ వున్నా డిప్పుడు?"

"సుందర్. నేనడిగినవి మీరిచ్చేస్తే x జేమ్‌కి భయపడ నవసరం లేదు." అన్నాడతను.

"అవి నా చేతిలో లేవని చెప్పాను." నిర్లక్ష్యంగా అన్నాను.

"మీరు క్షేమంగా వుండాలనుకుంటే వెళ్ళి బాస్ దగ్గర నుంచి తీసుకురండి!"

ఆయనకి చిక్కింది దక్కదు!"

అతను క్రూరంగా చూశాడు. "స్మగ్లింగ్ వ్యవహారాల్లో తల దూర్చడం మంచిదికాదని మీ బాస్‌తో చెప్పండి' స్మగ్లింగ్‌ని రూపుమాపడం ప్రభుత్వానికే సాధ్యంకాని పని. మీ పత్రిక ఎంత?!" హేళనగా అన్నాడతను.

శ్యామల నా చెవిలో అంది. "అతనడిగింది ఇచ్చే యండి!"

"సుందర్. ఆమె మీ క్షేమంకోరి చెబుతోంది."

నే నతని వేపు తిరిగాను. "చూడండి ధరమ్‌జీ, పరిస్థితి చేయి దాటిపోయింది. ఎవరూ ఏమీ చేయలేరు. నేను సంపాదించిన వివరాలు మీకు చిక్కవు. పత్రికలో వస్తాయి. ఈ విషయంలో ఏదేనా మాట్లాడాలనుకుంటే నా బాస్‌తో మాట్లాడండి. నేను మిమ్మల్ని నిరాశపరిచి నందుకు క్షమించండి" అన్నాను.

అతనింకా కర్కశంగా చూశాడు. "నన్ను నిరాశ పర్చినందుకు చింతిస్తారు! సుందర్, చివరిసారిగా అడుగు తున్నాను. వాటిని నా కిచ్చేయండి!"

గాభరాగా చూసింది శ్యామల. నేను అడ్డంగా తలూపాను.

శ్యామల అర్చింది: "వాడడిగింది ఇచ్చేయండి! స్మగ్లర్లతో వైరం మనకు వద్దు."

నేనతని వేపు తిరిగాను. "దేవ్, నా చేతిలో ఏమీ లేదని చెప్పాను. నేను రిపోర్టర్ని. మీ స్మగ్లింగ్ పథకాలు బట్టబయలు చేయడానికి వివరాలు సంపాదించాను. ఆ వివరాలిప్పుడు బాస్ దగ్గర వున్నాయి. అవినీతి, అక్రమాల్ని రూపుమాపడం మా పత్రిక లక్ష్యం. ఆ వివరాలు బాస్ చేతికి చిక్కాక మీరేమీ చేయలేరు!"

అతను తీవ్రంగా ఆలోచించి, "నాతో రండి!" అన్నాడు.

"ఎక్కడికి?"

"గణేష్ దగ్గరికి. మిమ్మల్ని దారికి తేవడం అతనికే సాధ్యం ..కమాన్!"

దేవ్ నా కాలరు పుచ్చుకుని బలంగా లాగాడు. ముందుకు తూలాను.

శ్యామల భయంతో అరుస్తోంది. చుట్టుపక్కల ఎవరూ లేరు.

అతను నా కాలరు పట్టుకోడంతో నా కోపం ఎక్కువైంది. గడ్డంకింద చెయ్యిపెట్టి వెనక్కి నెట్టాను బలంగా. అతను వెల్లికిలా ఇసుకలో పడ్డాడు. నేనతని మీదకు దూకబోయేంతలో అతను స్ప్రింగ్ లా లేచి నా నడుము

మీద తన్నాడు. గట్టిగా అర్చి కిందపడ్డాను. శ్యామల కెవ్వుమని అర్చింది.

అతను జేబులోంచి కత్తితీసి నామీదికి దూకాడు. నేను పక్కకి దొర్లాను. కత్తి ఇసుకలో దిగబడింది.

వేగంగా జరిగి అతని వీపుమీద బూటుకాలితో తన్నాను. అతను కళ్ళు తేలేసి బోర్లాపడ్డాడు. నేను వెంటనే లేచి పక్కనేవున్న బండ తీసి అతని తలమీద పడేయబోయాను. శ్యామల విసిరికొట్టింది. నా కోపం చల్లారలేదు. అతని వీపుమీద కూర్చొని పిడికిళ్ళతో నెత్తి మీద కసికొద్దీ బాదసాగాను.

అతను ఎప్పుడు తెలివితప్పాడో నాకు తెలియదు' నేనింకా అతన్ని బాదుతున్నాను, రక్కుతున్నాను' బట్టలు చింపేస్తున్నాను...

శ్యామల పిచ్చిగా అరుస్తూ నన్ను కుదిపేస్తోంది. కాస్సేపయ్యాక నేను తెలివిలోకొచ్చి చూశాను. నా కోపం చల్లారింది. దేవ్ బోర్లా పడివున్నాడు తెలివితప్పి.

నేను వెంటనే లేచి శ్యామల చెయ్యి పట్టుకుని, శక్తి కొద్దీ పరిగెత్తాను.

## 2

"బ్లేడ్" పత్రికకి రిపోర్టర్‌గా నేను రెండేళ్ళనుంచీ పని చేస్తున్నాను. సిటీలో అవినీతి, అక్రమాలూ, అన్యాయాల్ని రూపుమాపడం యీ పత్రిక లక్ష్యం. నేనీ పత్రికలో రిపోర్టర్‌గా చేరడం చాలా విచిత్రంగా జరిగింది.

రెండేళ్ళ క్రితం నేను 'ప్రాగాటూల్స్'లో పని చేస్తుండేవాడ్ని. ఆదాయం అంతంతమాత్రం. ఆదాయం

అంతగా లేకపోయినా విలాస జీవితానికి అలవాటుపడి ఆకలితో పడుతున్న రోజులు చాలా వున్నాయి.

అలాటి పరిస్థితిలో శ్యామల నాకో సలహా యిచ్చింది, నవల వ్రాయమని. అంతకు ముందు 'అపరాధ పరిశోధన'కి కథలు వ్రాసేవాడ్ని.

నవల వ్రాస్తే జరిగే మంచి ఏమిటని అడిగాను. ఆర్థిక యిబ్బందులు తొలగుతాయని చెప్పింది. నవల వ్రాసేశాక్కి నాకుందిగానీ ప్రచురించే దెవరు? ప్రచురణ విషయం తర్వాత ఆలోచించవచ్చు. ముందు మీరు వ్రాయండని పట్టుబట్టింది శ్యామల.

ప్రతి మహాపురుషుడి వెనుక ఒక మహిళ వుంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. ఆమె నన్నిలా ఎంకరేజ్ చేస్తుంటే నేను గొప్పవాడ్నయిపోతా నేమోనని అనుమాన పడ్డాను.

నవల రచించడం ప్రారంభమైంది. పేరు 'నీతి విలువ ఎంత?'. ఇతివృత్తం పూర్తిగా క్రైం. మూడు నెలలు నేను డిక్టేట్ చేస్తుంటే శ్యామల చక చక వ్రాయగా వెయ్యి పేజీల నవల తయారైంది. నవల పూర్తయ్యాక గాభరాపడ్డాను. వెయ్యి పేజీల క్రైం ఎవరయినా భరించ గలరా అని.

శ్యామల మరేం భయంలేదని చెప్పి, ఆ కాయితాల్ని లావాటి దారంతో వట్టేసి పార్శిల్ కట్టి పంపించేసింది మద్రాసుకి.

అలా వెళ్ళిన కట్ట యిలా తిరిగి వచ్చింది. అందులో పబ్లిషర్ గారి వుత్తరంలో ఒకే ఒక్క వాక్యం వుంది:

వెయ్యి పేజీల క్రౌం చదివితే పిచ్చాసుపత్రిపాలు కావడం ఖాయమని.

అనుకున్నట్టే జరిగింది! ఇక లాభం లేదనుకుని ఆ కట్టని తూకానికి వేసేయమని చెప్పాను. ఆమె వినలేదు. పంపిస్తూనే వుంది, ఆ కట్ట తిరిగి వస్తూనే వుంది. చివరకు పదెనిమిదవసారి పంపించిన కట్ట తిరిగిరాలేదు.

నేను దాని గురించి పట్టించుకోలేదు. శ్యామల చాలా కంగారు పడింది.

వారం గడిచాక పబ్లిషర్ నుంచి ఉత్తరం వచ్చింది-ప్రచురణకు స్వీకరిస్తున్నట్టు తెలియజేయడానికి సంతోషిస్తున్నట్టు.

వెంటనే వెళ్ళి పబ్లిషర్‌ను కలుసుకున్నాను. రెండు వందల పేజీలకి ఒక భాగం చొప్పున ఆ నవలని అయిదు భాగాలుగా విడుదల చేస్తామని ఆయన చెప్పాడు. ఒక్కో భాగానికి అయిదు వందల చొప్పున పారితోషికం ఇస్తున్నట్టూ, అమ్మకాలమీద పది శాతం రాయల్టీ ఇస్తున్నట్టూ తెలియజేశాడు. అంగీకరించాను. అగ్రిమెంటు కుదిరింది.

అంతే, అక్కడినుంచి నా జాతకం తిరగబడింది. ఒక్క సంవత్సరంలో ఆరు ప్రచురణలు పొందింది నా నవల. చెక్కుల మీద చెక్కులు వచ్చి పడుతున్నాయి. శ్యామల ఆనందానికి హద్దులేవు. ఒక మోటర్ సైకిల్ కొనమంది. కొనేశాను. మిగతా డబ్బు బ్యాంకులో వేసేశాను.

సరిగ్గా ఆ రోజుల్లోనే "బ్లేడ్" పత్రిక యజమాని శ్రీ మఛ్ఛీందర్‌రావు నుంచి కబురు వచ్చింది వెంటనే కలుసుకోమని. వెంటనే కలుసుకున్నాను. నా అయిదు

భాగాల నవల ఆయన ఓపిగ్గా చదివాక ఒక విషయం గ్రహించాడుట— నాలో ఆయనకి పనికివచ్చే లక్షణాలు వున్నాయట.

ఏమిటవని అడిగాను. నీతిమీద నేను వెల్లడించిన అభిప్రాయాలు తనకి నచ్చాయని, నాలాటి మనుషుల అవసరం తనకి చాలా వుందని, అవినీతిని నిర్మూలించే తన పథకంలో నన్ను చేరమనీ చెప్పాడతను. అక్కడి నుంచి నా రిపోర్టర్ జీవితం ప్రారంభమైంది. నెలకి పది హేను వందలు జీతం.

'బ్లేడ్' పత్రికకి లక్ష సర్క్యులేషన్ వుంది. పది మంది రిపోర్టర్సు వున్నారు. రాష్ట్రంలో జరిగే అన్యాయాలూ, దౌర్జన్యాలూ మొదలయిన వాటిని ఫోటోలతో సహా ఆధారాలతో ప్రతి శనివారం వెలువడుతూంది ఈ పత్రిక. దీనికి ఎడిటర్ శివరామశర్మ.

మహీందర్ రావుకి మోసాలూ, దౌర్జన్యాలూ, అన్యాయాలూ నచ్చవు. వాటిని రూపుమాపాలని ఆయన ఆశయం.

ఆయన కోటీశ్వరుడు. భార్యా పిల్లలుగానీ, బంధువులు గానీ లేరు. అరవై ఏళ్ళ వయసులోనూ చాలా చురుగ్గా వుంటాడు.

దాన ధర్మాలు చేయుటలో అందెవేసిన చేయి. దేశ వ్యాప్తంగా ఎన్నో ఆస్పత్రులు, స్కూళ్ళు, సత్రాలూ నిర్మించాడు. ఆ స్తినంతటినీ U. N. I. C. E. F., W. H. O., Cancer, Leprosy మొదలైన సంస్థలకీ, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి, రక్షణ, తుఫాను నిధులకీ చెందేలా వీలునామా ప్రకటించాడు.

ఆయన 'బ్లేడ్' స్థాపించి పదేళ్ళయింది. దేశంలో ఏ పత్రికా చేయని సాహసాలు ఇది చేస్తుందని పేరు వుంది. అవినీతి ఏ స్థాయిలో వున్నా నిర్భయంగా, బాహాటంగా వెల్లడిస్తుంది. వివరాలు సేకరించడానికి అత్యాధునిక పరికరాలున్నాయి.

సినీ నటుల ప్రేమకలాపాలనుంచి రాజకీయనాయకుల లంచగొండితనంవరకు, ప్రభుత్వ కంట్రాక్టర్ల నిలువు దోపిడీ నుంచి పోలీసుల అమానుష కృత్యాలవరకూ... ఈ పత్రిక వెల్లడించని రహస్యమంటూ లేదు.

ఎమర్జెన్సీ రోజుల్లో మా పత్రికకి పోలీసులు శత్రువు లయ్యారు. ఇప్పటికీ మంచి సంబంధాలు లేవు. కాబట్టి మాకు పోలీసు రక్షణ లేదు. మా పత్రికని ఎలా నాశనం చేయాలా అని పోలీసులు వేస్తున్న పథకాల్ని ఇప్పటి వరకు మహేంద్రరావ్ బాడీగార్డ్సు పారకుండా చేశారు.

నేను సేకరిస్తున్న వివరాలతో పత్రిక సర్క్యులేషన్ పెరిగిందని మహేందర్ అభినందించాడు. నేను వెలుగు లోకి లాగిన కుంభకోణాల్లో అన్నిటికంటె పెద్దది భజన్ లాల్ రామ్స్ ఫైనాన్సింగ్ కంపెనీకి చెందిన లావా దేవీలు. ఈ కంపెనీ బోగస్ సంస్థ అని తేలాక పోలీసు లతన్ని అరెస్టు చేశారు.

ఈ రెండేళ్ళ నా వృత్తిలో చాలా రహస్యాలు బయటపెట్టాను. కానీ అవి అంత ముఖ్యమైనవి కావు. పదిహేను రోజుల క్రితం మరేదేనా పెద్ద కుంభకోణం కనుక్కోందామని గాలింపు ప్రారంభించాను.

అప్పుడు నా వలలో చిక్కినవాళ్ళే గణేష్-ధరమ్ దేవ్ లు.

నా ఆనందానికి హద్దు లేవు. ఎందుకంటే గణేష్ సేఠ్ జీవన్‌లాల్ గాంగ్‌కి లీడర్. జీవన్‌లాల్ మా బాస్‌కి పరమ శత్రువు.

సంవత్సరం క్రితం మా బాస్ జీవన్‌లాల్‌తో వ్యాపారంలో పార్ట్‌నర్ గా చేరినప్పుడు అతను తప్పుడు లెక్కలు చూపించి, నష్టం వచ్చిందని ఇరవై లక్షలకి మోసం చేశాడు. ఆ మోసం ఋజువు చేసేందుకు ఎలాంటి ఆధారాలూ లేవు. మహీందర్ అతని మీద కక్ష గట్టాడు. ఎలాగయినా జీవన్‌ని పత్రికకి ఎక్కించాలని మా అందరికీ ఆజ్ఞలు జారీ చేశాడు.

జీవన్ గాంగ్ లీడర్ గణేష్ ఆరోజు ధరమ్‌దేవ్‌తో కన్పించడంతో నాలో కుతూహలం ఎక్కువైంది. ధరమ్‌దేవ్ ఎవరో నాకప్పుడు తెలియదు.

ఆ రోజు ఆదివారం. వాళ్ళు 'జూ'లో కలుసుకున్నారు. నేను వాళ్ళిద్దర్నీ ఫోటో తీశాను. గణేష్ నన్ను గుర్తుపడతాడు కాబట్టి, కంటబడకుండా జాగ్రత్త పడ్డాను.

గణేష్ గురించి అందరూ చెప్పుకునేదేమిటంటే, అతను చూపుడు వేలితో కంఠం మీద పొడిచి గుండెను ఆపేయగలడట!

గణేష్‌కి ముప్పై అయిదేళ్ళు. లావుగా, దృఢంగా వుంటాడు. శరీరంలో కొవ్వు పేరుకుపోకుండా జాగ్రత్త తీసుకుంటాడు. అయిదేళ్ళ క్రితం అతను వరంగల్ నుంచి వచ్చినప్పుడు ఒకరోజు రాత్రి జీవన్‌లాల్‌కి ఫోన్ చేసి, అతని సేఫ్‌లోని నగలు కాజేస్తే బహుమతి ఎంతిస్తావని అడిగాడట.

జీవన్ అతని ధైర్యానికి మెచ్చుకుని పదివేలిస్తా నన్నాడట. జీవన్‌లాల్‌కి అప్పుడు పటిష్టమైన గ్యాంగ్ వుండేది. ఈ దొంగతనం జరగదని అతని నమ్మకం. అప్పటి గ్యాంగ్ లీడర్ వట్టి బఫూన్ అని తాను నిరూపించబోతున్నట్టు, నిరూపించకపోతే తనే పదివేలు ఇస్తాననీ గణేష్, జీవన్‌తో పందెం కట్టాడుట.

ఇచ్చిన మాటప్రకారం, చెప్పిన సమయం ప్రకారం గణేష్ ఆ నగల్ని కాజేసి, గాంగ్ లీడర్ని బఫూన్‌గాచేసి పదివేలు గెలుచుకున్నాడు—నగలతోసహా.

జీవన్ తల తిరిగిపోయి గాంగ్ లీడర్ని కాల్చిచంపేసి, ఆ స్థానంలో వుండమని గణేష్‌ని కోరాడు. గణేష్ గాంగ్ లీడర్ని కాల్చి చంపకుండా కంఠంలో పొడిచి చంపి, గాంగ్ లీడర్ పదవి స్వీకరించాడు.

గణేష్ గాంగ్ లీడర్ అయ్యాక జీవన్ చేయని చెడ్డ పనంటూ లేదు!

ఆరోజు గణేష్, ధరమ్‌దేవ్‌తో జూలో కన్పించి నప్పుడు నేను చాలా జాగ్రత్తగా వాళ్ళని వెంబడించాను. వాళ్ళేమీ ఎక్కువగా మాట్లాడుకోలేదు. వాళ్ళు పొదల దగ్గరవున్న ఒక బెంచీమీద కూచున్నప్పుడు మాటలు వినేందుకు నాకు మంచి అవకాశం చిక్కింది.

రాత్రి పది గంటలకి హోటల్ కంపాలా రూం సెవెంటీఫోర్‌లో కలుసుకోమని గణేష్, దేవ్‌తో చెప్పాడు. అంతకుమించి ఏమీ మాట్లాడుకోలేదు.

నేను వెంటనే ఆ హోటల్‌కెళ్ళి వాళ్ళ పక్కగది అద్దెకితీసుకుని ఏర్పాట్లు పూర్తిచేశాను. మారు తాళాలతో వాళ్ళ గదిలోకి జొరబడి టేప్ రికార్డర్‌కి కనెక్షన్ ఇచ్చాను.

సరిగ్గా పది గంటలకి వాళ్ళిద్దరూ గదిలోకి వెళ్ళి మాట్లాడుకున్నారు. వాళ్ళ మాటలన్నీ రికార్డ్ అయ్యాయి. తెల్లారి వాళ్ళిద్దరూ వెళ్ళిపోయాక నేను అమర్చిన పరికరాలు తొలగించి, గది ఖాళీ చేసి వచ్చేశాను.

ఆఫీసులో ఎడిటర్ సమక్షంలో రికార్డర్ ఆన్ చేసి మాటలు విన్నాను. రిపోర్ట్ తయారుచేశాను:

సిటీలో భారీ ఎత్తున మత్తుపదార్థాల స్మగ్లింగ్ కి వాళ్ళిద్దరూ పథకం తయారుచేస్తున్నారు. ధరమ్ దేవ్ బొంబాయికి చెందిన స్మగ్లర్. మత్తుపదార్థాల స్మగ్లింగ్ లో ఆరితేరిన వాడు. బర్మా, నేపాల్, పారిస్, మాల్టా దీవులు, టాంజానియా నుంచి అతను భారీ ఎత్తున పదార్థాల్ని దిగుమతి చేసుకుంటున్నాడు. వాటిని హైద్రాబాదులో విక్రయించడానికి జీవన్ తో ఒప్పందం చేసుకున్నాడు.

ఈ స్మగ్లింగ్ బిజినెస్ గురించి వాళ్ళు చర్చించుకున్న విషయాలన్నీ టేపులో ఎక్కాయి. ఆటోమాటిక్ కెమేరా తీసిన ఫోటోల్లో జీవన్ లాల్ కూడా వున్నాడు!

అగ్రిమెంట్ కాయితాలమీద సంతకాలు పెడుతున్నప్పుడు తీసిన ఫోటో చాలా చక్కగా వచ్చింది!

ఈ విషయాలన్నీ తెలిశాక మచ్ఛీందర్ రావ్ ఆనందానికి అవధుల్లేవు! తన శత్రువు తన వలలోపడి నాశనమవుతున్నందు కెంతో ఆనందించి, నన్ను అభినందించాడు.

ఆ టేపులు, ఫోటోలూ, రిపోర్ట్సు ఆఫీసు సేఫ్ లో వున్నాయి భద్రంగా. వచ్చే సంచికలో అవి ప్రచురింపబడతాయి. ఆ సంచిక వెలువడడానికి ఇంకా అయిదు రోజులున్నాయి. ఆరవరోజు జీవన్ లాల్ వినాశనం తప్పదు!

కానీ నేను వివరాలు సేకరించినట్టు వాళ్ళకెలా తెలిసిందో అంతుబట్టలేదు. ఆ హోటల్ రూం ఖాళీచేసి పదిహేను రోజులు గడిచాయి.

ఏదేమైనా ఆ టేప్స్, ఫోటోలు, రిపోర్ట్స్‌కోసం మా మధ్య తీవ్రమయిన యుద్ధం ప్రారంభమవుతుంది. శత్రువుల చేతికి అవి చిక్కవన్నది నిశ్చయం. మా బాస్ చేతికి చిక్కిన వస్తువు ఎవరూ దక్కించుకోలేరు!

అప్పుడే యుద్ధం మొదలైంది. దేవ్ నాపైన దాడి చేశాడు. నేనెలాగో తప్పించుకున్నాను. కానీ గణేష్ గురించి భయంగా వుంది. నేనతనికి చిక్కానంటే అతని చూపుడువేలి టెక్నిక్‌కి బలికాక తప్పదు!

ముందు బాస్‌కి చెప్పేయాలి. ఆయన నా జాగ్రత్త తీసుకుంటాడు. ఇంటికివెళ్ళి ఆయనకి ఫోన్ చేయాలి.

అదిరిపడ్డాను. హఠాత్తుగా మోటార్ సైకిల్ ఆపేశాను. శ్యామల బిత్తరబోయి చూసింది.

బాస్ సిటీలో లేడు! ఢిల్లీ వెళ్ళాడు! రేపటికిగాని తిరిగిరాడు!

# 3

నేను విపరీతంగా వణకడం శ్యామల పసిగట్టి భయంగా చూసింది. నేనామెకి ఏదీ వివరించే స్థితిలో లేను. ఏం చేయాలో నిర్ణయించుకునే స్థితిలోలేను. బాస్ సిటీలో లేడన్న విషయం తట్టాక నా ధైర్యమంతా ఎగిరిపోయింది.

తిరిగి మోటార్ సైకిలు స్టార్ట్‌చేసి వేగంగాపోనిచ్చాను. గణేష్ ఎక్కడ వున్నాడు? దేవ్ తెలివిలోకి రావడానికి ఎంతోసేపు పట్టదు. అతను వెంటనే గణేష్‌ని కలుసుకుంటాడు. గణేష్ నావెంటబడతాడు.

ఏ క్షణాన్నైనా నా ఇంటికి వచ్చేస్తాడు. ఇంటికి వెళ్ళ కూడదు! ముందు ఆఫీసుకెళ్ళి ఎడిటర్‌ని కలుసుకోవాలి. పరిస్థితిని వివరించి చెప్పాలి. బాడీగార్డ్స్‌ని రంగంలోకి దించాలి...

అరగంట తర్వాత ఆఫీసుకి చేరుకుని ఎడిటర్ శర్మని కలుసుకున్నాను. మా అవతారంచూసి అతను కంగారు పడ్డాడు. నేనతనితో మాట్లాడకుండా ముందు బాడీగార్డ్ రాబర్ట్‌కి ఫోన్ చేసి గణేష్ ఎక్కడ వున్నాడో తెలుసుకుని తెలియజేయమన్నాను. ఆ తర్వాత శర్మకి వివరించి చెప్పాను.

అతను నవ్వి అంతగా భయపడనవసరం లేదన్నాడు. నా భయం అతనికి తెలీదు! మహీందర్ రావ్ శత్రువుమీద నేను వలపన్ని వివరాలు సేకరించి ఆయన్ని సంతోష పెట్టాను. కానీ నాకు తెలియకుండా నేను చేసిన పొరపాటు వల్ల శత్రువులకా విషయం తెలిసిపోయింది. బాస్ నన్ను క్షమించడు! తగిన శిక్ష వేసి పత్రికలోంచి బహిష్కరిస్తాడు!

బాస్ విషయం అలా వుంచి ముందు గణేష్ గురించి ఆలోచించాలి. నన్ను చంపేందుకు బయలుదేరితే తను అడ్డగించినట్టు దేవ్ చెప్పాడు. గణేష్ ఇప్పుడు నన్ను తప్పక చంపేస్తాడు!

అతనికా ఆధారాలు అప్పగించేస్తే? ప్రాణాలు దక్కుతాయి! అప్పుడు బాస్ పరువేం అవుతుంది? ఆయన ఓటమికి కారకుడ్ని నేను కానా?

లేదు, ఇలా జరక్కూడదు! నన్ను నేను రక్షించుకుంటూ బాస్ శత్రువుమీద దెబ్బతీయాలి!

"సుందర్, నువ్వు అనవసరంగా భయపడుతున్నావు" శర్మ అన్నాడు నా ముఖంలోకి నవ్వుతూ చూసి. "ఇది చాలా సామాన్య విషయం. గణేష్ నిన్నేమీ చేయడు. నిన్ను కొట్టినా చంపినా అతనికి లాభం వుండదు. అతనికా ఆధారాలు కావాలి. అవిప్పుడు యిక్కడే సేఫ్‌లో వున్నాయి. కానీ బాస్ దగ్గర వున్నాయని నువ్వు బుకాయిస్తే అతను తేలిగ్గా పరిస్థితి అర్థంచేసుకుంటాడు. నేరుగా బాస్‌ని కలుసుకుంటాడు. నీవల్ల అతనికి ఉపయోగం వుండదు!"

"ఎందుకు వుండదు? నన్ను బంధించి బాస్‌ని బెదిరిస్తే?"

"బాస్ చేతికి చిక్కింది దక్కదని అతనికి తెలుసు. నిన్ను బంధించేంతటి చౌకబారు పథకం పనికిరాదని అతనికి తెలుసు. మరేదో పటిష్టమైన పథకం తయారు చేస్తాడు—"

"ఏమిటది?" కంగారుగా అడిగాను.

నా ప్రశ్నకి సమాధానమిచ్చే స్థితిలో లేడు ఎడిటర్. కాస్సేపు సీలింగ్ ఫ్యాన్ కేసి సూటిగా చూస్తూ తీవ్రంగా ఆలోచించాడు. అతని సలహాలు నేను పాటిస్తాను. అతని ఆలోచనలు, వూహలమీద నాకు నమ్మకముంది.

"సుందర్, నాకో వూహ తడుతోంది," కాస్సేపాగి మళ్ళీ అన్నాడు ఎడిటర్. "బాస్‌ని అతను బ్లాక్ మెయిల్ చేస్తే తప్ప వాటిని దక్కించుకోలేడు!"

"ఇంపాసిబుల్! అతనిదగ్గర ఏం ఆధారాలున్నాయి బ్లాక్ మెయిల్ చేయడానికి? ఒకరు తనమీద వేలుపెట్టి చూపించేపని బాస్ ఎన్నడూ చేయరు! ఆయన అవినీతిని నిర్మూలించడానికి - కంకణం..."

ఫోను మోగింది. శర్మ రిసీవర్ ఎత్తి అవతలి మాటలు విని తిరిగి క్రేడిల్ చేసి ఈలవేశాడు.

"సుందర్, గణేష్ ఎక్కడ వున్నాడో బాడీగార్డ్స్ గాలిస్తున్నారు. తెలిసిన వెంటనే తెలియజేస్తామని రాబర్ట్ అన్నాడు. ఆల్ రైట్, నేను బాస్‌కి ట్రంకాల్ చేసి పరిస్థితి వివరిస్తాను. నువ్వు ఇంటికి వెళ్ళవచ్చు నిర్భయంగా. బాడీగార్డ్స్ నీకు రక్షణగా వుంటారు. ఏమంటావు?"

"అలాగే!" అన్నాను. "బాస్ ఏం చెప్పారో నాతో చెప్పండి."

"ష్యూర్."

మళ్ళీ ఫోన్ మోగింది. శర్మ రిసీవర్ ఎత్తి, "సుందర్, నీకే" అన్నాడు.

నేను గాభరాగా రిసీవర్ లాక్కున్నాను. అవతలి గొంతు పలికింది, "మిస్టర్ సుందర్!"

నా గుండెలదిరాయి. "అవును" అన్నాను పూడుకుపోయిన గొంతుకతో.

"సుందర్, నువ్వు వెంటనే నీ యింటికి బయలుదేరి వచ్చేయ్! బాడీగార్డ్సుతో కాదు, భార్యతో మాత్రమే. నీతో చాలా టాప్ సీక్రెట్ మాట్లాడాలి."

"గణేష్!" అని అరవబోయి వూరుకున్నాను. ఎడిటర్ నన్ను జాగ్రత్తగా పరీక్షిస్తున్నాడు. "ఏం మాట్లాడాలి?" అడిగాను ఆదుర్దా అణచుకుంటూ.

"ఫోన్‌లో చెప్పకూడదు! వెంటనే వచ్చేయ్ సుందర్! నువ్వు క్షేమంగా వుండాలంటే బాడీగార్డ్స్‌ని తీసుకురాక! అర్థమైందా? నేను ఫోన్ చేసినట్టు ఎవరికీ చెప్పక! ఏమిటి?"

"అలాగే—ఎక్కడనుంచి మాట్లాడుతున్నావు?"

"నీ యింటినుంచి. బాడీగార్డ్స్ నిన్ను వెంటాడకుండా చూడు. డిసీజ్ టాప్ సీక్రెట్! కమ్ క్విక్!" లైను కట్ అయింది.

నా ఒళ్ళంతా చెమటలు పట్టాయి. గొంతు ఎండి పోయి దాహం వేస్తోంది. గజగజ వణుకుతున్న నన్ను శ్యామల, శర్మ చిత్రంగా చూస్తున్నారు.

"సర్, నేను వెళుతున్నాను..." గొణిగాను.

"ఫోన్ చేసిం దెవరు?" అనుమానంగా అడిగాడు శర్మ.

"మేనేజర్... మేనేజర్... బ్లూసీ రెస్టారెంట్ మేనేజర్."

"ఎందుకు?"

"సర్, ఏమీ లేదు...ఏమీ కాదు! నేను బిల్లు చెల్లిం చడం మర్చిపోయాను."

సూటిగా చూశాడు శర్మ, "ఇలాటి పొరపాట్లే మిమ్మల్ని ముంచేస్తాయి. జాగ్రత్తగా మసలుకో! వెళ్ళి క్షమాపణ చెప్పుకో!"

"అలాగే, సర్" శ్యామల ఆశ్చర్యంగా చూస్తోంది నన్ను. నేను చెప్పింది అబద్ధమని ఆమెకి తెలుసు.

"సుందర్!" మళ్ళీ అన్నాడు శర్మ. "నీ ఇంటి దగ్గర కాపలా పెట్టిస్తాను. నువ్వు నిర్భయంగా వుండవచ్చు."

అదిరిపడ్డాను. "నో సర్! మేం ఇంటికెళ్ళం. అనిత... అనిత...శ్యామల ఫ్రెండ్ దగ్గరి కెళతాం! మేమక్కడ వున్నట్టు ఎవరూ తెలుసుకోలేరు."

"అలాగా! అయితే మంచిది!" శర్మ అనుమానపు చూపులు అలాగే వున్నాయి.

నేను శ్యామలతో గబగబ బయటికి వచ్చి బైక్ స్టార్ట్ చేశాను.

“ఏం జరిగిందసలు?” శ్యామల అడిగింది.

నేను మాట్లాడలేదు. ఇంటికెళ్ళేవరకు ఆమెకేమీ చెప్పకూడదు. గణేష్ నన్నెందుకు పిల్చాడో అంతు బట్టటం లేదు. పటిష్టమైన ప్లాను తయారు చేసుకుని వచ్చాడా? టాప్ సీక్రెట్. నేనతని ఆర్డర్స్ పాటించక పోతే నాకే ప్రమాదం! కాబట్టి బాడీగార్డ్స్‌ని మార్గం నుంచి తొలగించాలి. ఈ వ్యవహారంలో వాళ్ళ జోక్యం లేకుండా చేయాలి.

ఒక హోటల్ దగ్గర మోటార్ సైకిల్ ఆపి ఫోన్ చేశాను. అవతల రాబర్ట్ పలికాడు. “రాబర్ట్, గణేష్ కన్పించాడా?” అడిగాను ఆతృతగా.

“యస్, ఇప్పుడే వార్త అందింది. ఉస్మాన్ సాగర్ కెళ్ళాడట ఉదయం.”

ఉస్మాన్ సాగర్! అదిరిపడ్డాను. అక్కడికెందు కెళ్ళాడు? నాకు కన్పించలేదే?

“రాబర్ట్, అక్కడికెందుకెళ్ళాడట?” అడిగాను వెంటనే.

“తెలీదు. అక్కడనుంచి ఎప్పుడు, ఎక్కడికెళ్ళాడో ఇంకా తెలియదు. గాలిస్తున్నాం. సుందర్, ఏమిటి సంగతి?”

“ఏమీ లేదు. నా యింటిని చెక్ చేశారా?”

“అరగంట క్రితం. అక్కడెవరూ లేరు.”

థాంక్ గాడ్! గణేష్ ఇప్పుడు నా యింట్లో వున్నట్లు వాళ్ళకు తెలియదు. ఇక ముందు తెలుసుకో కుండా చేయాలి. నాకెదురయిన ఈ పరిస్థితిని నేనే

స్వయంగా ఎదుర్కోవాలి. "రాబర్ట్, అపాయం తొలగింది" అన్నాను.

"రాబర్ట్! ఇక గణేష్‌ని గాలించనవసరం లేదు. అతను క్షేమంగా వుంటే నేనూ క్షేమంగా వుంటాను. మీరు నా యింటిని కాపలాకాసే అవసరం లేదు. నేను తీసుకుంటున్న ఒక్కో నిర్ణయం అపాయంలో నన్ను ఒక్కో మెట్టు ఎక్కిస్తోంది. మీరు చాలా సహాయం చేశారు రాబర్ట్! థాంక్స్ మీ మనుషుల్ని రప్పించుకోండి."

ఒక్క క్షణం నిశ్శబ్దం తర్వాత రాబర్ట్ పలికాడు, "మీ ప్రవర్తన చిత్రంగా వుంది సుందర్! ఇప్పుడెక్కడ వున్నారు?"

"ఎవరికీ తెలియని చోట" అసహనంగా అన్నాను' "రాబర్ట్, ఇక గణేష్ని గాలించి టైం వేస్టు చేయకండి. అతని గురించి అనవసరంగా భయపడ్డాను. అపాయం తొలగింది. మీ మనుషుల్ని రప్పించుకోండి."

"మంచిది సుందర్."

ఫోను పెట్టేశాను. భయంకరమైన వంటరితనం ఆవహించుకుంది. ఈ పరిస్థితిని వంటరిగా ఎదుర్కోవాలి. ఎదుర్కోగలనా? గణేష్ 'చూపుడు వేలి టెక్నిక్. జ్ఞాపకం వచ్చి శరీరం జలదరించింది.

ఇల్లు దగ్గర పడింది. నేను వంటరిగా శత్రువుల చేతులోకి వెళుతున్నాను. నాకిప్పుడు బాస్ రక్షణ లేదు. పోలీస్ రక్షణ అసలు వుండదు.

ఇంటిగేటు బార్లా తెరిచి వుంది. లోపల నల్లటిప్లిమత్ కన్పించింది. శ్యామల చటుక్కున దిగి అరవబోయింది. నోరు మూశాను,

"శ్యాం, అరిచి గొడవ చేస్తే మనకే ప్రమాదం. భయ పడకు! లోనికెళ్ళి చూద్దాం."

"ఏం జరిగిందసలు?"

"నాకు తెలియదు. వెళ్ళి చూద్దాం పద!"

ఆమె నా చెయ్యి గట్టిగా పట్టుకుంది. ముఖం చెమటలు పట్టింది. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తోంది. ఏం చెప్పినా నేను వినే స్థితిలో లేను. ఆమె చెయ్యి పట్టుకుని బలవంతంగా ఇంటివేపుకు లాక్కెళ్ళాను.

ఆగివున్న నల్ల ప్లిమత్ కారులోంచి మౌత్ ఆర్గన్ మీద 'బాబీ' పాట వినిపిస్తోంది. నాకేమీ అర్థంగాలేదు. కారు దగ్గరికెళ్ళి చూశాను.

లోపల ముగ్గురు మనుషులున్నారు. ఒకడు డ్రైవింగ్ సీట్లో సిగరెట్ కాలుస్తూ కూచున్నాడు. మరొకడు వెనక సీట్లో ఎడమవేపు రివాల్వర్ క్లీన్ చేస్తూ కూచున్నాడు. మరొకడు అతని పక్కన మౌత్ ఆర్గన్ నోటిదగ్గర పెట్టుకుని తన్మయత్వంతో 'బాబీ' పాట వాయిస్తున్నాడు.

శ్యామల భయంకరంగా అరిచి ఇంట్లోకి పరిగెత్తింది.

ఆ అరుపుకి అందరూ తిరిగి చూచారు. "ఎవరు మీరు?" అరిచాను.

మౌత్ ఆర్గన్ వాయిస్తున్న మనిషి నన్ను చూసి నవ్వాడు. "మిస్టర్ సుందర్ మీరేనా? అయితే లోనికెళ్ళండి! నన్ను డిస్టర్బ్ చేయకండి!"

తిరిగి వాయించడం మొదలెట్టాడు. నా మతిపోయింది. గబగబ ఇంటికేసి నడిచాను.

చకచక మెట్లెక్కి వరండాలోకొచ్చాను. హాలు తలుపు తెరిచి వుంది. గబగబ నడిచాను.

హాల్లో శ్యామల సోఫా పక్కన బొమ్మలా చలనం లేకుండా నిలిచి వుంది.

సోఫాలో కులాసాగా వెనక్కివాలి, ఒక చేత్తో సిగరెట్ పట్టుకుని, రెండవ చేతిలో టెంపోరావ్ నవల చదువుతూ కూచుని వున్నాడు గణేష్.

# 4

గణేష్ నెమ్మదిగా పుస్తకంలోంచి తలెత్తి నన్ను చూశాడు. అతని పెదవులమీద చిరునవ్వు నిలిచింది.

"థాంక్యూ సుందర్! నువ్వొచ్చేశావు!"

నేను ధైర్యంగా లోనికి అడుగులేశాను. ఈ సమయంలో భయపడకూడదు. ఏమాత్రం భయపడినా గణేష్ నన్ను తక్కువ అంచనా వేసి ఆటపట్టిస్తాడు. అతని ఆటలు సాగనివ్వకూడదు.

అతని ఎదురుగా వెళ్ళి కూచుని, సిగరెట్ వెలిగించి' చెమట తుడుచుకున్నాను.

అతను నవ్వి, "చాలా భయపడినట్టున్నావు." అన్నాడు.

"లేదు, ఎండ బాగా కాస్తోంది" అన్నాను. నా ముఖంలో గాంభీర్యం చూసి కుదుటపడింది శ్యామల. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి.

గణేష్ సిగరెట్ హాల్లో ఓమూలకి విసిరి నవ్వాడు శ్యామల మింగేసేలా చూసింది. "సుందర్ చాలా పెద్ద వ్యవహారాల్లో తలదూర్చడం నీకు మంచిదికాదు" అన్నాడతను.

"మా బాస్‌తో తగవుకి తలబడటం నీకూ మంచిది కాదు" అన్నాను.

అతను ఆశ్చర్యంగా చూసి, 'తగువా? నీ బాస్‌తోనా? లేదు సుందర్, లేదు. ధర్మాత్ములతో నేను పేచీ పెట్టుకోను!'' అన్నాడు.

''అయితే ఇక్కడికి కెందుకొచ్చావ్?''

''మాకు సంబంధించిన వివరాలు నీ దగ్గర వున్నాయి. అడిగి తీసుకుందామని__''

''నా దగ్గర లేవు. బాస్ దగ్గర వున్నాయి. ఆయనకి చిక్కింది దక్కదని నీకు తెలుసు.''

''అవును. దక్కదు'' గణేష్ అన్నాడు. ''ఆయన శత్రువులకి దక్కదు! సుందర్, నువ్వతని శత్రువు కాదు! నీకు దక్కుతుంది...''

''నువ్వాగేదేమిటో నా కర్థంగావడంలేదు!''

''క్రమంగా అర్థమవుతుంది'' అతను మరో సిగరెట్ వెలిగించాడు.

నేను మాట్లాడలేదు. అతను చెప్పేది నాకేమాత్రం ముఖ్యం కానట్టు నిర్లక్ష్యంగా దిక్కులు చూస్తూ సిగరెట్ పీల్చసాగాను.

కాస్సేపయ్యాక గణేష్ సిగరెట్ పొగ రింగులుగా పైకి వదులుతూ అన్నాడు: ''నువ్వు ఓ స్త్రీపట్ల చాలా బాగా పడతావు సుందర్!''

అదిరిపడ్డాను. సిగరెట్ జారి పడింది. దానితో బాటు గుండెకూడ జారిపోయినట్టు ఫీలయ్యాను. వళ్ళు చల్లబడింది. ''ధరమ్‌దేవ్!'' అని గొణిగాను.

''జానేదేవ్!'' చమత్కరించాడు గణేష్. ''అతని గురించి నువ్వు భయపడకు సుందర్. నిన్నేమీ చేయడు. బ్రతికి వుంటే నిన్ను చంపేస్తాడని నాకు...సుందర్, నాకు తెలుసు!''

నేను కొయ్యబారిపోయాను. "గణేష్! ఏమిటి నువ్వంటున్నది?"

"అతన్ని చంపేశాను" తాపీగా అన్నాడు గణేష్. "నిన్ను రక్షించడానికే. చాలా సహాయం చేశానుకదూ?" నవ్వాడతను. "ప్రతిఫలంగా ఆ టేప్స్ వగైరా ఇస్తావా?"

శ్యామల ఛెంగున దూకి నా పక్కన కూచుంది.

"గణేష్! ఎందుకు చంపావు?" అర్చాను. "అతను నన్ను చంపితే నీకే లాభం కదా?"

"కాదు. నీకు ఆలోచించడం రాదు. మా రహస్యాలు మీ బాస్ చేతికి చిక్కాయి. ఇది బ్లాక్ మెయిలింగ్ గేమ్. మీ బాస్‌కి చిక్కిన వస్తువు ఎవరికీ దక్కదని నాకు తెలుసు. మా రహస్యాలు బట్టబయలుచేసే ఆధారాలు ఆయన దగ్గర వున్నాయి. వాటిని దక్కించుకోవాలంటే మార్గమేమిటి?" అడిగాడతను.

నేను జవాబివ్వలేదు. కళ్ళప్పగించి చూస్తున్నాను.

"బ్లాక్ మెయిల్ చేయాలి" అన్నాడతను. "సుందర్, నిజం చెప్పాలంటే మా స్మగ్లింగ్ రహస్యం బట్టబయలైనట్లు మా బాస్‌కి తెలియదు! తెలిస్తే నేను బఫూన్‌ని అవుతాను. కాబట్టి రహస్యంగా వుంచాను. ఆయనకి తెలియకుండా ఈ వ్యవహారాన్ని రూపుమాపాలనుకుని ప్లాను తయారు చేశాను.

"ధరమ్‌దేవ్ స్మగ్లర్ ఏమీకాడు. స్మగ్లర్లకి బ్రోకర్. అతనితో బిజినెస్ ఒప్పందం చేసుకున్నాక అతని అవసరం మాకుండదు. మా స్మగ్లింగ్ వివరాలు మీకు తెలిశాయి కాబట్టి అవి పత్రికలో వెల్లడయితే మేం పట్టుబడతాం.

"అందువల్ల నేను బాగా ఆలోచించి ప్లాను తయారు చేశాను. మీ బాస్‌ని బ్లాక్ మెయిల్ చేస్తే మా రహస్యాలు బట్టబయలుకావు. దేవ్‌కి పరిస్థితి వివరించి నిన్ను చంపడానికి వెళ్తున్నట్టు చెప్పాను. అతను వారించాడు. పిరికివాడు! పోలీసులకి చిక్కితే దేశంలో స్మగ్లర్స్ అందరి గుట్టు బయటపెట్టేస్తాను! నిన్ను చంపవద్దని వచ్చి జెప్పాడు. నేను వూరుకున్నాను.

"నీతో మాట్లాడి ఆ వివరాలు చిక్కించుకుంటానని బయలుదేరాడు. నేనతన్ని వెంబడించాను.

"అతను నిన్ను గాలించి చివరకు ఉస్మాన్ సాగర్‌లో కలుసుకున్నాడు. నేను మీరున్న చోటే పొదలమాటున నక్కాను. అతను ఫిల్మ్ కావాలని నిన్ను అడిగాడు. ఇవ్వడానికి నువ్వంగీకరించలేదు. మీరిద్దరూ కింద దొర్లి పోట్లాడుకున్నారు. నువ్వు కొట్టిన దెబ్బలకి అతను తెలివి తప్పాడు. నువ్వు భార్యతో పారిపోయావు!

"అయితే ఇక్కడ నీకో విషయం చెప్పాలి." రెండు క్షణాలు ఆగాడతను. "సుందర్, మీరు మాట్లాడుకుంటున్నప్పుడూ, పోట్లాడుకుంటున్నప్పుడూ నేను చకచక ఫోటోలు తీశాను. నువ్వు పారిపోయాక నేను రంగంలోకి దిగాను. నువ్వు చంపబోయిన బండతో దేవ్ తల పచ్చడి చేశాను..."

కెవ్వుమంది శ్యామల.

"గణేష్!!" అంటూ అరిచాను నేను.

పకపక నవ్వాడతను. "ఇది నిజం సుందర్! నా చేతులతో దేవ్‌ని చంపాను!" జేబులోంచి ఒకకవరు తీసి టీపాయ్ పైన విసిరాడు. "ఈ ఫోటోలు చూడు!"

ఛటుక్కున కవరందుకుని ఫోటోలు బయటికి తీశాను. నా బట్టలన్నీ చెమటతో తడిసిపోయాయ్. శ్యామల వేడి వూపిరి నా చెంపలకి తగులుతోంది.

వణుకుతున్న చేతులతో ఒకొక్క ఫోటో చూస్తున్నాను.

మొదటి ఫోటో:—నేనూ, శ్యామల ఇసుకలో కూచోని వుంటే దేవ్ నడిచి వస్తున్నాడు, వెనకనుంచి మా వేపుకు.

రెండవ ఫోటో:—నేనూ దేవ్ మాట్లాడుకుంటున్నాం. శ్యామల నా చెయ్యి పట్టుకుంది. ఆమె ముఖంలో భయం వుంది.

మూడవ ఫోటో:—నేనూ దేవ్ వాదించుకుంటున్నాం.

నాల్గవ ఫోటో:—దేవ్ నా కాలరు పట్టుకున్నాడు. నేనతని గడ్డంకింద చెయ్యి పెట్టాను.

అయిదవ ఫోటో:—ఇద్దరం కిందపడ్డాం. దేవ్ చేతిలో కత్తి వుంది.

ఆరవ ఫోటో:—దేవ్ ఇసుకలో బోర్లా పడివున్నాడు. నా రెండు చేతుల్లో పెద్ద బండ వుంది.

ఏడవ ఫోటో:—దేవ్ ఇసుకలో రక్తం మడుగులో పడివున్నాడు! అతని తల పచ్చడయింది! పక్కన బండ వుంది...

నేను ధైర్యం కూడదీసుకున్నాను. కవరు తిరిగి టీపాయ్‌పైన పెట్టి "నీ ప్లాను బాగుంది." అన్నాను. అతను గర్వంగా నవ్వాడు. "ఇక బిజినెస్ మాట్లాడుకుందాం."

నేనిప్పుడు ఎలాంటి చిక్కుల్లో ఇరుక్కున్నానో అర్థమైంది. K దేవ్ దగ్గర బ్లాక్ మెయిల్ ఫోటోలున్నాయి

అతని రహస్యాలు నా దగ్గర వున్నాయి. వాటిని తిరిగి అప్పగించకపోతే ఫోటోల్ని పోలీసులకి అప్పగిస్తాడు.

"సుందర్, ఇప్పుడు నీ బాస్‌కి చిక్కిందినాకు దక్కుతుంది కదా?" అడిగాడతను. "నువ్వీ ఫోటోలు తీసికెళ్ళి ఆయనకి చూపిస్తే మమ్మల్ని రెచ్చగొట్టే ప్రయత్నం మానుకుంటాడు కదూ?"

"మానుకోడు. మా బాస్ చాలా నిక్కచ్చి మనిషి" అన్నాను కచ్చితంగా. "మీ బాస్ మీద ఆయనకి చెప్పరాని కసి వుంది! మిమ్మల్ని రచ్చకీడ్చుతాడు!"

నవ్వాడతను. "మరి నువ్వు జైల్లో కూచుంటావు కదూ? నువ్వు జెయిలుకెళ్ళడం బాస్ ఒప్పుకోడనుకుంటాను?"

నేనూ నవ్వాను. "చూడు గణేష్, ఈ ఫోటోలు ఆయనకు చూపించను. నేనేమయిపోయినా ఫరవాలేదు కానీ, బాస్ శత్రువు నాశనమవ్వాలి!"

"పోనీ, నేనే చూపిస్తే? మీ బాస్‌కి నువ్వంటే చాలా ఇష్టం. నిన్ను జైలుకి పంపుతాడని నేననుకోను సుందర్! ఈరోజే ఆయనకి ఫోటో లందుతాయి. తిరుగు టపాలో మా రహస్యాలు లభిస్తాయి."

"ఐసీ!"

"సుందర్, ఈ బిజినెస్‌లో నా ఉద్దేశ్యం ఏమిటంటే మీరూ మేమూ క్షేమంగా వుండాలని. సేఠ్ జీవన్‌లాల్‌ని రచ్చకీడ్వడం ఎవరి ఆరోగ్యానికీ మంచిదికాదు. అలాగే ఈ గణేష్‌తో చెలగాటం ఎవరి ప్రాణాలకీ మంచిది కాదు!"

"ఐసీ!"

"నో, యూ డోంట్ సీ! ఈ ఫోటోలు మీ బాస్‌కి అందాక మాకు లొంగవద్దని ఆయనకి నువ్వు చెప్పా

వనుకో, పత్రికలో మా రహస్యాలు బయటపడ్డాయనుకో, అప్పుడు నువ్వు సర్వనాశన మవుతావు. సుందర్, నువ్వు మమ్మల్ని కాపాడితే క్షేమంగా వుంటావు. నీకు మంచి భవిష్యత్ వుంది. అర్థంలేని త్యాగాలు చేసి నాశనం చేసుకోకు. ఏమంటావు?"

నేను కాస్సేపు ఆలోచించాను. "గణేష్, మిమ్మల్ని కాపాడాలా, రచ్చకీడ్వాలా అన్నది నా చేతిలో లేదు. బాస్ చేతిలో వుంది. ఆయన నిర్ణయాలు తిరుగు లేనివి. మా బాస్ జీవన్ చేతిలో ఓటమి అంగీకరించడానికి సిద్ధపడడు! నా ప్రాణాలకంటే ఆయన పరువు ముఖ్యం. గణేష్ మీరూ నేనూ నాశనమవడం తప్పదు!"

"అలాగే సుందర్, ఇక బయలుదేరు. షూటింగ్ ఇంకా పూర్తికాలేదు...ఇంకా కొన్ని సీన్స్ షూట్ చేయాలి" అన్నాడతను.

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. "శవం ఎక్కడ వుంది?"

"కారు డిక్కీలో. పద, నువ్వు గొయ్యితవ్వి పెట్టాలి నీ క్షేమం కోసం..."

శ్యామల గట్టిగా అరిచి నా చేతులు పట్టుకుంది.

"గణేష్, నేను రాను — నువ్వే పాతిపెట్టు!" అన్నాను.

"లేదు సుందర్, ఇంకా కొన్ని సీన్స్ షూట్ చేయాలి. కమాన్!" లేచాడతను.

నేనలాగే కూచున్నాను. శరీరం చమటపట్టింది. "నేను రాను!" మళ్ళీ అర్చాను.

అతను తీక్షణంగా రెండు క్షణాలు చూశాడు. ఆ తర్వాత తిరిగి సోఫాలో కూచున్నాడు. జేబులో చెయ్యి పెట్టి ఒక సీసా తీసి టీపాయ్ పైన పెట్టాడు.

చిన్నగా నవ్వి, "దీన్ని కాన్ సెన్ట్రేటెడ్ సల్ఫ్యూరిక్ ఆసిడ్ అంటారు. ఆడవాళ్ళ ముఖాలమీద విలన్లు దాన్ని జల్లడం పుస్తకాల్లో చదివాను..." అని మళ్ళీ నవ్వాడు.

గాభరాగా చూస్తున్నాను.

"సుందర్, నాతో రాకపోతే ఈ ఆసిడ్‌ని నీ భార్య అందమైన ముఖంమీద జల్లేస్తాను...కమాన్, నన్ను రెచ్చగొట్టకు!"

నేను వణుకుతూ లేచి నిలబడ్డాను. శ్యామల నా చెయ్యి పట్టుకుని లాగింది, "మీరు వెళ్ళకండి! ఏం చేస్తాడో చూద్దాం!"

గణేష్ శ్యామలవేపు తిరిగాడు. "ఏం చేస్తానో చెప్పాను. మీ అందమైన రూపం క్షణాల్లో మాంసపు ముద్దగా మారిపోతుంది. హి...హి...ఆ తర్వాత మీ బ్రతుకు వూహించుకోండి!"

"మీరు వెళ్ళకండి!" శ్యామల అర్చింది. "ఎలాగూ మీరు నాశనమవుతారు, నేనూ అవుతాను! అంతే!"

ఆమె నిర్ణయానికి నేను గాభరాపడి చూశాను. ఎలాగూ నేను నాశనం అవుతాను. నావల్ల ఆమె ఎందుకు నాశనమవ్వాలి? ఈ కష్టాలన్నీ తెచ్చిపెట్టుకుంది నేను కదా?

"శ్యాం, ఇందులో నువ్వు జోక్యం చేసుకోక!" జాలిగా చూస్తూ అన్నాను. "శ్యాం, పరిస్థితి ఇంకా విష మించలేదు. బయటపడే మార్గాలున్నాయి. దయచేసి నన్ను వెళ్ళనివ్వు! తిరిగి వచ్చాక ఏం చేయాలో ఆలో చిద్దాం—"

"వాడు—వాడు దుర్మార్గుడు! మిమ్మల్ని—"

మాటలా పేసిందామె. గణేష్ క్రూరంగా చూస్తున్నాడు. "చూడండి సిస్టర్! మీరు నన్నలా పిలిస్తే నాలోని రాక్షసుడు మేల్కొంటాడు!"

శ్యామల ఒక అడుగు వెనక్కి వేసి నోరు తెరిచి వెళ్లేసింది.

## 5

కారు వేగంగా దూసుకుపోతోంది.

డ్రైవ్ చేస్తున్న మనిషి పేరు ఆనంద్ అని చెప్పాడు గణేష్. మౌతార్గన్ వాయిస్తున్న మనిషి పీటర్ అనీ, మరొక మనిషి జాఫర్ అని చెప్పాడు.

పీటర్ మౌతార్గన్ మీద హెచ్చుస్థాయిలో 'బాబీ' పాట వాయిస్తున్నాడు. గణేష్ రెచ్చిపోయి, "బాస్టర్డ్! మరోపాట వాయించడం రాదా? 'షోలే' పాటందుకో!" అరిచాడు.

పీటర్ గబుక్కున ఆపేసి 'షోలే' పాటందుకున్నాడు.

నేనూ, గణేష్, జాఫర్ వెనకసీట్లో కూచున్నాం. ఆనంద్, పీటర్ ముందుసీట్లో కూచున్నారు.

నేను సిగరెట్ తాగుతూ కళ్ళు మూసుకుని ఆలోచిస్తున్నాను.

ఎంత ఆలోచించినా నాకు బయటపడే మార్గాలు కన్పించడం లేదు. నాకు సంబంధించిన ప్రమాదకరమైన ఫోటోలు గణేష్ దగ్గర వున్నాయి. అవి పోలీసుల చేతిలో పడితే ఉరిశిక్ష తప్పదు! నేను నిర్దోషి అని నిరూపించుకునేందుకు ఆధారాలు లేవు.

ఫోటోలు వాళ్ళ చేతిలో కెందుకెళ్ళాలి? వెళ్ళకుండా చేయకూడదా?

ఈ ఆలోచనకి నేను నవ్వుకున్నాను. X రేస్ దగ్గర వాటిని లాక్కోడమంటే మామూలు విషయంకాదు. అలాంటి ప్రయత్నం చేశానంటే అతని టెక్నిక్‌కి గురవు తాను! చావు తప్పదు!

నెమ్మదిగా తలతిప్పి X రేస్ చూపుడువేలిని చూశాను. లావుగా, పొట్టిగా, ఇనపముక్కలా వుంది...ఒక ఆలో చన తట్టింది. వెంటనే ఆ ఆలోచన దూరం చేసుకున్నాను. అతని వేలును కోసేయడమంటే మామూలు విషయం కాదు!

తిరిగి ఆలోచించడం ప్రారంభించాను...

X రేస్ పథకంలో వీక్‌పాయింట్ కనిపెట్టాలి!

ఏమిటా వీక్‌పాయింట్?

అతను ఫోటో లెక్కడ దాస్తాడో నాకు తెలియదు. అడిగినా చెప్పడు. పత్రికలో వాళ్ళ రహస్యాలు రానంత వరకు ఆ ఫోటోలు క్షేమంగా వుంటాయన్నది నిర్వివా దాంశం. పత్రిక వెలువడడానికి అయిదురోజుల సమయం వుంది. కానీ ప్రెస్‌కి వెళ్ళేందుకు రెండు రోజులే వున్నాయి. ఈ రెండు రోజుల్ని నేను ఉపయోగించుకో వాలి.

ఈ బ్లాక్ మెయిల్ గురించి బాస్‌కి తెలియకూడదు. అందుకు X రేస్ ఫోటోల్ని బాస్‌కి అందివ్వకుండా చేయాలి. అంటే నేనే చూపించి బాస్ దగ్గర వాళ్ళ వివ రాలు తెస్తానని బుకాయించాలి.

ఆ తర్వాత ఏం చేయాలి? X రేస్ పథకంలో వీక్ పాయింట్ వినియోగించుకోవాలి. కానీ ఎంత ఆలోచిం చినా ఆ వీక్‌పాయింట్ ఏమిటో తట్టడంలేదు!

కారు విజయవాడ రోడ్డుమీద పరుగుతోంది. నేనలాగే ఆలోచిస్తూ పరిసరాల్ని గమనిస్తున్నాను. కొంతసేపటికి కారు పడమటివేపుకి మట్టిరోడ్డుమీద తిరిగింది. పది నిమిషాల ప్రయాణం తర్వాత పూర్తిగా నిర్జనంగా వున్న ప్రదేశం చేరుకుంది.

చకచక అందరూ దిగారు. నేనూ దిగాను. పీటర్ డిక్కీ తెరిచి పారా, పలుగూ తీశాడు. గణేష్ నన్ను నవ్వుతూ చూశాడు. "సుందర్, గొయ్యి తవ్వాలి. ఆరడుగుల పొడవు - రెండడుగుల లోతు. కమాన్, క్విక్!"

నేను గాభరాగా పారా పలుగూ అందుకున్నాను. పీటర్ విషాదగీతం వాయిస్తున్నాడు. గణేష్ అతని భుజం తట్టి "గుడ్, పీటర్! ఇప్పుడు నీ బుర్ర సరిగా పని చేస్తోంది!" అన్నాడు.

నేను తవ్వడం ప్రారంభించాను. సమయం నాలుగున్నరయింది. ఎండ తీవ్రత ఇంకా తగ్గలేదు. ఆనంద్, పీటర్, జాఫర్ కారు బానెట్ ఎక్కి కూచున్నారు. గణేష్ దూరంగా ప్రత్యేకంగా నిలబడ్డాడు.

పది నిమిషాలు తవ్వి అలసిపోయాను. గణేష్ నా దగ్గరికి వచ్చాడు. "లాభంలేదు సుందర్! నువ్విలా తవ్వితే తెల్లారుతుంది!"

నేనొక నిర్ణయానికి వచ్చాను. అతన్ని సూటిగా చూశాను. "నేనిక తవ్వలేను గణేష్! మీరే తవ్వుకోండి!" అన్నాను.

అతను పకపక నవ్వాడు. "సుందర్! ఒక్కసారి నీ భార్య రూపం తలచుకో! అందమైనది కదూ? బ్యూటిఫుల్! నా చెల్లెళ్ళంతా అందమైన వాళ్ళు!"

"పిచ్చివాడా! చెల్లెల్ని నాశనం చేస్తావా?"

"లవ్ ఈజ్ లవ్! బిజినెస్ ఈజ్ బిజినెస్. కమాన్, భార్యరూపం తలచుకుంటూ గబగబ తవ్వేయ్! జాఫర్ చకచక ఫోటోలు తీస్తాడు. కమాన్ జాఫర్!"

జాఫర్ కెమేరా పట్టుకుని ఈల వేసుకుంటూ వచ్చాడు.

నేను గణేష్ని తిట్టుకుంటూ గబగబా తవ్వసాగాను.

సరిగ్గా ఆరుగంటలకి ఆతను చెప్పిన కొలతల ప్రకారం గొయ్యి తియ్యడం పూర్తయింది.

గణేష్, జాఫర్లు మా దగ్గరికి వచ్చారు. "సుందర్' పద, శవాన్ని నువ్వు మోసుకురావాలి."

నాకు ముచ్చెమటలు పట్టాయి.

పీటర్ డిక్కీ తెరిచి పిల్చాడు. జాఫర్ కెమేరా సిద్ధం చేసుకున్నాడు. చలికాలం కావడం వలన త్వరగా చీకటి పడుతోంది.

గణేష్ నాకు సైగ చేశాడు. నేను సందేహించకుండా కారువేపుకి నడిచాను. భయాన్ని బలవంతంగా దూరం చేసుకుని డిక్కీలోకి చూశాను.

దేవ్ శరీరం అచేతనంగా పడివుంది. ముఖం కన్పించడం లేదు రక్తంలో. గణేష్ రాక్షసత్వానికి రెచ్చిపోయి శవాన్ని ఎత్తి గుండెలకి హత్తుకున్నాగట్టిగా-ఏడ్చేయా లన్పించింది.

కెమేరా క్లిక్ మంది. ఫ్లాష్బల్బ తళుక్కుమంది-ఒక్క క్షణం కళ్ళు చెదిరే మెరుపు.

అంతే! గణేష్ జాఫర్ మెడమీద చాచి కొట్టాడు.

"బద్మాష్! ఆ ఫోటోలో మన కారు నెంబర్తో సహా పడింది! నాశనం చేయ్!"

నేను కొయ్యబారిపోయాను. కారు నెంబర్తోసహా

పడింది! ఆ ఒక్క ఫోటో చాలు నేను నిర్దోషినని నిరూపించుకోడానికి!

"సుందర్, ఎక్కడా పొరపాటు జరగదు! డిటెక్టివ్ వాలి తెలివి తేటలు నాకున్నాయి."

గణేష్ మాటలకి ఉలిక్కిపడ్డాను. ఎంత చక్కటి అవకాశం చేజారిపోయింది! ఇక అతని పథకంలో వీక్ పాయింట్ కనిపెట్టలేను! అతని తెలివితేటల్ని ఇప్పుడే అంచనా వేయగల్గుతున్నాను.

శవాన్ని ఎత్తుకుని గొయ్యి దగ్గరికి నడిచాను. జాఫర్ ముందునుంచీ వెనుక ఫోటోలు తీశాడు. ఆ తర్వాత మట్టి కప్పుతున్నప్పుడుకూడా ఫోటోలు తీశాడు. ఎన్ని స్నాప్స్ తీశాడో గుర్తుపెట్టుకున్నాను: ఆరు.

ఉదయం తీసినవి ఏడు, ఇప్పటివి ఆరు. మొత్తం పదమూడు స్నాప్స్.

దేవ్ శవాన్ని ఖననం చేశాం.

ఇప్పుడు పూర్తిగా చీకటి పడింది. సమయం ఏడు కావస్తోంది. కారెక్కి తిరుగు ప్రయాణం చేస్తుండగా నేను తీవ్రంగా ఆలోచించసాగాను.

కొంత తెలిసీ, కొంత తెలియకుండా నేను గణేష్ వలలో చిక్కుకున్నాను. ఏదేమైనా బాస్ నన్ను క్షమించడు. వివరాలు సేకరిస్తుండగా ఆ విషయం పొక్కడం ఆయన దృష్టిలో క్షమించరాని నేరం.

పైగా ఇది జీవన్‌లాల్‌కి సంబంధించిన వ్యవహారం. ఆయన పగతీర్చుకోడానికి ఇంతకంటే మంచి అవకాశం దొరకదు! నేను బ్లాక్ మెయిలింగ్‌లో ఇరుక్కున్నానని ఆయనకి చెప్పినా ఏమాత్రం కనికరించదు! ఆ వివరాలు పత్రికలో రాక తప్పదు!

కాబట్టి, నన్ను నేను తప్ప ఇంకెవరూ రక్షించలేరు! గణేష్ దగ్గరవున్న ఆ ఫోటోలు చిక్కించుకుంటే ప్రమాదం తప్పినట్టే. లేకపోతే ఉరిశిక్ష తప్పదు!

నన్ను చావునుంచి తప్పించడానికి బాస్ జీవన్ కి లొంగిపోయి నవ్వులపాలవ్వడు! నా దృష్టిలో నా ప్రాణాల కంటే ఆయనకి పరువు ముఖ్యం!

"ఏమిటి ఆలోచిస్తున్నావు, సుందర్?" గణేష్ అడిగాడు.

నేను తేరుకుని చూశాను. "గణేష్, ఆ ఫోటోల్ని నేనే బాస్ కి చూపిస్తాను" అన్నాను.

"చూపించడమే కాదు, ఒప్పించాలి. అర్థమైందా?" తలూపాను.

"వెరీగుడ్! రేపుదయం నీకు ఫోటో అందుతాయి. నువ్వు బాస్ కి చూపించి పరిస్థితి వివరించు. నీ ప్రాణాల కంటే ఆయనకేదీ ఎక్కువ కాదనుకుంటాను. మా బాస్ ని రచ్చకీడ్చి నిన్ను ఉరికంబం ఎక్కించడం ఏ ధర్మాత్ముడికీ ఉచితంకాదు. నచ్చజెప్పు! ఏమంటావ్?"

"అలాగే. నెగెటివ్ ఎక్కడ దాస్తావు?"

అతనదోలా చూశాడు. "మా రహస్యాలు మీరెక్కడ దాచారో నేనడిగానా?"

అతన్నడిగి ప్రయోజనం వుండదని నాకు తెలుసు. నేను మాటాడలేదు. ఎందుకో ఉలిక్కిపడ్డాను.

గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. కళ్ళు చీకట్లు కమ్మాయి. ఎందుకు ఉలిక్కిపడ్డానో కొన్ని క్షణాల తర్వాత అర్థమైంది.

గణేష్ పథకంలో వీక్ పాయింట్ కనిపెట్టేశాను!

# 6

శ్యామల గాభరాగా పరిగెత్తుకు వచ్చి నన్ను గట్టిగా కౌగిలించుకుంది. ఆమె వేడి ఊపిరి నా గుండెలకి తాకి గుబులు పెడుతోంది. ఆమె చేతివేళ్ళు విపరీతంగా వణుకుతూ నా జుత్తులోకి చొచ్చుకపోతున్నాయి.

"శ్యాం! ఏం జరిగింది? ఎవరైనా వచ్చారా?"

"లేదు!"

"ఫోన్ చేశారా?"

"ఊహుఁ! మిమ్మల్నేం చేశారు?"

నేను గట్టిగా నవ్వాను. "ఏమీ లేదు శ్యాం! సినిమా హీరోలా షూటింగ్ లో పాల్గొని వచ్చాను!"

ఆమె దూరంగా జరిగిందొక్కసారిగా. బాగా ఏడ్చిందనుకుంటాను, కళ్ళు ఎర్రబడ్డాయి; చెంపలమీద కన్నీటి మరకలు ఏర్పడ్డాయి. నన్ను అనుమానంగా చూస్తూ, వేగంగా ఊపిరి వదులుతూ చేతులు నలుపుకుంటూ నిలబడింది.

"శ్యాం, గణేష్‌గాడుత్త ఫూల్! వాడ్ని బోల్తాకొట్టిస్తాను—"

"ఏం జరిగిందసలు! వాడ్ని ఏం చేస్తారు?"

"నువ్వనవసరంగా భయపడకు! అంతా సవ్యంగా జరుగుతుంది. వాడు ప్రయోగించిన విషానికి విరుగుడు కనిపెట్టాను. శ్యాం, ఆకలవుతోంది...ఉదయంనుంచీ ఏమీ తినలేదు. తెలుసా?"

ఆమె ఉలిక్కిపడి "వంట చేయలేదు—"

"ఫరవాలేదు, ఇప్పుడు చేయ్" అన్నాను. "నేను స్నానం చేస్తాను. నువ్వూ చేయి. ఆ తర్వాత ఫ్రెష్గా కూర్చొని మాట్లాడుకుందాం."

ఆమె కదల్లేదు. "ఏమిటా విరుగుడు?" అంది.

"శ్యాం, స్మగ్లింగ్ రహస్యాలు బట్టబయలైనట్టు జీవన్‌కి తెలియదు. అదే వీక్ పాయింట్ ..."

ఆమె ఆలోచించలేదు. "ఎలా ఉపయోగించు కుంటారు?" ఆసహనంగా అడిగింది.

"ఇంకా ఆలోచించలేదు" అన్నాను. "నేనిప్పుడు ఆలోచించలేను శ్యాం. ముందు స్నానం చేయాలి, ఆకలి తీర్చుకోవాలి. పద!"

ఆమె మాట్లాడకుండా వెళ్ళిపోయింది. నేను సిగరెట్ వెల్గించి టైం చూసుకున్నాను. 7-50.

స్నానానికి బయలుదేరాను. స్నానం చేస్తున్నప్పుడు నా ప్లాను గురించి ఆలోచించాను. ఆ వీక్ పాయింట్ గురించి తీవ్రంగా ఆలోచించి దానిమీద ఆధారపడి రంగంలోకి దిగవచ్చని నిర్ణయించుకున్నాను.

స్మగ్లింగ్ రహస్యాలు బట్టబయలైనట్టు జీవన్‌కి తెలియకపోవడం గణేష్ పథకంలోని వీక్ పాయింట్!

ఇది గణేష్కు తెలియదు! కాబట్టి ఈ వ్యవహారం గురించి బాస్‌కి తెలియదని నాకు చెప్పేశాడు.

స్నానం ముగించి, భోజనం చేశాను.

నా ప్లానుకో రూపం ఏర్పడుతోంది. కానీ నేను నెగెటివ్స్ తిస్కరించేందుకు పూనుకున్నట్టు గణేష్ టేప్స్ వగైరా కాజెయ్యడానికి పూనుకుంటే?

అది చాలా ప్రమాదకరం! ఆఫీసు సేఫ్‌లోంచి వాటిని తొలగించాలి! నెగెటివ్స్, టేప్స్, రిపోర్ట్స్ సీలుచేసిన కవర్లో పైన 'జీవన్‌లాల్ స్మగ్లింగ్ కేస్' అన్న లేబిల్ అంటించి వుంది...

వెంటనే ఇంట్లోకి వెళ్ళి ఫోన్ చేశాను ఆఫీసుకి. శర్మ పలికాడు.

"గుడీవినింగ్ సర్. బాస్‌కి ట్రంకాల్ చేశారా? ఏమన్నారు?" అడిగాను.

"సుందర్! నీ తెలివితక్కువ పనికి ఆయన తిట్టారు! వెంటనే బయలుదేరి వచ్చేస్తానన్నారు..."

నా గుండెలదిరాయి. ఈ రాత్రికే బాస్ వచ్చేస్తాడు! నేను బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కుంటానని తెలిస్తే ఈ వ్యవహారం గురించి శర్మకి చెప్పేవాడ్ని కాను! అతను బాస్‌కి ట్రంకాల్ చేసేవాడూ కాడు! ఎవరికీ తెలియకుండా, రహస్యంగా ఈ వ్యవహారాన్ని చక్కబరచేవాడ్ని!

"సర్, జీవన్ రిపోర్ట్స్ ఎక్కడ వున్నాయి?" ప్రశాంతంగా అడిగాను.

"ఇక్కడే సేఫ్‌లో. ఎందుకు?"

"అక్కడనుంచి తొలగించండి! X కేస్ వాటి కోసం ప్రయత్నిస్తున్నాడని తెలిసీ సేఫ్‌లోనే వుంచితే ఆయన రెచ్చిపోతారు! తీసేయండి!"

"ఎక్కడ దాచాలి?"

"మీ యిష్టం."

"సుందర్, X కేస్ నిన్ను కలుసుకున్నాడా?"

నా వొళ్ళు చల్లబడింది. "లేదు! ఎందుకు?" అర్చాను. శర్మ నవ్వాడు. నేను చెవులు మూసుకున్నాను.

"ఏమీ లేదు, సుందర్. అతని గురించి నువ్వేమీ భయపడకు! అతను నిన్ను కలిస్తే బాస్‌తో మాట్లాడమని చెప్పు! సరే, రెండవ మనిషి ధరమ్‌దేవ్ ఎక్కడ వున్నాడు? కన్పించాడా?"

నా కళ్ళు చీకట్లు కమ్మాయి. బ్లాక్ మెయిల్ గురించి అతనికి తెలుసా?

"కన్పించలేదు! బొంబాయి వెళ్ళాడట! సర్, రాబర్ట్ ఎక్కడ వున్నాడు?"

"తెలియదు. నేను పనేమీ అప్పగించలేదు."

తేలికపడ్డాను. శర్మ ఎంతవరకు బుకాయిస్తున్నాడో నాకు తెలియదు. నేనూ బుకాయిస్తున్నాను. ఇద్దరం ఒక ర్నొకరు మోసం చేసుకుంటున్నాం.

"సుందర్, రెస్టారెంట్ మేనేజర్ మళ్ళీ ఫోన్ చేశాడు. నువ్వక్కడికి వెళ్ళలేదట?"

అత్యంత శక్తివంతమైన బాంబు నా గుండెలో పేలింది.

"అవును సర్, వెళ్ళలేదు! ఇందాకే ఫోన్ చేసి క్షమాపణ చెప్పాకున్నాను..." సమయానుకూలంగా నేనబద్ధాలెలా చెప్పాతున్నానో అర్థంగావడంలేదు!

"మంచిది సుందర్. నువ్వు చెప్పినట్టు చేస్తాను. ఆ కవర్ తొలగిస్తాను."

లైను కట్ అయింది.

చాలాసేపు చలనం లేకుండా వుండిపోయాను. శర్మకి నా మీద అనుమానం వచ్చింది! నా పైన నిఘా వుంచాడా? అయితే అది ప్రమాదకరం! నా పథకానికి అవరోధం!

వెంటనే రాబర్ట్‌కి ఫోన్ చేశాను. అతను పలికాడు.
"ఏమిటి సుందర్?"

"మీ మనుషులెక్కడ వున్నారు?"

"తెలియదు. ఎవరూ డ్యూటీలో లేరు. నేనిప్పుడు ఏర్‌పోర్ట్ కెళుతున్నాను, బాస్‌ని రిసీవ్ చేసుకోడానికి; శర్మతో కలిసి!"

"మీ మనుషులు డ్యూటీలో లేరా?"

"లేదు. బాస్‌తో మీ విషయం మాట్లాడాక ఆయన చెప్పినట్టు చేస్తాం."

"థాంక్స్ రాబర్ట్, గుడ్ నైట్." రిసీవర్ పెట్టేసి డాబామీదికి వురికాను. కనుచూపు మేరలో, వీధి దీపాల వెలుగులో అనుమానాస్పదంగా తచ్చాడుతూ ఎవరూ కన్పించలేదు.

అక్కడే పిట్టగోడమీద కూచుని ఆలోచించడం ప్రారంభించాను. సమయం 10-20 అయింది.

ఈ రాత్రి నేను ఏదో ఒకటి చేయకపోతే, తెల్లారితే పరిస్థితి మారవచ్చు; విషమించవచ్చు. ఒక గంటసేపు ఆలోచించి నా ఆలోచనలకు తుదిరూపం ఇచ్చాను.

గబగబా పక్కగదిలోకి నడిచాను.

అలమెరా తెరిచి ఏర్‌బ్యాగు తీశాను. టేప్‌రికార్డర్, కాసెట్స్, మైక్రోఫోన్, ఎలక్ట్రిక్ తీగ చుట్టి, స్క్రూ డ్రైవర్స్ తీసి బ్యాగులో వేశాను. ఆ తర్వాత డ్రాయింగ్ రూంలోకెళ్ళి మేజా సొరుగులోంచి హాండ్ గ్లౌస్, పెన్ సెల్ లైట్, కటింగ్ ప్లేర్ తీశాను. ఆ తర్వాత క్రింది సొరుగులోంచి కత్తి తీశాను.

ఆ కత్తిని ఒకసారి పరీక్షించాను. వేటకత్తి. తొమ్మిది అంగుళాల పొడవు, దృఢమైన పిడి, పదునైన అంచులు.

గణేష్ ఒకవేళ ఘర్షణ పడితే ఈ కత్తి పెట్టి అతని వేలు కోసేయడమే గాక కడుపులో పొడిచేయాలని కూడ నిశ్చయించుకున్నాను.

సరంజామా అంతా పోగుచేసుకుని కాన్వాస్ బూట్లు ధరించి హాల్లోకి వచ్చాను. నా ప్లానులో మొదటిమెట్టు జీవన్‌కి ఫోన్ చేయడం.

కానీ వెంటనే ఆ ప్రయత్నం మానుకున్నాను. ఇక్కడినుంచి కాదు! నా టెలిఫోన్‌ని బాస్ మనుషులు టాప్ చేయవచ్చు.

శ్యామల వున్న గది తలుపుపైన చప్పుడు చేశాను. "శ్యాం, వెళుతున్నాను తలుపులేసుకో!"

రెండు క్షణాల తర్వాత తలుపు తెరుచుకుంది. "నా కెంతో భయంగా వుంది!" అందామె.

"ప్లీజ్, అలా మాట్లాడకు!" ఆమె భుజాలమీద చేతులు వేశాను. "శ్యాం, సక్సెస్ అవుతుంది. మరో మూడు గంటల తర్వాత మనం స్వేచ్ఛావాయువు పీలుస్తాం!" అంటూ ఆమె చెంపమీద చేతులు వేశాను.

## 7

శాంతి థియేటర్ పక్కన ఇరానీ కేఫ్ ముందు మోటార్ సైకిల్ ఆపి దిగాను. నన్నెవరూ వెంటాడలేదని కచ్చితంగా తెలుసు. చకచక లోనికి నడిచాను. ఈ హోటళ్ళకి రాత్రీ పగలు అనేది లేదు. ఇరవై నాలు గంటలూ అలా తెరిచే వుంటాయి. జనం కిటకిటలాడుతూనే వుంటారు.

కౌంటర్ దగ్గర కెళ్ళి ఫోన్ ఉపయోగించేందుకు అనుమతి తీసుకున్నాను. జీవన్ నెంబర్ డయల్ చేసి రిసీవర్ చెవిదగ్గర పెట్టుకున్నాను. కొన్ని క్షణాల తర్వాత అవతలి గొంతు పలికింది. "యస్? మీ రెవరు?" ఆ గొంతు ఎవరిదో నాకు తెలుసు_జీవన్ కూతురు రీనాది.

"మిస్ రీనా, డాడీ వున్నారా?" అడిగాను.

అవతల నిట్టూర్పు. "లేదు. క్లబ్‌కి వెళ్ళి రాలేదు."

"ఎప్పుడు వస్తారు?"

"ఆయనకే తెలియదు."

"ఇంట్లో ఎవరూ లేరా?"

"లేరు."

"రాత్రిపూట ఇంట్లో ఎవరూ లేరని పరాయి మగాడితో చెప్పడం మీకు మంచిది కాదు."

వెంటనే సమాధానం వచ్చింది. "ఈ రోజుల్లో అమ్మాయిల్ని అంత తక్కువ అంచనా వేయడం మీకూ మంచిది కాదు. ఎవరు మీరు?"

"మీ డాడీ శ్రేయోభిలాషిని." ఫోన్ పెట్టేశాను. నేను వూహించినట్టే జరిగింది. జీవన్ ఇంట్లో లేడు!

వెంటనే బయటికి వచ్చి బైక్ స్టార్ట్ చేసి దూసుకపోయాను. నన్నెవరూ వెంటాడ్డంలేదు. ఒకవేళ నాకు తెలియకుండా వెంటాడినా తప్పు మార్గం పట్టించేందుకు పిచ్చిగా రోడ్లన్నీ తిరుగుతూ చివరికి హఠాత్తుగా ఓ సందులోకి దూసుకెళ్ళి గమ్యస్థానం చేరుకున్నాను.

జీవన్‌లాల్ రెండంతస్తుల బంగళాలో అక్కడక్కడ దీపాలు వెలుగుతున్నాయి. గేటుముందు గూర్ఖా పచార్లు చేస్తున్నాడు.

బంగళాకి వెనక, కుడిపక్కల రెండు బంగళాలున్నాయి. ముందుభాగం, ఎడమ పక్కల రోడ్డు వుంది. ముందుభాగం మెయిన్‌రోడ్. ఎడమపక్క సన్న వీధి. అక్కడక్కడ లైట్లు వెలుగుతున్నాయి.

ఈ వీధిలోకి జీవన్ మనుషులు వచ్చే అవకాశంలేదు. అసలు జనసంచారం వుండదు.

ఒకచోట బైక్ ఆపి దిగాను. ప్రహారీగోడ ఆరడుగుల ఎత్తువుంది. గోడమీద ఇనపకడ్డీలు దించి మూడు వరసలు తీగలు బిగించి వున్నాయి. కటింగ్ ప్లేర్‌తో కింది తీగ తెంపేశాను. ఆ తర్వాత బ్యాగ్ అందుకుని గోడెక్కి

రెండవ తీగ క త్తిరించి లోనికి దూకాను. కొన్ని క్షణాలు ఆయాసం తీర్చుకుని వేగంగా బంగళా వేపుకి పురికాను.

కాన్వాస్ బూట్లతో పిల్లిలా గెంతుతూ బంగళా ముందు భాగంలో కొచ్చాను.

వరండా చీకటిగా వుంది. హాలు తలుపు వేసి వుంది. గబగబ తలుపు చేరుకున్నాను. నెట్టిచూస్తే తెరుచుకో లేదు. ఏం చేయాలో తోచలేదు.

వరండా మెట్ల నానుకుని ఇరువేపులా రెండు చెట్లు న్నాయి. వాటి కొమ్మలు రెండవ అంతస్తును చేరు కున్నాయి. ఆలోచించాను. చెట్టెక్కితేగానీ లాభం లేదు. గబగబ చెట్టెక్కి కొమ్మలు పట్టుకుని పైకి ప్రాకాను. రెండవ అంతస్తు కిటికీ అద్దం చేరుకున్నాక ఆయాసం తీర్చుకున్నాను.

ఆ తర్వాత తలుపు నెట్టాను. తెరుచుకుంది. ఒక క్షణం సందేహించి చీకటిగా వున్న గదిలోకి దూకాను. బ్యాగులోంచి టార్చితీసి వెలిగించి గది కలియజూశాను. సోఫాసెట్, ఫోంబెడ్, సీలింగ్ ఫాన్, టెలిఫోన్, డ్రెసింగ్ టేబిల్, ఐరన్ సేఫ్ కన్పించాయి.

గదిని జాగ్రత్తగా పరిశీలించి చివరకి అది జీవన్ గది అని తెలుసుకున్నాను. ఇక బ్యాగు తెరిచి నా పని ప్రారంభించాను. ఏ క్షణాన్నయినా జీవన్ రావచ్చు.

మైక్రోఫోన్ కి వైరు బిగించి బెడ్ కింద పెట్టాను. అక్కడ వున్నట్టు ఎవరూ తెలుసుకోలేరు. వైరు రెండవ చివర కిటికీలోంచి బయటికి తెచ్చాను. రెండవ చివర టేప్ రికార్డర్ కి కనెక్షన్ ఇచ్చి సౌండ్ టెస్ట్ చేశాను. సరిగానే వుంది.

బయట కిటికీ షేడ్ మీద టేప్ రికార్డర్ వుంచి తలుపు మూశాను. మిగతా సరంజామా బ్యాగులో వేసుకుని భుజానికి తగిలించాను. అప్పటికి అర్ధరాత్రి దాటి ఇరవై నిమిషాలైంది. ఇక బయటికెళ్ళి జీవన్ కోసం ఎదురు చూడాలి.

నిదానంగా సిగరెట్ వెలిగించి అయిదు నిమిషాలు విశ్రాంతి తీసుకున్నాను. తర్వాత కొమ్మ ఎక్కాను. చలి తీవ్రంగా వుంది. జాగ్రత్తగా పాకుతూ ముందుకెళ్లాను. కొమ్మ పైకీ కిందికీ వూగుతోంది.

ఇప్పటికీ ఇందులో విజయం సాధించగలనని నాకు నమ్మకముంది. ఒక చిన్న నాటకమాడి జీవన్ని చిక్కులో పడేసి ఆ నెగెటివ్స్ కాజేయాలి. వచ్చిన దారినే బయట పడ్డాను.

# 8

అబిడ్స్ దగ్గర ఒక హోటల్ ముందు బైక్ దిగి లోనికి నడిచాను.

అక్కడంతా కోలాహలంగా వుంది.

ఫోను ఉపయోగించుకునేందుకు అనుమతి తీసుకుని జీవన్ నెంబర్ డయల్ చేసాను.

కొంతసేపు తర్వాత జీవన్ గొంతు పలికింది. హామ్మయ్య! వచ్చాడన్నమాట!

"యస్, జీవన్‌లాల్ స్పీకింగ్. హూ ఆర్యూ?"

"మిస్టర్ సోమసుందర్, రిపోర్టర్, బ్లేడ్ మాగజైన్" అన్నాను.

జీవన్ వెంటనే "నువ్వా!" అన్నాడు. "ఏమిటి అంత రాత్రి ఫోన్ చేశావు? నా గొంతు కోస్తావా? మీది మొండి బ్లేడు. నా గొంతు తెగదు."

"మేమింకా మీమీద బ్లేడు ఝుళిపించలేదు కాబట్టి మీరలా అనుకుంటున్నారు" అన్నాను సీరియస్‌గా. పరాచికాలకిది సమయంకాదు. "మిస్టర్ జీవన్. నా మాటలు జాగ్రత్తగా, వొళ్ళు దగ్గర పెట్టుకుని వినండి! హోటల్ కంపాలా రూం సెవెంటీఫోర్ జ్ఞాపకముందా?"

అవతలినుంచి జీవన్ విచిత్రమైన అరుపు అర్చాడు.

"రాస్కెల్! నీ కెలా తెలుసు?"

"తెలుసుకోడం నా వృత్తికాబట్టి" అన్నాను. "మీ స్మగ్లింగ్ ప్లాట్ అంతా టేపుమీద ఎక్కించి భద్రంగా దాచాను. దాని విలువ లక్ష రూపాయలు."

చాలాసేపు అవతల నిశ్శబ్దం. నా మాటలకి అతని ప్రాణాలెగిరిపోయినంత పనయివుంటుంది—సమాధానం లేదు.

గర్వంగా నవ్వుకున్నాను నా పథకానికి.
అప్పుడు విన్పించాయి జీవన్ మాటలు: "రాస్కెల్! బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?"

"అవును. మీరు లొంగకపోతే ఆ టేప్స్ పోలీసులకి మెయిల్ చేస్తాను"

"అంటే, నువ్వు 'బ్లేడు'లో లేవా?"

"లేను. బయటికి వచ్చేశాను."

"ఎందుకు?"

"నిజం చెప్పాలంటే గిట్టుబాటు కావడంలేదు. అబద్ధం చెప్పాలంటే పెద్దమనుషుల్ని రచ్చకీడ్చడం నా కిష్టం లేదు."

"రాస్కెల్ నా స్మగ్లింగ్ ప్లాట్ నాకే అమ్మకానికి పెడ్తావా?" జీవన్ అర్చాడు.

"మీరే చెప్పండి, ఏది న్యాయంగా వుంటుంది? అమ్మకానికి పెట్టమంటారా, అప్పగించమంటారా పోలీసులకి?" అడిగాను.

కాస్సేపు నిశ్శబ్దం. ఆ తర్వాత జీవన్ అన్నాడు, "నేను ఆలోచించుకోవాలి. బహుశ నీకు పిచ్చి పట్టిందనుకుంటాను."

"మీరేమీ ఆలోచించకండి! నా షరతులు ఒప్పుకోండి. మీ ఎత్తులు నా దగ్గర పనికిరావు!"

"నేను గణేష్‌తో మాట్లాడాలి."

తేలిగ్గా వూపిరి వదిలాను. "వెంటనే మాట్లాడండి! గంట తర్వాత ఫోను చేస్తాను. అయితే ఒక విషయం చెప్పండి. నేను కోరిన డబ్బుకాక అదనంగా బహుమతి ఎంతిస్తారు?"

"ఎందుకూ?"

"గణేష్‌ని బఫూన్ చేశానుకదా?"

"షటప్, రాస్కెల్!" ఠక్కున లైను కట్ అయింది.

ఫోను పెట్టేసి నవ్వుకున్నాను. డబ్బు చెల్లించి బయటికి వచ్చి బైక్ స్టార్ట్ చేసి మళ్ళీ జీవన్ ఇంటికి బయలుదేరాను. అంతా నేననుకున్నట్టే జరుగుతోంది. నేను పన్నిన వలలో గణేష్ ఇప్పుడు చిక్కుకోబోతున్నాడు!

అదే మార్గాన జీవన్ బంగళాలోకి ప్రవేశించాను. జీవన్ గదిలో లైటు వెలుగుతోంది. కిటికీ తెరిచి వుంది. నేను చెట్టుద్వారా కిటికీ చేరుకోడం ప్రమాదకరం. యితే ఒక ఆలోచన వచ్చింది. గణేష్ కారు లేదు.

కాబట్టి అతనింకా రాలేదు. ముందు నేను చెట్టెక్కి కూచుంటే అతను వచ్చాక ఆ హడావుడిలో కిటికీ షేడ్ ఎక్కి కూచోవచ్చు.

గబగబ చెట్టెక్కాను. ఒక కొమ్మమీద కూర్చుని గణేష్ కోసం ఎదురుచూడసాగాను.

సమయం రెండు కావస్తోంది.

శ్యామల జ్ఞాపకం వచ్చింది. అక్కడేం జరిగిందో తెలియదు.

తేరుకుని చూశాను. హెడ్ లైట్స్ కన్పించాయి. నల్ల ప్లిమత్ వేగంగా వస్తోంది. జీవన్ తటాలున కిటికీ దగ్గరికి వచ్చి తొంగిచూశాడు. గణేష్ కార్లోంచి దూకి లోనికి పరిగెత్తాడు. జీవన్ వెనక్కి తిరిగాడు.

ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాను. ఒక వేళ వాళ్ళ సంభాషణ ఆ గదిలో సాగకపోతే!? నేనుపడ్డ శ్రమంతా వృధా అయిపోతుంది! ఇది నేను వూహించలేదు. ఇప్పుడు చేసేదేమీ లేదు! అంతా అదృష్టంమీద ఆధారపడి వుంది.

వెనక్కి తిరిగిన జీవన్ గదిలోంచి బయటికెళ్ళాడు. నేను గబగబ కొమ్మమీద ప్రాకి కిటికీ షేడ్ చేరుకున్నాను. దానిమీద బోర్లా పడుకుని తలకిందికి పెట్టి కిటికీలోంచి గదిలోకి తొంగిచూశాను.

జీవన్, గణేష్ గదిలోకి ప్రవేశించారు...

తేలిగ్గా వూపిరి వదిలాను. టేప్ రికార్డర్ ఆన్ చేశాను. జీవన్ అరుపు స్పష్టంగా విన్పిస్తోంది నాకు:

"బఫూన్! బిజినెస్ అంతా మంటగలిపావు! వారం క్రితం పదమూడు లక్షలు వాళ్ళకి పంపించాను, సరుకు కోసం! ఆ సరుకు రాలేదు, ఇక్కడ కథ అడ్డం తిరిగింది!

పదమూడు లక్షలు మునిగాయి! పదమూడు లక్షలు! నీకు లక్షలో శిక్ష విధించినా నా కసి తీరదు! పైగా ఆ రాస్కెల్ కి లక్ష సమర్పించుకోవాలి! వింటున్నావా బఫూన్?''

''బాస్!'' గణేష్ గర్జించాడు. ''ఎవరు బఫూన్? ఏమిటి మీరనేది! ఏం జరిగింది?''

జీవన్ కోపం చల్లార్చుకునేందుకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు.

''బాస్, శాంతించండి, నాకు వివరంగా చెప్పండి.'' గణేష్ ముఖంలో రంగులు మారుతున్నాయి.

రెండు నిమిషాల తర్వాత జీవన్ వివరించి చెప్పాడు. అంతా విని గణేష్ ఘొల్లున నవ్వాడు. జీవన్ భయపడ్డాడు.

''బాస్, నిద్రపట్టక మెదడు పాడయి వాడేదో వాగుతున్నాడు. మీరు పట్టించుకోకండి!''

''గణేష్...?

''భయపడకండి బాస్!'' గణేష్ జీవన్ కి అంతా వివరించి చెప్పాడు. ''నా దగ్గర వాడ్ని హంతకుడిగా నిరూపించే ఫోటోలున్నాయి. దేవ్ ని చంపి నేనే వాడ్ని బ్లాక్ మెయిల్ లో ఇరికించాను. వాడు మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తాడా! నాశనమైపోతాడు! ఆ టేప్స్ వాడి దగ్గర లేవు. ఆఫీసు సేఫ్ లో వున్నాయి. వాడికి పిచ్చి పట్టింది. నేను వాడితో మాట్లాడుతాను...''

గణేష్ ఫోన్ వేపు కదిలాడు. నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

''హలో సిస్టర్? బావగారున్నారా? పిలవండి!'' అన్నాడతను ఫోన్ లో. కాసేపు అవతలి మాటలు విని,

"ఇంట్లో లేడా? ఎక్కడికి వెళ్ళాడు? తెలియదా, నిజమేనా? నిజమేనా? మూడవసారి అడుగుతున్నాను-ఓ.కె. థ్యాంక్యూ!" అని రిసీవర్ పెట్టేశాడు.

"బాస్, వాడింట్లో లేడట. నేను వెళ్ళి చూస్తాను." అన్నాడు గణేష్ జీవన్ వేపు తిరిగి. "వాడు నిజంగా ఎత్తులు వేస్తున్నాడేమో తెలియదు. సేఫ్‌లోంచి ఆ టేప్స్ దొంగిలించడం ఎందుకైనా మంచిది—"

"నెగెటివ్స్ ఎక్కడ దాచావు?" జీవన్ అర్చాడు.

ఇదీ నేను ఆశించే ప్రశ్న!

"మీ కనవసరం బాస్. అవి భద్రంగా వున్నాయి."

"నాకు నిద్రపట్టదు! చెప్పు! ఎక్కడ దాచావు?" మళ్ళీ అన్నాడు జీవన్.

గణేష్ అన్నాడు. "ఆ నెగెటివ్స్ నా యింట్లో పరుపు దూదిలో దాచాను. చాలా?"

జీవన్ తృప్తిచెందాడు. నేను ఉక్కిరి బిక్కిరి అయ్యాను.

నెగెటివ్స్ గణేష్ పరుపు దూదిలో వున్నాయి!

"బాస్, నిశ్చింతగా నిద్రపోండి! నేను బఫూన్‌ని కాను. పరమ కిరాతకుడిగా నిరూపించుకుంటూ నిప్పౌదే! సుందర్ గాడి అంతుచూసి, సేఫ్‌లోంచి టేప్స్ తీసుకొస్తాను. గుడ్ నైట్" అతను తన చూపుడు వేలుని చూసుకుని, అదోలా నవ్వి బయటకి అడుగువేశాడు.

నేను వెంటనే రికార్డర్ ఆఫ్ చేసి, కనెక్షన్ వూడదీసి బ్యాగులో వేసుకున్నాను. ఆ తర్వాత కాచుకున్నాను. కాస్సేపయాక గదిలో లైటారిపోయింది.

అదే క్షణంలో కింద కారు స్టార్ట్ అయింది—గణేష్ వెళ్ళిపోతున్నాడు.

అతను ఇప్పుడు నా యింటికెళతాడు. అక్కడ నేనుండను. శ్యామలని హింసిస్తాడు...ముఖంమీద ఆసిడ్ జల్లేస్తాడు! ఆ తర్వాత ఆఫీసుకెళ్ళి టేప్స్ తస్కరిస్తాడు_ సేఫ్ ఖాళీగా వుంటుందన్నది వేరే విషయం. కానీ శ్యామల నా మూలంగా దారుణంగా శిక్షింపబడుతుంది!

ఇలా జరక్కూడదు! ఏదో ఒకటి చేయాలి! గణేష్ నా యింటికి చేరుకునేలోపున ఏదో ఒకటి చేయాలి...

ఒక ఆలోచన వచ్చింది. చెట్టు దిగి ప్రహరీగోడ వేపుకి వేగంగా వురికాను.

గోడదూకి బైక్ స్టార్ట్ చేసి చీకటిని చీల్చుకుంటూ అమిత వేగంతో దూసుకపోయాను.

# 9

ఆబిడ్స్ దగ్గర రెస్టారెంట్ ముందు బైక్ దిగాను. లోనికి వురికి ఫోన్ ఎత్తి నెంబర్ డయల్ చేశాను.

అవతలి నుంచి శ్యామల గాఢ రాగా పలికింది.

"శ్యాం, నువ్వు వెంటనే వెళ్ళిపో!" అన్నాను ప్రశాంతంగా.

"ఎక్కడికి?"

"ఎక్కడికైనా...అనిత దగ్గరికెళ్ళు! త్వరగా!"

"ఏం జరిగిందసలు?"

"ఏమీ లేదు__తర్వాత ఫోను చేస్తాను. నువ్వెళ్ళిపో!"

"అలాగే!" అస్పష్టంగా విన్పించాయి ఆమెమాటలు. నేను ఆందోళనగా రిసీవర్ పెట్టేశాను. గబగబ బయటికి వచ్చి బైక్ స్టార్ట్ చేసి వేగంగా దూసుకపోయాను.

విజయం తథ్యం! ఆ నెగెటివ్స్ నేను కాజేస్తాను. ఆ టేప్స్ గణేష్కి దక్కవు. జీవన్ రహస్యాలు బట్టబయలు

కాక తప్పదు! బాస్ శత్రువుమీద ఎట్టకేలకు నేను దెబ్బ తీస్తున్నందుకు ఆనందంగా వుంది.

నేను మూడు విజయాలు సాధించాను:—

బాస్ ప్రతిష్ట కాపాడాను.

నా ప్రాణాలు రక్షించుకున్నాను.

దేవ్ హంతకుడ్ని పట్టుకున్నాను.

కానీ, సేఫ్‌లో టేప్స్ లేకపోతే గణేష్ ఎలా రియాక్ట్ అవుతాడు? నేను నెగటివ్స్ తస్కరించానని తెలిస్తే ఏం చేస్తాడు? చంపేస్తాడా? మరో పథకం తయారుచేస్తాడా? నన్ను చంపకుండా బాస్ రక్షిస్తాడు. ఇక మరో పథకం తయారుచేసేందుకుసమయం ఏది? ఆ లోపు జైల్లో కూచుంటాడు.

మాది మొండి 'బ్లేడ్' అని జీవన్ పరిహసించాడు. ఇప్పుడు గుణపాఠం నేర్చుకుంటాడు!

ఆలోచనల్లో గణేష్ ఇల్లు వచ్చేసింది. బాల నగర్‌లో వనరాజ్ ఫ్లాట్స్. మర్నాడు పత్రికల్లో ఇలా వస్తుంది: 'బ్లేడ్ రిపోర్టర్ దొంగతనానికి పాల్పడిన వైనం!'— పోలీసులు ఇలాగే ప్రకటిస్తారు!

ఇది చాలా ప్రమాదంతో కూడుకున్న సాహసం. ఏది ఏమైనా నేను ఆ సాహసానికి పూనుకోవలసిందే! జరగవలసింది జరుగుతుంది...

గేటు దగ్గర జవాను నన్ను చూశాడు. నా భుజానికి బ్యాగు వేలాడుతోంది, "ఎవరు మీరు?"

"గణేష్‌కోసం వచ్చాను."

"అతను లేడు. మీరు ఎక్కడనుంచి వచ్చారు?"

"పక్కవూర్నుంచి వచ్చాను. అతన్ని కలుసుకోవాలి"

"గదికి తాళంవేసి వుంది."

"గుమ్మం ముందు కూచుంటాను. ఇక్కడ చలిగా వుంది."

అతనొకసారి ఎగాదిగా చూసి, "సరే, వెళ్ళండి" అన్నాడు.

నేను చకచక మెట్లెక్కాను.

త్వరగా పని ముగించుకుని వెళ్ళిపోవాలి. ఏ క్షణా నైనా గణేష్ వూడిపడతాడు. మూడో అంతస్తులో అతని గదిముందాగాను. తాళంవేసి వుంది. నడవాలో దీపాలు వెలుగుతున్నాయి. పక్క గదులన్నీ మూసి వున్నాయి. నేనిక్కడ పని ముగించేవరకు ఎవరూ బయటికి రాకపోతే బావుంటుంది.

తలుపు తెరవడం కష్టమేమీ కాలేదు నాకు. స్క్రూ డ్రైవర్‌తో గడియ విప్పేసి లోనికి ప్రవేశించాను.

లైటు వేయకుండా టార్చి వెలిగించాను. గబగబ బెడ్ దగ్గరకి నడిచాను.

పరుపుమీద ఖరీదైన దుప్పటి పరిచివుంది. దాన్ని లాగి కింద పారేశాను. జేబులోంచి కత్తితీసి పరుపు ఒకవైపు అంచు కుట్లు కోసేశాను. లోన చెయ్యిపెట్టి వెతికాను. మెత్తగా దూది తగిలింది. భుజంవరకు చెయ్యి పోనిచ్చి వెతకసాగాను. నాక్కావలసినవి తగలడంలేదు!

గాభరాగా పరుపు రెండవవేపు అంచు చూశాను. కత్తిపెట్టి కుట్లు కోయబోయాను. కుట్లులేవు! కత్తి లోనికి దూదిలోకి దూసుకపోయింది!

గుండె గతుక్కుమంది — శ్వాస ఆగిపోయింది! చెయ్యి పెట్టి ఆత్రంగా గాలిస్తున్నాను. ఎక్కడా నెగెటివ్స్ తగలలేదు!

నాకు వూహ తెలిసినప్పటినుంచి మొట్టమొదటిసారిగా ఏడ్చింది అప్పుడే!

# 10

అరగంట తర్వాత యుద్ధంలో ఓడిపోయిన సైనికుడిలా ఇంటికి చేరుకున్నాను.

ఫ్యాన్ స్విచ్ నొక్కి సిగరెట్ వెలిగించాను. బెడ్ మీద వెల్లికిలా పడుకుని ఆలోచించసాగాను.

నా ప్లాను నేను వూహించని విధంగా ఫ్లాప్ అయింది. నాకిప్పుడు ఏడుపు రావడంలేదు, నవ్వు రావడంలేదు. మెదడు మొద్దుబారింది. ఎక్కడుంది లోపం? ఎక్కడ జరిగింది పొరపాటు?

ఒకటికిపదిసార్లు ఆలోచించి ప్లాను తయారుచేసి రంగంలోకి దిగాను. చివరి క్షణంవరకు విజయం తథ్యం అనుకున్నాను. తెల్లారితే గర్వంగా తలెత్తుకుని బాస్ దగ్గరికి వెళ్ళాలనుకున్నాను. ఇప్పుడంతా తల్లకిందులైంది!

ఫోను మోగింది—

ఒక్క క్షణం అలా నిలబడిపోయాను.

మళ్ళీ కొత్త వ్యవహారానికిది ప్రారంభోత్సవం: నా అదృష్టానికి పరీక్షా సమయం.

రిసీవర్ ఎత్తాను. "సుందర్! వెంటనే బయలుదేరిరా!" శర్మ అరుపు విన్పించింది.

చెవులు చిల్లులు పడ్డాయి. "ఏం జరిగింది సర్?" నేనూ అరిచాను.

"కొంప మునిగింది. ఆఫీసులో దొంగతనం జరిగింది—జీవన్ టేప్స్ నాశన మయ్యాయి!"

"మిస్టర్ శర్మా!" గట్టిగా కేకపెట్టాను. "ఏమిటి మీర నేది!"

"నువ్వెంటనే రా!" ఠక్కున లైన్ కట్ అయింది.

నా కాళ్ళు నేల కతుక్కుపోయాయి. అతి కష్టంమీద

వూపిరి అందుతోంది. గొంతు నెవరో పీకేస్తున్నట్టు మెలి
కలు తిరిగాను.

ఫోన్ పెట్టేసి వెంటనే బయటపడ్డాను.

జరిగిందంతా ఆయనకి చెప్పేసి శిక్ష విధించమంటాను.

బంగళా ఆవరణలో బైక్ ఆపాను. ప్రశాంతంగా వుంది. పక్షుల కూతలు తప్ప అంతా నిశ్శబ్దం.

చకచక మెట్లెక్కి వరండాలో కొచ్చాను. బాస్ సెక్రటరీ నీరజ ఎదురైంది. ఆమె ముఖం చూస్తే తెలుస్తోంది నామీద ఎంత అసహ్యముందో.

"బాస్ ఎక్కడ?" అడిగాను.

"పైన. కాన్ఫరెన్స్ గదిలో."

"ఏం చేస్తున్నారు?"

"మీకోసం ఎదురు చూస్తున్నారు." కసిగా అంది. "వెళ్ళండి!"

నేను గబగబ లోనికెళ్ళి మెట్లెక్కాను. మహీందర్ రావ్ మానసిక శాంతి, సంఘంలో గౌరవం నా చేతిలో నాశనమయ్యాయి!

చివరి మెట్టు దగ్గర ఛటుక్కున ఆగిపోయాను.

రాబర్ట్ కన్పించాడు నడవాలో—జాలిగా చూస్తున్నాడు. "మిస్టర్ సుందర్, బాస్ పిలుస్తున్నారు."

కొన్ని క్షణాలు కళ్ళముందు చీకటి కన్పించింది. తేరుకుని చూశాను. ఇప్పుడు రాబర్ట్ పక్కన శ్యామల నిలబడి వుంది! ఆశ్చర్యపోయాను.

"బాస్ పిలుస్తున్నారు మిస్టర్ సుందర్."

ఏదో జరిగింది! శ్యామల ఇక్కడి కెందుకొచ్చింది? బాస్‌తో నా గురించి అంతా చెప్పేసిందా? తడబడుతున్న

అడుగులతో గబగబ పైకి వెళ్ళి ఆలోచించకుండా గదిలో అడుగుపెట్టాను.

మహీందర్ రావ్ సోఫాలో కూచొని కిటికీలోంచి బయట ఆకాశాన్ని తీక్షణంగా చూస్తూ సిగరెట్ తాగుతున్నాడు. ఆయన ఎంత పరధ్యానంగా వున్నాడో ఆయన నూటుమీద పడ్డ నుసినిబట్టి గ్రహించవచ్చు.

నా వెనక శ్యామల, రాబర్ట్ అడుగుపెట్టారు.

బాస్ నెమ్మదిగా తలతిప్పి నన్ను ఆపాదమస్తకమూ చూశాడు. గుండె ఆగిపోయింది! నా వొంటిమీద విష కీటకాలు పాకాయి.

ఆయన నల్లటి చురుకైన కళ్ళు జాలిగా నవ్వాయి.

నేను అతి ప్రయత్నంమీద సంభాళించుకున్నాను. ఇంకా నేను మౌనం వహించడం మంచిదికాదు. ఆయన ఎదురుగా నిలబడే ధైర్యం నాకు లేదు. చేసిన తప్పు ఒప్పుకుని శిక్ష విధించమని చెప్పి, ఇక్కడనుంచి తక్షణం వెళ్ళి పోవాలి!

"సర్, నేను చాలా తప్పుచేశాను..." నా కంఠం సహకరించడం లేదు "మిమ్మల్ని తీవ్రంగా అవమానించాను. తలెత్తుకోకుండా చేశాను. మీరు నన్ను నిర్దాక్షిణ్యంగా శిక్షించండి సర్!"

బాస్ పలకలేదు.

"అప్పటికీ నేను శర్మని హెచ్చరించాను." మళ్ళీ అన్నాను. "అతను పాటించలేదు."

"గణేష్ ఆ టేప్స్ తగులబెట్టాడు. దానికి కారణం నేను సర్! నేనతన్ని రెచ్చగొట్టాను."

వాళ్ళంతా నన్ను చిత్రంగా చూస్తున్నారు.

శ్యామల నన్ను జాలిగా చూస్తూండడం తెలుస్తోనే వుంది నాకు.

బాస్ పెదవులు చప్పరించి సిగరెట్ విసిరేశాడు. చిటికవేసి రాబర్ట్‌కి సైగచేశాడు. రాబర్ట్ తలవూపి బయటి కెళ్ళాడు.

"సుందర్, కూచో." మహీందర్ మొదటిసారిగా పలి కాడు, అదీ మృదువైన స్వరంతో. మతిపోయింది. ఛటు క్కున కూచున్నాను. మహీందర్ తల వంచుకుని సూటు మీద పడ్డ నుసిని దులుపసాగాడు.

అప్పుడు ప్రత్యక్షమయ్యాడు రాబర్ట్.

అతని రెండు చేతులలో బ్రౌన్ కలర్ ప్యాకెట్లు న్నాయి.

నేను కళ్ళప్పగించి చూస్తున్నాను. రాబర్ట్ నన్ను చేరుకుని చిన్న పాకెట్ అందించాడు. "సుందర్, తెరిచి చూడండి."

నేను బాస్‌ని చూశాను గాభరాగా. ఆయన తలూ పాడు. నేను ఛటుక్కున ప్యాకెట్ కవరు చించేసి వుండ చుట్టి అవతల పారేసాను. కళ్ళు జిగేలుమన్నాయి. మతి పోయింది! నా చేతిలోంచి జారి టీపాయ్‌పైన పడింది... ఫోటోల కట్ట.

"ఇవి__సర్! ఇవెక్కడివి?" అరిచాను గొంతు చించుకుని.

బాస్, రాబర్ట్‌ని చూసాడు. రాబర్ట్ ఇలా అన్నాడు: "నేను తెచ్చాను."

"ఎక్కడనుంచి?"

"గణేష్ గదిలోంచి" ప్రశాంతంగా అన్నాడు రాబర్ట్. "మిస్టర్ సుందర్, మీకంతా వివరించి చెప్తాను. నాకు

మొదటినుంచే మీమీద అనుమానంగానే వుంది. అబద్ధాలాడారు మీరు.

"మీమీద నిఘావుంచమని బాస్ రాగానే చెప్పారు. నేను నా మనుషులతో రంగంలోకి దిగాను. మీరు ఇంటి నుంచి బయలుదేరినప్పుడు ఎవరేనా వెంటాడుతారేమోనని చాలా జాగ్రత్త తీసుకున్నారు కానీ, తర్వాత చాలా నిర్లక్ష్యం చేసారు. రాత్రంతా మిమ్మల్ని తప్పిపోకుండా వెంటాడాను.

"మీరు జీవన్ ఇంటికెళ్ళి ఏర్పాట్లుచేసి నాటక మాడారు. జీవన్, గణేష్‌ల సంభాషణ నేను డాబామీద వుండి విన్నాను—మీరు కిటికీ షేడ్ మీద వున్నారు.

"వాళ్ళ సంభాషణ విన్నాక ఈ బిజినెస్ నాకు పూర్తిగా అర్థమైంది. మీరు బ్లాక్ మెయిల్‌లో ఇరుక్కున్నారు. మీలో గిల్టీ కాంప్లెక్స్ ప్రవేశించింది. మా సహాయం కోరేందుకు నిరాకరించి చిక్కులు కల్పించుకున్నారు.

"సుందర్, కేను గణేష్ మాటలు విన్నాక ఆ నెగటివ్స్ తస్కరించేందుకు నిశ్చయించుకున్నాను. గణేష్ మీ ఇంటికి వెళుతున్నాడు కాబట్టి, మీ భార్యని రక్షించే ప్రయత్నంలో మీకు ఆ నెగటివ్స్ తస్కరించే వీలు చిక్కదనుకున్నాను—కాబట్టి నేనే తస్కరించాను.

రాత్రి మీ భార్యకు ఫోన్ చేసి, అనిత ఇంటికి వెళ్ళమన్నారట. ఆవిడకు భయంవేసి ఇక్కడకు వచ్చి, బాస్‌తో అన్ని విషయాలూ చెప్పేసారు."

మాట్లాడేసి నవ్వాడు రాబర్ట్.

"మరి ఆఫీసు సేఫ్‌లో షేప్స్?" ఆదుర్దాగా అడిగాను.

రాబర్ట్ రెండవ ప్యాకెట్ అందించాడు. ఈ పాక్

ట్రీట్ మెంట్ కి నేను తట్టుకోలేకపోతున్నాను. గజగజ వణుకుతూ ఆ ప్యాకెట్ విప్పి చూసాను: జీవన్ లాల్ స్మగ్లింగ్ కేసుకి సంబంధించిన రిపోర్ట్స్, టేప్స్, నెగెటివ్స్, నన్ను వెక్కిరించాయి.

రాబర్ట్ చెప్పడం ప్రారంభించాడు:

"మీరు చెప్పినట్టు శర్మ ఈ ప్యాకెట్ ని సేఫ్ లోంచి తొలగించాడు. గణేష్ సేఫ్ ని కొల్లగొట్టి ఈ టేప్స్ తస్కరిస్తానని చెప్పినప్పుడు నాకో అయిడియా వచ్చింది. బాస్ కి చెప్పాను. వెంటనే ఇలాటి ప్యాకెట్ నే మరొకటి సృష్టించి అందులో పెట్టమన్నారు.

"ఆ ప్యాకెట్ లో వున్నవి డూప్లికెట్ రిపోర్ట్స్, కొన్ని ఫోటోలు, రీరికార్డింగ్ చేసిన టేప్స్—ఇవన్నీ జీవన్ స్మగ్లింగ్ కి చెందిన రహస్యాలు. ఒక సెట్ సేఫ్ లో, ఒక సెట్ మా దగ్గరా వుంచుకున్నాం.

"అనుకున్నట్టే గణేష్ వచ్చి సేఫ్ లోంచి ఆ ప్యాకెట్ దొంగలించడమేగాక, ఆఫీసులోనే తగులబెట్టి వెళ్ళి పోయాడు. మరొక సెట్టు మా దగ్గర వుందని అతనికి తెలియదు. గదికెళ్ళి ఫోటోలు పోయాయని తెలుసుకుని వుంటాడు. అయినా ఏమీ చేయలేదు. ఆ టేప్స్ మా దగ్గర వున్నంతవరకే ఆ నెగెటివ్స్ అతనికి అవసరం. టేప్స్ తగలబెట్టాడు కాబట్టి, ఇక వాటి అవసరం లేదు."

వూపిరి బిగబట్టి విన్నాను.

"సుందర్, బాస్ కి పరువు ఎంత ముఖ్యమో, మీ ప్రాణాలూ అంత ముఖ్యం." రాబర్ట్ అన్నాడు మళ్ళీ. "మిమ్మల్ని రక్షించేందుకు ఆయన తీవ్రంగా ఆందోళన చెందారు. మీరు ఆయన్ని అపార్థం చేసుకున్నారు.

ఆయన మీకేదేనా శిక్ష విధించాలనుకుంటే, అపార్థం చేసుకున్నందుకే విధించాలి...''

బాస్‌ని చూశాను. ఆయన నవ్వాడు. నేను తలవంచుకున్నాను. ''క్షమించండి సర్!''

ఆయన తీక్షణంగా చూశాడు. ''సుందర్! నువ్వు చేసిన పనికి శిక్షేమిటో తెలుసా?'' జేబులోంచి ఒక చెక్కు తీసి టీపాయ్ పైన పెట్టాడు. ''పదివేల రూపాయలు. ఈ డబ్బు తీసుకుని నెలరోజులు నాకు కన్పించకు! అర్థమైందా? దేశం చుట్టిరా! వెళ్ళు.''

శ్యామల కళ్ళు మిలమిల మెరిసాయి.

నేను లేచి నిలబడి ఆయనకి చేతులు జోడించాను. ''క్షమించండి. సర్, క్షమించండి...''

—: ఐ పో యిం ది :—

# ఎడారిలో బంగళా!

ఏ. వీ. మోహన్రావ్

నేను పెళ్ళిచేసుకోలేదు. అందుకు కారణం నన్ను చేసుకునే వాళ్ళు లేక కాదు. నాకు వ్యక్తిగతంగా పెళ్ళి పైన సదభిప్రాయంలేదు.

ఇప్పుడు నా వయసు నలభై రెండు దాటింది. నన్ను చూసిన వాళ్ళందరూ నాకు ముప్ఫయి మించి వుండ దంటూ అంటారు.

నాకు వెనకా ముందూ ఎవ్వరూ లేరు. నాది స్వేచ్ఛా జీవితం. అలాగని గాలిపటంలా ఎటుపడితే అటు ఎగిరే తత్వంకాదు. నాకు అన్ని అలవాట్లు వున్నాయి. తాగు తాను. పేకాడతాను. రేసులకు పోతాను. కానీ ఇవన్నీ సంఘంలో పెద్ద పెద్దవాళ్ళల్లోకి జొరబడటానికి, పలుకు బడి సంపాయించుకోవటానికి మాత్రమే ఉపయోగిస్తాను.

అన్నింటినీ మించి ఆరోగ్యమే మహాభాగ్యం అను కునే మనిషిని. వ్యాయామం చెయ్యడం, ఈదడం, పరు గెత్తడం, టెన్నిస్ ఆడడం, బలమైన ఆహారం తీసు

కోవడం, లాంటి వాటిల్లో నేనెన్నడూ అశ్రద్ధ చెయ్య లేదు. అందుకే నేను బలంగా వున్నాననుకుంటూ వుంటాను.

అయితే నాకున్న బలహీనతల్లా స్త్రీ సంపర్కం. అదో పెద్ద వ్యసనం. ఇందులోనూ నేను కొన్ని నియమాలు పెట్టుకున్నాను. నాసిరకాలకు, బజారు బాపతులకు, ఎగబడడం నా పద్ధతికాదు. పెద్దపెద్ద సొసైటీల్లో, నాకున్న పరిచయాల్ని పురస్కరించుకుని, అదను చూసి, అవతలవాళ్ళ బలహీనతలు గుర్తించి నా కోరికలు తీర్చుకుంటూ వుంటాను.

ఆ రోజు ఆదివారం.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని కాఫీ తాగుతున్నాను. కార్నర్ టేబుల్ పైనున్న ఫోన్ మ్రోగింది.

లేచివెళ్ళి రిసీవరు పైకెత్తాను. "హాలో" అన్నాను మెల్లగా.

"ఎవరు? మాట్లాడుతున్నది రాజాయేనా?" అవతల వేపునుండి వినిపించింది. ఆ కంఠం నాకు బాగా గుర్తే.

"అవును! ప్రొద్దుటే ఫోన్ చేశావేం కోమలీ?" అడిగాను.

"అరే! కనిపెట్టేశావే!" విస్తుపోయింది అవతలివేపు కోమలి.

"అనురాగం, అభిమానం వున్నప్పుడు ఆ మాత్రం గుర్తింపు లేకపోతే ఏముంది. నాకు నీ మీదవున్న ప్రేమకన్నా, నీకు నా మీద చాలా తక్కువుంది!" అన్నాను.

"రాజా! అలాగనకు! ఐ లైక్ యూ! ఐ లైక్ యూ" వగలుపోయింది కోమలి ఫోన్‌లో.

"మరి హాల్లో అనగానే గుర్తించలేకపోయావ్?" అడిగాను నేను.

"అందుకు కారణం నేనుకాదు! మా ఫోన్. దీని సౌండ్ సరిగాలేదు!" సర్ది చెప్పుకుంది కోమలి.

"ఇంతకూ అసలు విషయం ఏమిటి?" అడిగాను.

"ఏంలేదు. మా వారు ఉదయం ఫ్లైట్‌లో ఢిల్లీ వెళ్ళిపోయారు. రెండ్రోజులురారు. ఈ రెండ్రోజులు సరదాగా ఎటైనా వెళ్దాం!" అంది కోమలి.

కోమలితో నా పరిచయం క్రొత్తగా ఈ మధ్యనే ప్రారంభమైంది. కాటన్‌కింగ్ గా పేరుతెచ్చుకున్న పెద్ద మిల్లు ఓనరు భార్య. ఇద్దరు పిల్లలు. రెసిడెన్షియల్ స్కూల్‌లో చదువుతున్నారట. క్లబ్‌లకు తిరుగుతూ వుంటుంది. సన్నగా, అధునాతనంగా అలంకరించుకొని వుంటుంది. ఎక్కువగా త్రాగుతూంటుంది. ఓ మారు ఓబ్రాయ్ షెరటాన్ హోటలులో రూం తీసుకున్నాం. ఖర్చంతా ఆమే భరించింది. ఆ తర్వాత మళ్ళీ ఇదే పిలుపు.

"ఎటువెళ్దాం!" అడిగాను.

"ఈ వూళ్ళోవద్దు. ఎవరైనా చూస్తారు. ఆగ్రాకు పోదామా?"

"పోయి రావడానికి రెండ్రోజులు పడుతుంది" అన్నాను.

"రైల్లోకాదు! ఫ్లైట్‌లో వెళ్దాం. అక్కడ రూం బుక్ చేస్తాను" అంది.

"విమానంలో వద్దు. హాయిగా నా కార్లో పోదాం!" అన్నాను.

"ఓ. కే! తిరిగి వచ్చేటప్పుడు నేను ఫ్లైట్‌లో వస్తాను" అంది కోమలి.

"అలాగే! ఇంకో గంటలో బయలుదేరుతాం" అన్నాను.

"థాంక్స్! స్వీట్ డ్రీమ్స్ అండ్ నైట్స్!" అంటూ ఫోన్ పెట్టేసింది.

నేను కూడా ఫోన్ పెట్టేసి, గబగబ స్నానంచేసి, సూట్‌కేస్‌నిండా బట్టలు సర్దేశాను. పనిపనిషిని పిలిచి, సూట్‌కేస్‌ను కార్లో పడెయ్యమన్నాను. అల్మైరా లోంచి కొంత డబ్బు తీసుకున్నాను. రావడానికి రెండ్రోజులు పడుతుందని చెప్పి, బంగాలోంచి వెలుపలికి వచ్చి కారెక్కాను.

మలబార్ హిల్స్ ప్రాంతాల్లోవున్న పెట్రోల్ బంక్ వద్ద కారాపి కూర్చున్నాను. ఐదు నిముషాల తర్వాత ఒక టాక్సీవచ్చి ఆగింది. అందులోనుండి కోమలి దిగింది. చేతిలో మీడియమ్‌సైజ్ 'అరిస్టోక్రాట్' సూట్‌కేస్ వుంది. పైటకొంగు తలపైన ముసుగులా వేసుకుంది కోమలి.

టాక్సీ డబ్బులిచ్చి, చూట్టూ చూసి, చకచక నడుచు కుంటూవచ్చి కారు బ్యాక్‌సీట్‌లో సూట్‌కేస్ పడేసి, ముందున్న డోర్ తెరిచి కూచుంది. వెంటనే నల్లటి విండోగ్లాసు పైకెత్తివేసింది.

"నీ జాగ్రత్తలు నువ్వు తీసుకుంటున్నట్లున్నావ్?" అన్నాను ఇగ్నిషన్‌కీ త్రిప్పుతూ.

"లెట్స్‌గో! క్విక్!" అంది కంగారుగా.

"అంత కంగారుపడే దానివి ఎందుకొచ్చినట్లు. నేను రమ్మన్నానా?" అన్నాను ఏడిపించాలన్నట్లు.

"రాజా! ముందు మనం త్వరగా వెళ్ళిపోవాలి. ఎవరైనా చూస్తే బాగుండదు. ఊరు దాటాక కబుర్లు చెప్పుకోవచ్చు" అంది కోమలి, రుమాలుతో పెదాలకున్న ఎర్రటి లిప్‌స్టిక్ అద్దుకుంటూ.

మారుమాట చెప్పకుండా కారు స్టార్టుచేశాను. గడియారం వంక చూసుకున్నాను. తొమ్మిది గంటలా పదకొండు సెకన్లు అయింది.

సరిగ్గా నలభైఐదు నిముషాల తర్వాత నా కారు బొంబాయి నగరం దాటి ఆగ్రారోడ్ పైనున్నాం.

"అమ్మయ్య! ఎవ్వరి కళ్ళల్లో పడలేదు!" అంది కోమలి.

"మీ ఇంట్లో సర్వెంట్సు లేరా? వాళ్ళకు నువ్వీ రెండు రోజులు ఇంట్లో లేని సంగతి తెలుసుగా. వాళ్ళు మీవారితో చెప్తారేమో?" అనుమానం వ్యక్తం చేశాను.

కోమలి నన్ను బాగా ఆనుకుని కూచుంది. ప్రొద్దున్నే తాగివచ్చినట్లనిపించింది ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాల వాసన గమనించాక.

"చెప్పరు. వాళ్ళకంత స్వతంత్రం లేదు. చెప్పినా ఆయన నన్నడగరు. అడిగినా ఏదోఒకటి చెప్పి తప్పించుకోగలను." అంది కోమలి ధైర్యంగా.

"ఇంతకుముందలాంటివి జరిగాయా?" అడిగాను.

"ఆఁ! ఒకటి రెండుసార్లు జరిగాయి. సర్దిచెప్పేసాను" అంది కోమలి.

"ఇలా రావడం నీ కిది ప్రథమం కాదన్నమాట!"

ఆ మాటలు అంటున్నప్పుడు నాకు మనస్సులో కొంత నిరాశ, నిరుత్సాహం కలిగిన మాట నిజం. ఆమె భర్తను తప్ప మరెవ్వరినీ ఎరగని అమాయకురాలనీ, నా

అందచందాలతో, హావభావాలతో, మాటల నేర్పుతో వలలో వేసుకోగలిగాననీ, ఏదోమూల నాలో నేను పడుతున్న గర్వం కాస్తా అణిగిపోయింది.

"ఊరు దాటడం ఇదే మొదలు" అంది కోమలి.

కొంతలో కొంతయినా మనస్సు తేలిక పడింది. కనీసం ఊరైనా దాటించగలిగిన నా నేర్పును నేనే అభినందించుకొన్నాను.

## 2

రాత్రి రెండు గంటల ప్రాంతంలో "మార్షల్ హోటల్" ముందు కారాపాను.

రిసెప్షనులో అడగగానే, మా గది తాళం యిచ్చి ఇద్దరు బాయ్స్‌ను పంపారు.

సూట్ కేసులు తీసుకొని, నాలుగో అంతస్తులో వున్న గది చేరుకున్నాం. బాయ్స్ వెలుపలకు వెళ్ళగానే తలుపులు మూసి గొళ్లెం పెట్టాను.

కోమలి తిన్నగా బాత్ రూంలోకి వెళ్ళిపోయింది. ఐదు నిముషాల తర్వాత తలార స్నానంచేసి వచ్చింది. ఆమె వచ్చాక నేను వెళ్ళాను. నేను స్నానం ముగించుకొని గదిలోకొచ్చేసరికి బిస్కట్ బ్రాందీ బాటిల్ ఓపెన్ చేసుకొని కూచుంది.

"ఇప్పుడు మొదలెట్టావా?"

"ఆఁ! ఇది లేనిదే మజా రాదు. మత్తులో వున్నప్పుడే ఒంటికి మైకం కావాలి. అప్పుడు కంటికి మూతపడదు." అంది కోమలి గ్లాసు పైకెత్తిపెట్టుకొని తాగుతూ.

"నాకు తాగే వాళ్ళంటే అసహ్యం!" అన్నాను ఒంటికి పౌడర్ పట్టించుకుంటూ.

"నువ్వూ ఓ సిప్ తాగిచూడు తెలుస్తుంది మజా!" అంటూ గ్లాసు తీసుకొచ్చింది నా ముందుకు.

వద్దంటూ వారించి తోసేశాను.

కోమలి వెళ్ళి మంచంపైన పడింది మత్తుగా.

అంతలో, నేనున్న గది తలుపు తీసేందుకన్నట్లు ఎవరో హాల్ లో కీ పెట్టిన శబ్దమైంది.

వెంటనే గదిలో లైటార్పేశాను.

అవతల వేపునుండి ఎవరో హాండిల్ వంచారు. బలంగా తోసినట్లయింది. గది తలుపు భళ్ళున తెరుచుకుంది.

వరండాలో లైటు గదిలో పడింది. బాత్ రూం తెరచివుండటం గమనించాను. అందులోని లైటుకూడా గదిలో పడటంతో, గదంతా సన్నటి వెలుగుతో నిండిపోయింది.

"వేర్ ఈజ్ షి" తప్పతాగి తూలుతూ లోనికి వస్తూన్న వ్యక్తి, ఎదురుగా లేని మనిషిని ఎవర్నో అడుగుతున్నట్లుగా అడుగుతూ అడుగులు వేశాడు.

అతని వెనుక వెలుగుండటంతో అతన్ని బాగా చూడగలిగాను. నా గుండెలు ఆగిపోయాయి.

అతను కోమలి భర్త ముకుంద్!

ఢిల్లీకి వెళ్ళిన వ్యక్తి ఆగ్రాలో ఎలా ప్రత్యక్ష్యం కాగలిగాడో నా కర్థం కావడంలేదు. అందులోనూ అతని భార్య నా వెంటవుండగా, అంత రాత్రివూట మా గదికే ఎలావచ్చి తలుపు తట్టగలగాడో ఊహించలేకపోయాను.

అతన్ని వెనక్కు తోసివేద్దామనుకున్నాను. అలా చేసేందుకు నేను చీకట్లో నుండి వెలుతురులోకి రావాలి. రాగానే గుర్తిస్తాడు. గుర్తించాక ఇక వెలుపలకు పోవడం అసాధ్యం. ఈలోగా అతను, తన భార్యను చూసుకోవడం జరుగుతుంది. అదే జరిగితే నా పని క్లోజ్.

అచేతుణ్ణయి నిల్చున్నాను. అవాక్కయిపోయాను.

"సార్! సార్! మీకు చెప్పిన రూం యిది కాదు. నాలుగొందలా ముప్పైఆరులో వుందామె. ఇది మూడొందలా నలభైఆరో నెంబరు గది. రండి" అంటూ ఫ్లోర్ బాయ్ ముకుంద్‌ని చెయ్యిబుచ్చుకుని వెలుపలకు లాక్కెళ్ళాడు.

"నో!నో! ఇదే కరెక్టు. అదిగో, ఆమె మంచంపై ఒంటరిగా వుంది. నువ్విచ్చిన కీతో తలుపు కూడా తెరుచుకుంది." అంటూ గొణిగాడు ముకుంద్.

"నే తీసుకెళ్తాను రండి సార్! సరయిన చోటికి చేరుస్తాగా? నా వెంటరండి! ప్లీజ్!" అంటూ ఆ బాయ్ ముకుంద్‌ను బలవంతంగా వరండాలోకి లాక్కెళ్ళిపోయాడు.

వాళ్ళు కనుమరుగు కాగానే రక్కన తలుపు మూసి, క్రిందా పైనా, గొళ్ళేలు వేసి, లైటు వెలిగించాను.

కోమలి వొంటిమీద బట్టలేకుండా మంచానికి అడ్డంగా బోర్లగిలా పడుకుని వుంది.

వీపుమీద తట్టి లేపాను.

"వాట్ డియర్! కమాన్!" అంది మత్తు కళ్ళతో.

"షటప్! మనం డేంజరులో పడ్డాం!" అన్నాను భయంగా.

"ఏమయింది?" అడిగింది అనాసక్తంగా కోమలి.

"నీ భర్త గదిలోకి వచ్చాడు. ఆమె ఎక్కడ? ఆమె ఎక్కడ? అంటూ ఇంగ్లీషులో అరిచాడు. బాగా త్రాగి వున్నాడు" అన్నాను.

"అబ్సర్డ్! మనం ఢిల్లీలో కాదు వుంది, ఆగ్రాలో." ఆఖరి మాట వత్తిపలికింది.

"ఆ సంగతి నాకూ తెలుసు! వచ్చింది మాత్రం ముకుందే. నేను బాగా చూశాను. నాలుగొందలా ముప్ఫైఆరో నెంబరులో వున్నాడు'' అన్నాను.

"నిజంగానా?'' లేచి కూర్చుంది.

"ముందు బట్టలు వేసుకో!''

సన్నగా వున్న షిఫాన్ నైటీ వేసుకుంది.

"నాకు నమ్మకం చిక్కడంలేదు!'' అంది కోమలి.

నేను వెళ్ళి ఫోన్ తీసుకున్నాను. రిసెప్షనులోంచి రెస్పాన్స్ రాగానే "మీ హోటల్ లో అతిధులకు తగిన రక్షణ గౌరవం వున్నాయా?'' అడిగాను తెచ్చిపెట్టుకొన్న కోపంతో.

"ఎందుకు సార్! అర్ధరాత్రిపూట లేచి అంత కోపంగా అరుస్తున్నారు?'' అడిగాడు అవతలి వ్యక్తి.

"ఎవడో నాలుగొందలా ముప్ఫయి ఆరో నెంబరుకు వెళ్ళవలసిన మనిషి నా గది తాళం తీసుకొని లోనికొచ్చి అల్లరిచేశాడు. ఎవరతను?'' అడిగాను నా కంఠంలో కోపపుపాలు తగ్గనీకుండా.

"అతనా! కాటన్ కింగ్ ముకుంద్ సార్! పొరపాటు జరిగి వుంటుంది. ఇకపైన అలాంటివి జరగకుండా జాగ్రత్త పడతాను. క్షమించండి!'' అన్నాడు అవతలి వ్యక్తి.

"ఓ.కే! అలాంటివి జరగకుండా చూడండి!'' అంటూ ఫోన్ పెట్టేశాను.

"ఏమంటాడు?'' అడిగింది కోమలి.

"నీ మొగుడు ముకుంద్ అని చెప్పాడు. ఏమిటి మనకు దారి?'' అడిగాను భయంగా.

అతను చండశాసనుడు. అతని చేతిక్రింద చాలామంది గూండాలు, హంతకులు వున్నారు. మొదట్లో స్మగ్లింగ్

వ్యాపారం చేసి, ఆ తర్వాత కాటన్ మిల్స్ పెట్టాడు. పగ పట్టాడంటే రేచుకుక్కల్లా వెంటాడి తాచుపాములా విషం కక్కి కరిచే రకమని కొంతమందిద్వారా విన్నాను.

"ముకుంద్ ఎందుకు వచ్చినట్లు?అర్థంగాకుండావుంది?" అంది కోమలి.

నాకేమి మాటలు వినిపించలేదు. ఎలాగైనా ఇక్కడి నుంచి అతని కళ్ళల్లో పడకుండా ఎటు వెళ్ళిపోవడమా అన్నదే సమస్యగా మిగిలింది నాకు.

"కోమలీ! మనం ఇక్కడ వుండడం క్షేమంకాదు! నేను ఇప్పుడే వెళ్ళిపోదలచుకున్నాను. మరి నీ సంగతేమిటి?" అడిగాను.

"నన్నొదిలేసి పోతావా?"

"లేకుంటే వెంట తీసుకువెళ్ళి నీ భర్త చేతుల్లో చిక్కి చావమంటావా?"

"అయితే నన్ను క్షేమంగా ఇక్కడనుంచి ఆగ్రా నగరం దాటించే బాధ్యత నీకు లేదా? నిన్ను నమ్ముకుని వచ్చినందుకు నువ్వు చూపించే ప్రేమ ఇదేనా?" కోమలి కోపంగా ఏడుస్తూ అడిగింది.

"అదికాదు. నిన్ను స్టేషనులో దింపుతాను. ఏదో ఒక రైలు ఎక్కి అటు ఢిల్లీకో లేక, బొంబాయికో చేరుకో! నా త్రోవ నేను చూసుకుంటాను" అన్నాను.

"అలాగే!" అంది కోమలి.

గబగబ బట్టలు సర్దుకున్నాం.

సూట్ కేసులు తీసుకొని, క్రిందకొచ్చాం. కోమలి తిన్నగా వెళ్ళి కారులో కూర్చుంది. నేను రిసెప్షన్ లోకి వెళ్ళి మిగిలిన డబ్బు తీసుకుని రూం తాళం ఇచ్చాను.

"ఏంసార్! మా హోటల్‌లో ప్రైవసీ లేదని వెళ్ళిపోతున్నారా?" అడిగాడతను తాళం తీసుకుంటూ.

"అవును" అన్నాను.

"ఎక్కడా అనకండి సార్. మా బిజినెస్ కాస్తా పడిపోతుంది."

"నాకవసరమేముంది! థాంక్స్!" అంటూ వెనక్కి తిరిగొచ్చి కారెక్కాను.

ఆగ్రా సిటీ స్టేషనులో కోమలిని దిగవిడిచాను.

కారులోనే కూర్చుని కాసేపు ఆలోచించాను. ఢిల్లీ వెళ్ళడంకన్నా, తిన్నగా బొంబాయి వెళ్ళడమే మంచిదని తోచింది. కారును స్టార్ట్ చేశాను. కొంతదూరం పోయాక పెట్రోలుబంక్ ఒకటి వచ్చింది. టాంక్ నిండా పెట్రోలు పట్టించుకున్నాను. రోడ్ పట్టుకున్నాను.

ఎంతో ఆవేశంతో, ఆనందంతో బయలుదేరిన నాకు జరిగిన సంఘటనలు తలపుకు రాగానే చాలా నిరుత్సాహం కలిగింది. నా జీవితంలో ఇది మొదటి అనుభవం. ఇదే ఆఖరు అనుభవం అయ్యేలా చూడమని భగవంతుణ్ని మనస్సులోనే కోరుకున్నాను.

# 3

తొమ్మిది గంటలయ్యేసరికి రాజస్తాన్ ఎడారి మధ్యగా క్రొత్తగా వేసిన రోడ్ మొదటకి చేరాను.

మూడువందల మైళ్ళుందా రోడ్డు. మధ్యలో ఎక్కడా మానుగానీ, మరేవిధమైన మానవ సంచార సంచలంకాని లేదని విన్నాను. రెండు పెట్రోలుబంకులు మాత్రం వున్నాయి. ఆ రోడ్ వెంట రాత్రిపూట ఎవ్వరూ వెళ్ళరు. పగలు వెళ్తుంటారు. టోల్ గేట్ వద్ద డబ్బు చెల్లించి నా కారు నెంబరు, పేరు చెప్పాను. అతను రాసుకున్నాడు.

“రోడ్ ఎలా వుందట?” అడిగాను అతన్ని.

“ఫరవాలేదు! బాగానే వుంది. ఇంతకుముందే మూడు కార్లు ఆరు లారీలు వెళ్ళాయి. ఇసుక తుఫాను లేపీలేవు. అలా వుంటే మాకు వర్తమానం అందుతుంది. అప్పుడు వెట్నీ వదలము” అన్నాడతను.

“థాంక్స్!” చెప్పి స్టార్టుచేశాను.

ఎక్కువ రద్దీ లేనందువల్ల ఆక్సిలేటరు పూర్తిగా నొక్కాను. మంచి స్పీడందుకుంది. అదే స్పీడులో బండిని నిలకడగా పోనిచ్చాను.

నూట ఇరవై మైళ్ళు వెళ్ళాను. ముందు కారు టైరు టప్పుమని పగిలింది.

క్రిందికి దిగి చూశాను. టైరు పగిలిపోయి వుంది. లాభం లేదని, ఇగ్నీషన్‌లోంచి తాళాలు తీసి వెనుక వేపు డిక్కీ తెరిచేందుకు వెళ్ళాను. డిక్కీలో తాళం పెడుతుంటే, లోనికి వెళ్ళలేదు. హాండిల్ అటూ ఇటూ త్రిప్పి పైకి లాగాను. డిక్కీ తెరచుకుంది. లోపల స్టెప్నీ కనుపించలేదు.

బొంబాయినుంచి బయలుదేరేముందు స్టెప్నీ తీసుకొచ్చిన విషయం నాకు బాగా గుర్తుంది. ఆగ్రాలో హోటల్‌లోకి వెళ్ళేప్పుడు తాళం వెయ్యడం గుర్తుంది. మరి స్టెప్నీ ఏమయింది?

హోటల్ కాంపౌండ్‌లో వుండగానే ఎవడో దొంగ వెధవ మారుతాళంతో డిక్కీ తెరచి స్టెప్నీ దొంగిలించి వుంటాడనిపించింది. ‘మార్బల్ హోటల్’ను లోలోపలే తిట్టుకున్నాను. ఒకవేళ బ్యాక్ సీటులో పొరపాటున పెట్టేనేమోనని, తలుపు తెరిచిచూచాను. కనుపించలేదు.

ఫ్లాస్క్‌లో కాఫీ వుంది. రెండు మాడరన్ బ్రెడ్‌లు

వున్నాయి. పెట్రోలు నింపుకునేందుకు ఏర్పాటు చేసిన స్టేషను ఇంకెంత దూరంలో వుందో నాకు తెలీదు.

కారెక్కి కూర్చున్నాను, ఏదైనా వాహనం రాక పోతుందాని. సిగరెట్టు ముట్టించుకుని కారులోవున్న రేడియో ఆన్ చేశాను. లోపల కాసెట్ టేప్ వుంది. వెనుకనున్న స్పీకర్‌లోంచి కమ్మటి వెస్టరన్ మ్యూజిక్ వినవస్తుంది.

వింటూ, సిగరెట్ తాగుతూ ఎదురుగా అనంతంగా ఆకాశంలోకి దూసుకుపోతూ కనిపిస్తున్న రోడ్ కేసి చూడసాగాను.

గంట గడిచింది. ఒక్క కారుకూడా రాలేదు రెండు వేపులున్నుండి.

నాకు విచిత్రంగా వుంది. ఇసుక తుఫాను రాబోయే ప్రమాదమున్నప్పుడు మాత్రమే కార్లను ఆపుచేస్తారు. వెనుకనుండి కూడా ఏ విధమైన సంచలనం లేదంటే ఇసుక తుఫాను రాబోతుందేమోననిపించింది.

ఫ్లాస్క్ ఓపెన్ చేశాను. సగందాకా వుంది కాఫీ. జాగ్రత్తగా వాడుకోవడం మంచిదనిపించింది. కొద్దిగా మూతలోనికి వంచుకొని పెదాలు తడుపుకున్నాను. మళ్ళీ యధాతథంగా ఫ్లాస్కు మూత బిగించి పెట్టాను.

తెల్లగా, వెండిలా మెరుస్తున్న ఎండ వున్నట్టుండి ఎర్రగా మారిపోయింది. నా కుడి చెంపమీద దూరం నుంచి ఎవరో సూదులు విసిరినట్లు గ్రుచ్చుకుంటున్నట్లని పించింది.

రానున్న ఇసుక తుఫానుకు ఇది సంకేతమని అర్థం చేసుకోవటానికి నా కెక్కువ టైం పట్టలేదు. గబగబ కారు అద్దాలన్నీ ఎత్తివేశాను. హాండ్ బ్రేక్ కూడా వేసు కుని కూర్చున్నాను.

చెవులు చిల్లులు పడేట్లుగా శబ్దం రాసాగింది. కారు ముందుకూ, వెనక్కూ, ప్రక్కకూ ఊగిపోయింది. ఆ తుఫాను స్పీడుకు అసలు కారు ఎడారిలోకి కొట్టుకు పోతుందేమోనని భయపడ్డాను.

దాదాపు గంటసేపు నా ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని కూర్చున్నాను.

వెలుపల శబ్దం తగ్గింది. వెలుగు ఎరుపు రంగునుండి మెల్లగా, తెలుపు రంగుకు తిరగడం ముందు అద్దంలోంచి గమనించాను. ముందున్న రోడ్ నిండా ఇసుక నిండివుంది. రోడ్ ఎటుందీ చెప్పడానికన్నట్లు అక్కడక్కడా కొన్ని స్తంభాలు నాటివుంచారు.

ఈ గందరగోళంవల్లే చాలామంది ఈ ఎడారి రోడ్ వెంట రావడం మానుకున్నారనుకున్నాను. వేరు త్రోవన పోతే దాదాపు మూడొందల మైళ్ళు ఎక్కువవుతుంది. నేను త్వరగా బొంబాయి చేరుకుందామన్న ఆతృత కొద్దీ ఈ త్రోవన వచ్చాను.

తుఫాను ఆగినట్లనిపించింది. అద్దాలు దించి చూచాను. గాలిలో ఇసుక లేదు.

ఫ్లాస్కు తీసి మెళ్ళో వేసుకున్నాను. బ్రెడ్ లు రెండు చేత్తో పట్టుకున్నాను. తలుపులు బిగించి తాళంవేసి' ముందుకు నడక ప్రారంభించాను.

గాలిలో తేమ లేనందువల్ల, నాలిక పిడచగట్టుకు పోయింది. నా దగ్గరున్న రెండు కప్పుల కాఫీతీసి పట్టుకుని పది ఫర్లాంగులన్నా నడవగలనో లేదోనన్న అనుమానం కలిగింది.

పట్టుదలతో ముందుకు కదిలాను. మనిషి ఎంత ఒంటరివాడో, ఎంత సూక్ష్మజీవో, ప్రకృతి కెంత సులభంగా

బందీ కాగలడో, చూడాలంటే అంతకన్నా వేరే స్థితి అవసరం లేదనిపించింది నాకు.

అడుగులో అడుగు వేసుకుంటూ నడిచాను. తొంభై నిముషాల నడకతో ఐదు మైళ్ళు ముందుకు పోగలిగాను. కనుచూపు మేరలో ఎక్కడా పెట్రోలు బంకు కనిపించ లేదు. ఎదురుగా ఏదో వాహనం వస్తూన్న సూచనలు అంతకన్నా కనుపించలేదు.

భగవంతుడిపైన భారంవేసి, రెండు స్పూన్లు కాఫీ త్రాగి, ఒక రొట్టెముక్క తిని, ముందుకు కదిలాను. జేబులో డబ్బుంది. దాదాపు ఐదువేలు. కానీ దానికీ ఎడారిలో విలువ శూన్యం.

టైం చూసుకున్నాను. సాయంత్రం నాలుగు కావ స్తూంది.

అంటే మరో రెండు గంటల్లో ఆ పెట్రోలు బంకు చేరగలిగితే నాకు బ్రతికే అవకాశమున్నట్లు. అలా కాకుంటే లేనట్లే ననుకున్నాను.

దూరంగా చిన్న గుడిసె లాంటిది కనుపించింది. అదే పెట్రోలుబంకు అయివుండాలనుకున్నాను. ఆ ఆశ నాలో క్రొత్త ఆవేశాన్ని సృష్టించింది. నాకు తెలీకుండానే వేగంగా ముందుకు కదిలాను.

పది నిముషాల నడకతో ఆ ప్రాంతం చేరుకున్నాను.

అదొక చిన్న గుడిసె ఆకారంలో వుంది. అక్కడ పెట్రోలు, డీసిల్ పోసే పంపులున్నాయి. గుడిసె దగ్గ రకు వెళ్ళాను.

## 4

ఆ గుడిసెలో పక్కిమంచంమీద లుంగ చుట్టుకుని ఒక ఆకారం వుంది. మంచంకు కొంచెం దూరంలో టెలిఫోన్ వుంది.

"బాబూ!" పిలిచాను మెల్లిగా.

ఆ ఆకారం కదిలింది. కానీ లేవలేదు.

"ఏయ్ బాబూ! నిన్నే!" అన్నాను.

"పెట్రోలా? డీసెలా?" కళ్ళు తెరవకుండానే, అలాగే పడుకుని అడిగాడు.

"రెండూ కాదు! ముందు టైరు కావాలి!" అన్నాను.

అతను తక్కున లేచి కూర్చున్నాడు. కాళ్ళు మంచం పైనుండి క్రిందకి జారేలా వేసి చేతివ్రేళ్ళతో జుట్టును ఎగదోసుకున్నాడు.

అప్పుడు చూశాను. ఆ వ్రేళ్ళు తెగిపోయినట్లున్నాయి. కాలంతా చీము రక్తంతో తడిసివుంది. అతను కుష్ఠురోగి అని సులభంగా తెలిసిపోయింది. నాక కడుపులో త్రిప్పినట్లయింది.

"ఏమిటీ టైరు కావాలా? టైర్లు ఇక్కడ దొరకవు" అన్నాడు లేస్తూ.

"నా కారు టైరు బరస్ట్ అయింది. ఇక్కడికి దాదాపు పదిహేను మైళ్ళ దూరంలో వుంది కారు. నాకేమిటి?" అడిగాను అతన్ని భయంతో.

"రెండ్రోజులు ఈ రోడ్ మూసేశారు. ఇందాక ఇసుక తుఫాను వచ్చింది" అన్నాడు అతను.

"ఇక్కడ నువ్వొక్కడివే వుంటావా?"

"అఁ!

"నీవు ఆహారం నీళ్ళూ ఎలా?"

"నా దగ్గరున్నాయి. నీకు కావాలా?" అడిగాడు ఆ వ్యక్తి.

కావాలని అందామని పెదవిదాకా వచ్చింది. అతని కాళ్ళు చేతులూ చూచి "వద్దు! నా ఫ్లాస్కులో కాఫీ వుంది. అది చాలు" అన్నాను.

"నిలబడే మాట్లాడుతున్నారు. కూర్చోండి!"

"ఫరవాలేదు. నేనీ ప్రాంతంనుండి బయటపడే మార్గం చూపించు. నీకు ఏంకావాలన్నా ఇస్తాను" అన్నాను. అతను తప్ప నన్ను రక్షించగల దేవుడెవ్వరూ ఆ దరిదాపుల్లో ఇంకెవ్వరూ కనుపించకపోవటంతో.

"ఏదైనా కారొచ్చేదాకా ఆగండి. దాంట్లో ఎక్కించి చెప్పి పంపుతాను."

"రెండ్రోజులు రావన్నావుగా?"

"రావు!"

"మరి అప్పటిదాకా..."

"ఇక్కడే నాతో వుండండి. ఏం భయంలేదు."

అతన్ని చూసి కాదు నాకు భయం. అతని జబ్బను చూసి. ఆ మాట చెప్పాలనిపించింది. అయినా అనవసరంగా విరోధం కొని తెచ్చుకోవడం అవివేకమనిపించి ఆగాను.

లోపల ఫోన్ మ్రోగింది.

అతను ఎత్తుకొని కొన్ని క్షణాలు మాట్లాడాడు. నాకది అర్థంకాలేదు. సంభాషణ చాలాసేపు నడచింది. ఆ తర్వాత అతను ఫోన్ పెట్టేశాడు.

"ఎక్కడున్నుంచి ఆ ఫోన్?" అడిగాను.

"టోల్ గేట్ నుంచి" అన్నాడు.

"ఏమంటున్నారు."

"ఈ రోడ్ పైన మూడుకారులు చిక్కుకుపోయాయట. అవి అవతలివేపుకు వెళ్ళాయా అడిగాడు. రెండు వెళ్ళిపోయాయని చెప్పాను. మూడోది బహుశా మీదయి వుంటుంది. చాలా పెద్ద తుఫాను రేగిందట. ఈ పాటికి మీ కారు ఇసుకలో కూరుకుపోయి వుంటుంది" అన్నాడతను.

"రోడ్ కూడా ఇసుకలో పూడుకుపోతుందా?" అడిగాను ఆశ్చర్యంగా.

"అః! వారానికొకసారి రోడ్ క్లీన్ చేస్తుంటారు."

"ఎలా?"

"స్పెషల్ లారీలున్నాయి. వాటికి రెండువేపులా పారలుంటాయి. అవే ఇసుకను అటూ ఇటూ తోసివేస్తాయి."

"ఆ లారీలు వస్తేగానీ నా కారు మళ్ళీ నాకు దక్కదంటావ్. అంతదాకా ఇక్కడ ఇలా నీతో వుండాల్సిందేనా?" అడిగాను ఏడుస్తూ.

"అంతకన్నా వేరే మార్గం వున్నట్లు నాకు తోచడం లేదు! కూర్చోండి" అన్నాడు అంతదాకా నేను నిలబడి వుండడం గమనించి.

నాకు కాళ్ళు పీక్కుపోతున్నాయి. లాభంలేదని క్రిందే కూలబడ్డాను. ఫ్లాస్కు తీసి కొద్దిగా కాఫీ త్రాగాను.

"నా కివ్వకుండా మీరే త్రాగుతున్నారు. అది అన్యాయం!" అన్నాడు అతను.

"ఈ ఎడారిలో కాఫీ దొరకదు. అది లేకుంటే నా ప్రాణం నిలకదు. అందుకని ఇవ్వలేదు."

"నా దగ్గర కాఫీపొడి, పాలపొడి, నీళ్ళు అన్నీ వున్నాయి. కావాలంటే నిముషంలో కాఫీ చెయ్యగలను" అన్నాడతను.

"నాకొద్దు! నువ్వు చేసుకుని త్రాగు" చెప్పాను.

అంతలో దూరంగా ఏదో కారు హారను వినిపించింది. ఆశగా వెలుపలకు చూశాను.

అంతదాకా అటూఇటూ చూస్తూ కూర్చొని నాతో కబుర్లు చెప్తున్న వ్యక్తి, ఆ శబ్దం రాగానే, లేచి రోడ్ లోకి వెళ్ళాడు.

ఒక నిముషం తర్వాత, పెద్ద జీపొచ్చి నిలిచింది. దాని వీల్ ముందు నలభై సంవత్సరాలున్న మనిషి ఆధునికమైన డ్రస్‌లో కూర్చుని వున్నాడు.

నాతో మాట్లాడిన వ్యక్తి అతనికి వంగి వంగి నమస్కారాలు చేశాడు. జీపు టాంక్ నిండా డీసెల్ పట్టాడు.

మెల్లిగా అతనివేపు వెళ్ళాను.

"నమస్తే!" అన్నాను.

అతనుకూడా నావైపు చూసి "నమస్తే! ఎవరుమీరు? ఇక్కడికెలా వచ్చారు?" అడిగాడు.

నా కథంతా చెప్పుకున్నాను.అతను శ్రద్ధగా విన్నాడు.

"నా కారు ఇసుకలో ఇరుక్కుపోయింది. వెంట తెచ్చుకున్న తిండి అయిపోయింది. ఈ కుష్ఠురోగివాణ్ని చూస్తేనే నాకు భయంగా వుంది. ఏం చెయ్యాలో తోచక తన్నుకులాడుతున్నాను. ఇంతలో మీ జీపు వచ్చింది. మీ రెటు వెళ్తున్నారు" అడిగాను.

"ఎటూ వెళ్ళడం లేదు!" అన్నాడతను తాపీగా ఇండియా కింగ్స్ సిగరెట్ కాల్చుకుంటూ.

"వెళ్ళడం లేదా? మరి జీపులో వచ్చారు." గుర్తు చేశాను.

"అవును. నా బంగళా ఇక్కడికి దగ్గరలోనే వుంది. అప్పుడప్పుడూ వచ్చిపోతుంటాను" అన్నాడతను.

"ఈ ఎడారిలో బంగళా ఏమిటండీ!" నమ్మశక్యంగాక విస్తుపోతూ అడిగాను.

"ఇక్కడ్నుంచి ఇరవై మైళ్ళు కుడివేపుగా వెళ్ళితే, ఎడారిలోనే పెద్ద కొండ వుంది. దానిపైన చక్కటి బంగళా కట్టించాను. అందమైన చెట్లు వేయించాను. ఆ కొండ నానుకొని సన్నని ఏరు పారుతుంది. మాకు కావల

సిన నీళ్ళన్నీ అందులోనుంచి పంప్ చేయిస్తాను. నా బంగళాకు జైనరేటరుంది'' అన్నాడు అతను.

''ఇంతకూ మీ రెవరో చెప్పలేదు!''

''ఈ దేశంలో వున్న ప్రైవేటు ఉక్కు, ఇనుము, అల్యూమినియం, ఫ్యాక్టరీలన్నీ ఎవరివో మీకు తెలుసా?''

''తెలుసు. అమృత్ లాలావి కదూ!''

''అతన్ని మీరు చూశారా?''

''లేదు!''

''నేనే ఆ లాలాని.''

''ఆ లాలా మీరేనా? అయితే ఇంత దేశం వదలిపెట్టి ఈ ఎడారిలో వచ్చి చేరారేం?'' అడిగాను ఆత్రుతను అణచుకోలేక.

''భార్యా, రూపసీ, శత్రుః అన్న నానుడి విన్నారా?'' అడిగాడు లాలా.

''విన్నాను'' అన్నాను.

''నా భార్య అతిలోక సౌందర్యవతి. ఆమె దృష్టి మరొకరిపైన పోకుండా వుండేందుకు, ఆమె నానుండి దూరంగా పోకుండా రక్షించుకునేందుకు నివాసం ఇక్కడ పెట్టాను'' అన్నాడు లాలా.

''మీరు చాలా ఫ్రాంక్ గా మాట్లాడుతారు'' అన్నాను.

''మీతోనే కాదు! నా భార్యతోకూడా ఇలాగే మాట్లాడుతాను. ఇంతకూ మీరేంచేస్తారు'' అడిగాడు లాలా'

''ప్రొఫెసర్ గా పనిచేస్తున్నాను.''

''ఎక్కడ?''

''బొంబాయిలో.''

"ఐ.సి. పెళ్ళయిందా?" అడిగాడు లాలా.

"ఆఁ! ఇద్దరు పిల్లలు కూడానండీ. నా భార్య వేరే ఒక డితో లేచి వెళ్ళిపోయింది. దాంతో ఆడదంటేనే నాకు అసహ్యం పుట్టుకొచ్చింది. వాళ్ళకు దూరంగా వుండడం అలవాటు చేసుకున్నాను" అన్నాను.

ఇలాంటి కట్టుకథ చెప్పడం ఆ క్షణంలో ఎంతో అవసరమనిపించింది. అందగత్తె అయిన భార్య వేరేవాళ్ళ దృష్టిలో పడకుండా వుందేందుకతను ఇంతదూరం వచ్చి వుంటే, నేను నిజమైన కథ చెప్తే దగ్గరకు రానివ్వక పోవడ మటుంచి, ఏ తుపాకితోనో కాల్చి చంపినా చంపగలడనిపించింది.

ఈ కుష్ఠురోగి నుండి దూరంగా వెళ్ళాలంటే 'లాలా' గారికన్నా వేరే దిక్కెవ్వరూ నాకు కనుపించలేదు.

"ఎలాగా రెండ్రోజులన్నా కానిది ఈ రోడ్ బాగు పడదు. అంతదాకా మీరు నా గెస్టుగా వుండటానికి అభ్యంతరం లేదనుకుంటాను." అడిగాడు లాలా.

"మరి, నా కారు సంగతి."

"వాడితో చెపుతాను" అంటూ బంకువాలను పిలిచి ఏదో చెప్పాడు. వాడు తలూపుతూ వుండిపోయాడు.

# 5

జీప్ బయలుదేరింది.

"మీ భార్యతో మీరు ఎన్నేళ్ళు కాపురం చేశారు?" అడిగాడు లాలా.

"ఎన్నో ఎక్కడండీ! ఆరేళ్ళు."

"మీ దాంపత్యం ఎలా వుండేది."

"అప్పట్లో అన్యోన్యంగానే వుండేవాళ్ళం.మధ్యలో ఆ మనిషికేం జబ్బు పుట్టుకొచ్చిందో తెలీదు. తనకన్నా చిన్న

వాడైన ఫ్రాడితో సంబంధం పెట్టుకొంది. నాకు తెలీకుండా నా యింట్లోనే ప్రేమాయణం మొదలైంది. ఒకసారి ఇద్దరూ చిక్కారు. ఘట్టిగా నిలదీసి అడిగాను. సమాధానంగా పిల్లల్ని నా మోహానకొట్టి తనొక్కతే అతని వెంట వెళ్ళిపోయింది'' దీనంగా, దిగులు, బాధ, కోపం జోడించి చెప్పాను అతన్ని నమ్మించాలన్న ఊహతో.

''ఆరేళ్ళపాటు ఆడదానితో సంసారంచేసి, అందులోని సుఖం తెలిసిన మీరు ఆ తర్వాత ఎలా తట్టుకున్నారు?'' అడిగాడు లాలా. ఇది నేను ఎదురుచూడని ప్రశ్న.

''ఆమె వెళ్ళాక పిల్లలతో పెద్ద బాధయిపోయింది. రాత్రింబవళ్ళు వాళ్ళ చాకిరీతోనే సరిపోయింది. నరాలు బాగా వీక్ అయిపోయాయి. గుండె దెబ్బతినింది. డాక్టర్ పరీక్షచేసి, నాకు మగతనం పోయిందన్నాడు. ఎంతో మంది రెండో పెళ్ళికి పిల్లను ఇస్తామన్నారు. కానీ లాభం లేదని నాకు తెలుసు. అందుకని ఏదో చెప్పి తప్పించుకున్నాను.''

''ఆమె మిమ్మల్ని చాలా రకాలుగా దెబ్బతీసిందన్న మాట!'' అన్నాడు లాలా.

''అవునండీ!'' అన్నాను.

లాలా సిగరెట్ తీసిచ్చాడు. కాల్చుకున్నాను.

కారు ఎత్తైన కొండమీదున్న రోడ్ పైన పోసాగింది. రోడ్ కు రెండువైపులా లైట్లు వెలుగుతున్నాయి. పైన లైట్ల వెలుగులో తెల్లగా మెరుస్తున్న భవనం కనిపించింది. లాలా గారి బంగళా అదే అయివుంటుందనుకున్నాను.

మరో ఐదు నిముషాల్లో జీపు బంగళా పోర్టికోలో ఆగింది.

ఇద్దరం దిగాం.

"ఎలా వుంది?" అడిగాడు లాలా.

"ఈ వాస్తు శైలి చూస్తే చాలా పాత భవనంలాగుంది" అన్నాను.

"కరెక్ట్! ఇది మొగలాయి సామ్రాజ్యకాలంలో కట్టింది. ఈ మధ్య నేను కొన్నాను. కొన్నాక రీమోడల్ చేయించాను. హెలికాప్టర్ వచ్చి పోయేందుకు వీలుగా హెలిపాడ్ కూడా వేయించాను" అన్నాడు లాలా.

ఇద్దరం బంగళాలోనికి వెళ్ళాం.

ఆ బంగళాలో మొత్తం మూడంతస్తులున్నాయి. ఇద్దరు పనివాళ్ళు వచ్చారు. మా కోట్లు, బూట్లు వాళ్ళే విప్పారు. క్రిందున్న గదులన్నీ చూపించాడు లాలా.

ఇద్దరం మెట్లెక్కి పై అంతస్తుకు వెళుతున్నాం. పైనుంచి క్రిందకు దిగి రాబోయిన అందమైన స్త్రీ ఒకామె తక్కున ప్రక్కకు తప్పుకుంది. నా ఎక్స్‌రే కళ్ళు ఆ నిముషంలోనే ఆమె అందచందాల్ని, రూపు రేఖా విలాసాల్ని, మనస్సుపై ముద్రకొట్టేశాయి.

లాలా చెప్పింది అతిశయోక్తి కాదు.

ఇద్దరం పై అంతస్తు చేరాం. పైన మొత్తం పన్నెండు గదులున్నాయి. కుడివేపు చివర అతని భార్యగదనీ, దాని ప్రక్కనున్నది తనదనీ చెప్పాడు. ఎడమవేపునున్న ఆఖరిగది నాకు ఇచ్చాడు. అది తెరచి చూపించాడు. అందులో అన్ని ఏర్పాట్లు వున్నాయి.

"చాలా బాగుంది!" అన్నాను.

"తొమ్మిదిన్నరకల్లా క్రిందకు రండి. డిన్నర్ రెడీగా వుంటుంది. అంతదాకా రెస్ట్ తీసుకోండి. మీకేం కావా

లన్నా బెల్ మ్రోగించండి — సర్వెంట్ వస్తాడు” చెప్పాడు లాలా.

“థాంక్స్! ఒక్క కప్పు వేడి టీ త్రాగుతే చాలు. మరింకేం అవసరం లేదు. తిన్నగా డిన్నరుకు వస్తాను” అన్నాను.

“డ్రెస్ ఛేంజ్ చేసుకోండి. మీ గదిలో బీరువా నిండా వున్నాయి బట్టలు. ఏదో ఒక జత సరిపోయి తీరుతుంది. నేను వస్తాను” అన్నాడు లాలా.

“థాంక్స్!” అన్నాను.

“మరోమాట! అవసరం లేకుండా గదిదాటి బైటకు రావద్దు. అది చాలా ప్రమాదకరమైనది” అన్నాడు లాలా.

“అలాగే! నేను వెలుపలకు రావలసిన అవసరమే లేదుగా?” అన్నాను నవ్వుతూ.

## 6

అలా వెళ్ళిపోయాక, గది తలుపులు మూసి కూర్చున్నాను కాసేపు. సిగరెట్ వెలిగించుకొన్నాను.

అంతలో తలుపు తెరుచుకుని ఒక సర్వెంట్ ట్రేలో టీ తెచ్చి, టేబుల్ పైన పెట్టి వెళ్ళిపోయాడు.

లేచివెళ్ళి తలుపుమూసి వచ్చి టీ కలుపుకుని త్రాగాను. ఆ తర్వాత బాత్ రూంలోకి వెళ్ళి స్నానంచేసి వచ్చాను. ఎడమవేపున్న కిటికీ తెరిచాను.

ఎదురుగా తోట కనిపించింది. అందులో ఫ్లోరసెంటు కాంతి పడుతున్నచోట లాలా, అతని భార్య ఉయ్యాల ఊగుతూ కనుపించారు.

అతని ముఖం కిటికీకి ఎదురుగా వుంది. నన్నెక్కడ చూస్తాడోనని భయంవేసి దగ్గరగా వేశాను. సన్నటి

సందు మిగిల్చాను. అందులోంచి చూచాను. ఆమె బాగా కనిపించింది.

నల్లటి పైజామా వేసుకుని, అదేరంగు షర్టు తొడుక్కొంది. షర్టుపై బటన్లు వేయకపోవడంతో ఆమె యవ్వనపు గుర్తులు ఎత్తుగా ఎగిరిపడటం గమనించాను. శంఖం లాంటి తెల్లటి సన్నటి మెడ. సన్నటి పెదాలు. పొడవుపాటి ముక్కు, వెడల్పుగా వున్న కళ్లు. అపర రతీదేవిలా వుందామె. లాలా చెయ్యి ఆమె భుజంపైన ఆమె చెయ్యి లాలా నడుం చుట్టూ వున్నాయి.

ఆమె నెలాగైనా వల్లో వేసుకునే ప్రయత్నం చెయ్యమని నా మనస్సు నన్ను పురమాయించింది. దాని అజ్ఞకు తిరుగులేదు మామూలుగా. తలుపు గట్టిగా మూసి, గబగబ డ్రెస్ చేసుకున్నాను.

కిటికీ తలుపు తొలగించి చూశాను. తోటలో ఎవరూ లేరు. ఉయ్యాల ఖాళీగా వుంది.

గడియారం గబగబ ముందుకు త్రిప్పాను. తొమ్మిదిన్నర దగ్గర ఆపాను.

మెల్లగా గదిలోంచి బైటికొచ్చాను. చిన్నగా అడుగులు వేసుకుంటూ మెట్లదాకా వచ్చాను. ఒక్కొక్క మెట్టే మెల్లగా క్రిందకు దిగసాగాను.

ఆమె మెల్లగా మెట్లెక్కటం చూశాను. పైకి చూస్తూ వస్తూంది. ఆమె కళ్ళలో ఓ రకమైన మెరుపు కనిపించింది. నేను కాస్త కంగారుపడ్డట్లు నటించాను. వెనక్కి పోబోయినట్లు అడుగు తీశాను.

ఆమె స్పీడుగా ముందుకొచ్చింది. అప్పుడు చూశాను. మెళ్ళో రాళ్ళ నెక్లెసు ధగధగలాడుతూంది. జుట్టు చెదరిపోకుండా రిబ్బను కట్టుకొంది.

"మీరేనా ప్రొఫెసర్!" మెల్లగా అడిగిందామె రెండు మెట్లు క్రిందకి దిగి.

అవునన్నట్లు తలూపాను.

"ఎక్కడికి?"

"డిన్నరుకు." రహస్యం చెప్పినట్లు చెప్పాను.

"టైం కాలేదు. ఇంకా గంట టయిముంది."

"నా వాచీ తొమ్మిదిన్నరయింది."

"ఇప్పుడు ఎనిమిదిన్నరే!" అందామె నా దారి కనూ.

"సారీ!" అంటూ వెనక్కి తిరిగాను.

ఆమె ముందూ, నేను వెనకా నడిచాం. నేను చుట్టూ చూస్తున్నాను ఎవరైనా నన్ను గమనిస్తున్నారేమోనని. ఎవ్వరూ నన్ను చూడలేదు. పై అంతస్తు వరండాలోకొచ్చాం యిద్దరం.

"నా గది తెలుసా?" అడిగింది ఆమె నవ్వుతూ.

"ఆఁ! ఆ చివరిదని చెప్పాడు లాలా!" అన్నాను.

"రాత్రి రెండింటికి గడియతీసి వుంచుతాను. నిశ్శబ్దంగా వచ్చెయ్యి. లైట్లు జోలికి పోకు. ఎలా వచ్చావో అలా వెళ్ళిపో!"

"అలాగే! లాలా వుండరా?"

ఉండడన్నట్లు తలూపింది. ఆ తర్వాత వేగంగా ఆమె తన గదికేసి వెళ్ళిపోయింది.

నేను వేగంగా నా గదిలోకి జొరబడ్డాను.

నా ఆనందానికి అంతులేకుండా పోయింది. ఆడ పోయిన తీర్థం ఎదురయినట్లుగా వుంది. ఆమె కోసం ఎంతో ప్రయత్నం చెయ్యాల్సి వుంటుందనీ, నా కున్న

నలభై ఎనిమిది గంటల వ్యవధీ చాలదని అనుకున్నాను. నాలుగేనాలుగు నిముషాల్లో వ్యవహారం తెమిలిపోయింది.

అద్దంలో నన్ను నేను గర్వంగా చూసుకున్నాను.

ఆమె ధైర్యం, సాహసం తలచుకొంటే, పరపురుషుడి పొందుకోసం ఆమె ఎంత తపించి పోతుందీ నాకర్థమయింది. అందులోనూ నాబోటి అందగాడు కంటబడ్డాక అవకాశం జారవిడుచుకోవడం ఆమెకూ ఇష్టం వుండి వుండదనుకున్నాను.

అంతలోనే అనుమానం రేగింది. ఒకవేళ నన్ను పరీక్షించమని లాలా ఉసిగొలిపివుంటాడేమో ననుకున్నాను. ఎంత అనుమానమున్నా, లాలా ఇటువంటి పరీక్షలు పెట్టడనిపించింది.

ఇది పరీక్షే అయితే నేను పట్టుబడడం ఖాయం. అలా పట్టుబడ్డప్పుడు అతను నాకేశిక్ష విధించినా, క్షణాల్లో అమలుజరుగుతుంది. నన్ను నేను రక్షించుకునే దారి ఏదీ లేదు.

ప్రాణాలకు తెగించి ఈ వ్యవహారంలో ముందడుగు వేయాల్సిన అవసరమున్నట్లు ఫీలయ్యాను. అలాగే ఆలోచించుకుంటూ మరోగంట కూర్చున్నాను. ఈ మారు నిజంగా తొమ్మిదిన్నరయింది. వెంటనే లేచి క్రిందకు దిగి వచ్చాను.

నేను డైనింగ్ రూంలోకి ప్రవేశించేసరికే లాలా టేబుల్ ముందున్నాడు.

"కమాన్ ప్రొఫెసర్! టేక్ యువర్ సీట్!" అన్నాడు.

వెళ్ళి కూర్చున్నాను. టేబుల్ నిండా రకరకాల తినుబండారాలున్నాయి. వాట్ని చూశాక నాకు ఎడారిలో వున్నట్లు తోచలేదు.

"రెండు నిమిషాలు వెయిట్ చెయ్యండి. మేడమ్ జాయినవుతుంది" అన్నాడు లాలా.

మేడమ్ వచ్చింది. లాలా ప్రక్కనే నా కెదురుగా కూర్చుంది.

"వీరు ఎడారిలో ఇసుక తుఫానులో చిక్కుకుపోయి వుంటే ఇంటికి తీసుకొచ్చాను. ఇందాక నే చెప్పింది వీరి గురించే" అంటూ నన్ను పరిచయం చేశాడు.

"నా భార్య!" అంటూ నన్నామెకు పరిచయం చేశాడు.

ఆమె నన్ను తెలీనట్లు, నిరుత్సాహంగా "అలాగా!" అనిమాత్రం అంది.

అందరు తినడం ప్రారంభించేశాం.

"ఈయన భార్య ఎవరితోనో లేచిపోయింది" అన్నాడు లాలా తన భార్యతో. నా గురించి ఆమెకు నాముందే అలా చెప్పడం కొంత ఎబ్బెట్టుగా కనుపించింది.

"ఎందుకని?" అడిగింది ఆమె అనాసక్తంగా.

"ఇంకొకడి వల్లో పడిందట."

"రియల్లీ!" నన్నుచూసి అడిగిందామె.

అవునన్నట్లు తలూపాను.

"ఆ తర్వాత ఈయన మానసికంగా బతికిపోయాడు. భౌతికంగా దెబ్బతిన్నాడు. మళ్ళీ పెళ్ళికి పనికిరాకుండా పోయింది ఈయన శరీరం" అన్నాడు లాలా గర్వంగా.

"సారీ!" అంది ఆమె తింటూనే.

"అందరికీ సక్రమంగా సంసారం సాగించే అవకాశాలుండవు డియర్. మనం ఎడారిలో వున్నాం. అయినా మనకేం తక్కువ. అతను బొంబాయిలో వున్నాడు. అతడికేమీ లేదు. ప్రొఫెసర్ మీకు జీవితమంటే విరక్తిలేదా?"

"ఉంది. అరేబియా సముద్రంలో దూకి చద్దామను

కుంటూ వుంటాను. కానీ కళ్ళముందు పిల్లలు తిరుగు తుంటారు. వాళ్ళు అనాథలైపోతారు. నే చచ్చాక వాళ్ళను చూసేదెవరు? వాళ్ళకు చదువు సంధ్యలు, తిండీ బట్టా ఎవరు ఇస్తారు. అందుకోసమే మొండిగా బ్రతుకు తున్నాను'' అన్నాను.

''ఒక లక్ష్యసాధనకు, పవిత్రమైన ధ్యేయంతో మనిషి బ్రతకడం గొప్ప విషయమే. మీకు చావాలనిపించినప్పుడు నాకు చెప్పి చావండి. మీ పిల్లలకు అన్ని వసతులు ఏర్పాటుచేస్తాను'' అన్నాడు లాలా.

''వాట్ డియర్! అతన్ని చావమని మీరెందుకు ప్రోత్సహించడం!'' అడిగింది మేడమ్.

''ప్రోత్సహించడం కాదు! అలా చనిపోయినా ఫరవా లేదని చెప్పాను. అంతే!'' అన్నాడు లాలా.

తినటం పూర్తయింది. ఆ తర్వాత ఆపిల్ జ్యూస్ త్రాగాం.

''ప్రొఫెసర్ గారూ మీరు వెళ్ళండి! రెస్ట్ తీసుకోండి. మేమలా తోటలోకి వెళ్ళివస్తాం!'' అన్నాడు లాలా.

నే లేచేటప్పుడు ఆమె కళ్ళలోకి చూశాను. తను చెప్పినమాట మరచిపోవద్దన్నట్లుగా చూశాయి ఆమె చూపులు.

# 7

మెల్లెక్కి మేడపైకి వచ్చాను. డ్రెస్ మార్చుకుని కూర్చున్నాను.

లాలాగురించే ఆలోచించసాగాను. అతనిలో 'సాడిజం' అంటే అవతలివాళ్ళ బలహీనతల్ని ఎత్తి చూపించి, అవ హేళన చెయ్యడం ఎక్కువగా తోచింది.

నన్ను కించపరిస్తే తప్ప, భార్య ముందు తన గొప్ప తనం అర్థంకాదనుకున్నట్లుగా ప్రవర్తించాడు లాలా. అతనిపైన కసి తీర్చుకోదలచుకున్నాను.

నా ఆలోచనలెటో పోయాయి. తెలీకుండానే కళ్ళు మూతలు పడ్డాయి. నా గదిలో లైటు వెలుగుతూనే వుంది.

ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది.

గబగబ లేచివెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా లాలా కనుపించాడు.

"గంట పన్నెండయింది. ఇంకా లైటు వెలుగుతుంటే ఏం చేస్తున్నావో చూద్దామని వచ్చాను. నిద్రపట్టలేదా?"

"లేదండీ! నిద్రపోయాను. తలుపు చప్పుడయితే లేచాను" అన్నాను.

"వెళ్ళి లైటార్పి పడుకోండి!" అన్నాడు లాలా.

అలాగే అంటూ తలుపులు మూసి లైటు స్విచ్ నొక్కాను. బయట నా గది తలుపులకున్న గొళ్ళెంలాగిన శబ్దం వినిపించింది.

దిక్కుచచ్చిపోయాను.

లాలా అలా ఎందుకు చేసివుంటాడో అర్థంకాలేదు. అతను నా కథ నమ్మకపోవడమన్నా కారణం కావాలి. లేదా నేను, మేడమ్ మెట్లపైన మాట్లాడుకోవడమన్నా చూసివుండాలి. ఈ రెంటిలో ఏదో ఒకటి జరిగి వుంటుం దనుకున్నాను. రెండోది జరిగి వుంటే, అతను ఆమెను తన గదిలోంచి వెలుపలకు వచ్చే అవకాశం కలుగనివ్వడు. ప్రయత్నం చెయ్యవలసిన పరిస్థితిలో లేను నేను.

అంతా మరిచిపోయి ముసుగుతన్ని పడుకోవడంకన్నా వేరే దారి కనుపించలేదు నాకు. అప్పటికే కిటికీలు చెక్

చేశాను. వెంటిలేటర్లు వెతికాను ఏదైనా మార్గం దొరుకు తుందేమోనని. అన్నింటికీ తగిన అడ్డంకులున్నాయి.

నా గదిలో నన్ను బందీగా పెట్టాడు లాలా.

అతిథిపైన అంత అపనమ్మకం భార్యమీద అంత అను మానం వున్న వ్యక్తిని ఇంతకుముందు నేను చూడలేదు. ఒకవేళ చూసినా, ఇంత బరితెగించి ప్రవర్తించగలగడం, ఒక్క లాలాకే సరిపోయిందనుకున్నాను.

నాకు కోమలి గుర్తుకొచ్చింది. ఇసుక తుఫాను, నా కారు, నడక, పెట్రోలు బంకులో కష్టురోగి, అన్నీ గుర్తొ చ్చాయి.

పాత అనుభవాలు నెమరువేసుకుంటూ పడుకున్నాను. నన్ను నిద్ర ఆవహించింది. అలానే నిద్రపోయాను.

చాలా సేపటి తర్వాత ఎవరో నా మంచంపైన కూర్చొని చేతి వేళ్ళతో నుదుట్ని, తల వెంట్రుకలను సర్దుతున్నట్లు లీలగా అనిపించింది. కలేమోననుకొన్నాను.

నా శరీరానికి వెచ్చగా ఇంకో శరీరం తగిలింది. కరెంటు షాకు తగిలినట్లయింది. ఠక్కున లేచి కూర్చు న్నాను. గదంతా చిమ్మచీకటి నిండిపోయింది. ఆ చీకట్లో ధగధగ మెరుస్తున్న రాళ్ళ నెక్లెను మాత్రం కనిపించింది.

"ఎలా వచ్చావ్?"? " అడిగాను మెల్లగా.

"ష్!" నన్ను మాట్లాడవద్దన్నట్లు తన చేతులతో నా నోరు మూసింది. ఆమెను నా కౌగిట్లోకి లాక్కు న్నాను.

"లాలా చూడలేదా?" అడిగాను ఆత్రుతగా.

"ఉష్!" అంది మాటలు అవసరం లేదన్నట్లు.

ఇక ప్రశ్నలువేసి లాభం లేదని నేనూ ముగించు కున్నాను. నా గదిలో ఆమె దాదాపు గంటపైనే వుంది.

నేనామె బుగ్గలు కొరికాను. గాయమైంది కాబోలు "అబ్బా!" అనిమాత్రం మెల్లగా అంది బాధను అదిమి పెట్టుకుని.

"సారీ! ఎక్సయిట్ అయ్యాను" అన్నాను.

"ఉఫ్!" అంది మళ్ళీ.

ఆమె మెడ తడిమాను. నెక్లెసు పట్టుకుని చూశాను. ఆమె నా కోరిక అర్థంచేసుకుందో ఏమో వెంటనే నెక్లెను తీసి ఇచ్చేసింది. బట్టలు సర్దుకొని గదిలోంచి లేచి వెళ్ళి పోయింది.

నెక్లెసుతీసి దిండు క్రింద పెట్టుకొని పడుకున్నాను నేను. ఆ తర్వాత హాయిగా నిద్రపోయాను.

# 8

తలుపు తీసిన చప్పుడయితే లేచాను. ఎదురుగా సర్వెంట్ కాఫీ ట్రేతో వచ్చి నిల్చున్నాడు. టైం చూశాను. ఎనిమిదయింది. కిటికీలోంచి ఎండ గదిలో పడు తూంది.

కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ త్రాగాను. దిండు పైకెత్తి చూసుకున్నాను. నెక్లెను కనిపించింది. అంటే రాత్రి జరిగింది కలకాదనీ, నిజమనీ అర్థమయిపోయింది.

లాలా నన్ను ఆత్మహత్య చేసుకోమన్నాడు. ఈ నెక్లెను పార్సిలు చేరాక చూసి అతనే పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకుంటాడనుకున్నాను కసిగా.

గదిలోవున్న ఇంటర్ కామ్ ఫోను మోగింది. లేచి అందుకున్నాను. "హల్లో! ప్రొఫెసర్! గుడ్ మార్నింగ్!" అన్నాడు లాలా.

"మార్నింగ్ సార్!" అన్నాను నేను.

"రాత్రి బాగా నిద్ర పట్టిందా?"

"ఆఁ! మొద్దునిద్ర పోయాను."

"మీకోసం మేమంతా వెయిట్ చేస్తున్నాం. రండి. బ్రేక్ ఫాస్ట్ రెడిగా వుంది."

"వచ్చేస్తున్నాను!" అంటూ ఫోన్ కట్ చేసి వెలుపలికొచ్చాను.

టేబుల్ దగ్గిరకెళ్ళేసరికి లాలా కూర్చుని వున్నాడు. చుట్టూ సర్వెంట్స్ నిలుచున్నారు.

"మేడమ్ రాలేదా?" అడిగాను.

"ఆమెకూడా మీలాగే మొద్దునిద్ర పోయిందట" అన్నాడు లాలా.

అంత సుఖం రుచిచూశాక నిద్రరాక మరేమొస్తుందని లోలోపలే అనుకున్నాను.

ఆ తర్వాత మేడమ్ వచ్చి కూర్చుంది నా కెదురుగా.

"నాకోసం ఎందుకు వెయిట్ చేశారు? మీరు ప్రారంభించకపోయారా?" అంది మేడమ్ న్యాప్కిన్ను చేతికి తీసుకుంటూ.

ఆమెకేసి నిశితంగా చూశాను. బుగ్గలు మామూలుగా వున్నాయి. ఆమె మెడ పరిశీలించాను. రాళ్ళ నెక్లెస్ ధగధగ మెరసిపోతూంది. ఆ రెండూ చూశాక నాకు మతిపోయింది.

ఆమె నాకు రాత్రి నెక్లెస్ ఇచ్చింది. మళ్ళీ అదే మెడలో కనిపిస్తూంది. ఎలా సాధ్యం! నేను గదిలోంచి వచ్చాక ఆమె వెళ్ళి, తలగడ క్రిందదాచిన నెక్లెస్ తీసుకుందేమోననుకున్నాను.మరి బుగ్గలమీద గాయం కావాలి. అలాంటిదేమీ కనుపించలేదు. గాయాలు కన్పించకుండా ఏదైనా లోషన్సు, క్రీమ్లు వున్నాయేమోలేనని సర్ది చెప్పుకున్నాను.

టేబిల్ ముందుకు రాబోయే ముందున్న ఉత్సాహం, వచ్చాక చచ్చిపోయింది నాకు.

టిఫెన్లు పూర్తిచేసి కాఫీ త్రాగుతున్నాం.

“ప్రొఫెసరుగారూ! మనం వెళ్ళి మీ కారు సంగతి ఏమైందో చూసివద్దామా?” అన్నాడు లాలా.

“వెళ్దాంసార్!” అన్నాను.

“అయితే పదండి” అన్నాడు లాలా.

“ఇప్పుడే వస్తాను. తాళాలు పైనున్నాయి. తీసుకుని వస్తాను” అంటూ జవాబుకోసం చూడకుండా మెట్లెక్కి వెళ్ళాను నా గదికి.

తలగడ ఎత్తి చూశాను. రాళ్ళ నెక్లెసు భద్రంగా వుంది. దాన్ని యథాస్థానంలో వుంచేశాను. ఆమెకు అలాంటి నెక్లెసులే రెండు వుండుంటాయి. ఒకటి నాకిచ్చింది. రెండోది తను వేసుకొచ్చింది అనుకున్నాను.

క్రిందికి దిగివచ్చాను. లాలా ఒక్కడే నిలుచుని వున్నాడు నాకోసం.

“రెడీయా?” అడిగాడు.

“రెడీయే!” అన్నాను.

ఇద్దరం పోర్టికోలో వున్న జీప్ ఎక్కాం. జీపు రివ్వుమని దూసుకుపోయింది.

## 9

మేము మళ్ళీ తిరిగొచ్చేసరికి గంట ఒకటయింది. రాగానే భోజనాలకు కూర్చున్నాం.

“కారు సంగతి ఏమయింది?” అడిగింది మేడమ్.

“అంతా తీయించాను. మనదగ్గర స్పేర్ టయిర్ వుంటే ఇచ్చాను. దాన్ని ఫిట్ చేసి పెట్రోలుపోసి, ఈ రాత్రిలోగా తెచ్చి వుంచుతానన్నాడు పెట్రోలుబంకు

వాడు. ప్రొఫెసర్ గారు రేపుదయం వెళ్ళిపోతారు" అన్నాడు లాలా.

"లాలాగారూ! వాడిచేతులూ కాళ్ళూ కుష్ఠుపట్టి వున్నాయి. టైర్ మార్చగలడంటారా?" అన్నాను.

"మా కార్లు, జీపులు రిపేరుచేసేది వాడే!"

"నాకు కుష్ఠురోగులంటే భయమండీ! ఆ వ్యాధి అంటే పరమ అసహ్యం. నిన్న వాడు కాఫీ త్రాగమనీ, మంచి నీళ్ళు త్రాగమనీ పదేపదే అడుగుతుంటే, భయం పుట్టు కొచ్చింది. అది అంటువ్యాధి. మనకు అంటుకుందంటే చచ్చామే!" అన్నాను.

"అవును" అన్నాడు లాలా.

మేడమ్ మా మాటలు మౌనంగా వింటూ భోజనం చెయ్యసాగింది.

"ఈ వ్యాధి తొందరగా ఎవరికొస్తుందో తెలుసా?" అడిగాడు లాలా.

"తెలీదు" అన్నాడు.

"కుష్ఠురోగం వున్న స్త్రీ పురుషులు ఒకరితో ఒకరు సంభోగించినప్పుడు. అందుకే ఇది ఎక్కువగా అడుక్కు తినిబ్రతికే మనుష్యుల్లో ప్రబలుతుంది. ఇంకోరకం విపరీతంగా స్త్రీవ్యసనంలో పడినవాళ్ళకూ" అన్నాడు లాలా.

"మీరుకూడా దీనిగురించి చాలా రిసెర్చి చేసినట్లున్నారే!" అన్నాను.

"ఏదో పత్రికల్లో చదివిన విషయాలు. ఋషికేశీలో వాళ్ళకోసం ఇరవై లక్షలుపెట్టి మా ఆవిడ పేరుపైన ఒక పెద్ద హాస్పిటల్ కట్టించాను" అన్నాడు లాలా.

"గుడ్! మీకు సాంఘిక సేవా నిరతి వితరణ వున్నాయన్నమాట" అన్నాను.

అందరం భోజనాలు ముగించుకున్నాం. ఎవరి గదులకు వాళ్ళం వెళ్ళాం. నేను సాయంత్రందాకా రెస్ట్ తీసుకున్నాను.

ఏడింటికల్లా గదిలోకి వచ్చాను. సర్వెంట్ తెచ్చిన టీ త్రాగాను. జేబులోవున్న రాళ్ళ నెక్లెస్ తీసి చూసుకున్నాను.

ఎనిమిదింటికి ఫోన్ మ్రోగింది.

రిసీవరు పైకెత్తి "హలో!" అన్నాను.

"రాత్రిలాగే వస్తాను! సిద్ధంగా వుండు" అందామె ఫోన్‌లో.

"ఓ.కే! నీకు రాళ్ళ నెక్లెసులు ఎన్ని వున్నాయి" అడిగాను.

అప్పటికే అవతలివేపు ఫోన్ పెట్టేసినట్లు క్లిక్‌మన్న శబ్దం అయింది. నేను ఫోన్ చేసేందుకు వీలులేదు. ఆమె గది నెంబరు నాకు తెలీదు. ఖర్మకాలి నా ఫోన్ కాస్తా తిన్నగా లాలాగారి గదికి వెళ్ళిందంటే రహస్యం బైట పడుతుందని భయపడి కూర్చున్నాను.

ఆ రోజుకూడా తొమ్మిదిన్నరకల్లా భోజనాలు చేశాం.

"మీ కారు సిద్ధంగా వుందని ఫోన్ వచ్చింది. తెల్లవారాక వెళ్తారా?" అడిగాడు లాలా.

"ఆఁ!" అన్నాను.

"మాతో ఈ రెండ్రోజులు గడిపినందుకు ఆనందంగా వుంది. ఈ మారు ఇటుప్రక్క రావడం జరిగితే మరచిపోకుండా వచ్చిపోండి. మీకోసం మా యింటి తలుపులు తెరచే వుంచుతాం!" అన్నాడు లాలా.

"అలాగే!" అన్నాను.

"థాంక్స్!" అంటూ లేచాడు లాలా. ఆమె కూడా అతని వెంట గార్డెన్‌లోకి వెళ్ళిపోయింది.

నేను మెట్లెక్కి నా గదికి వెళ్ళాను. ఒక పుస్తకం కనుపిస్తే చదువుకుంటూ పడుకున్నాను. ఒంటిగంటదాకా నిద్ర పట్టనే లేదు. ఆ తర్వాత లైట్లారిపోయాయి. జెనరేటరు ఆగిపోయిందేమోననుకుని పుస్తకం పక్కనపెట్టి పడుకున్నాను. అనుమానం వచ్చి కిటికీ దగ్గరకు వెళ్ళి వెలుపలకు చూశాను. తోటలో లైట్లు వెలుగుతున్నాయి.

అంటే ఇంటికున్న కనెక్షను చెడిపోయి వుండాలనుకున్నాను. ఈ రాత్రికూడా ఆమెను చూచే అవకాశం నాకు బహుశా దొరకదేమోననిపించింది. కళ్ళు మూసుకుని పడుకున్నాను.

# 10

తలుపు మెల్లగా తెరచిన శబ్దం అయింది. లోపల కాలి అడుగుల చప్పుడయింది. లేచి కూర్చున్నాను. వెంటనే తలుపులు మూసుకుపోయాయి. తుదకు నా దగ్గరకు వచ్చి మంచంపైన కూర్చుంది.

"ఇవాళంతా నన్ను ఎరగనట్లే నటించావ్?" అడిగాను మెల్లగా.

"ఉష్!" అంది.

దగ్గరకు లాక్కున్నాను.

ఆ చీకట్లో మేమిద్దరం కలసిపోయాం.

ఐదు నిముషాల తర్వాత విడివడ్డాం.

"నిన్ను దగ్గరగా చూడాలని వుంది!" అన్నాను.

"ఉష్!" అందామె మళ్ళీ.

ఆమె మెడకేసి చూశాను. నెక్లెస్ లేదు.

"నెక్లెసు వేసుకురాలేదేం!" అడిగాను.

ఆమె మాట్లాడలేదు.

"రేపు వెళ్ళిపోతున్నాను" అన్నాను.

ఆమె బాధపడుతుందేమో ననుకున్నాను. అలాంటి దేమీ కనిపించలేదు.

"థాంక్స్! వస్తాను" అంటూ కదలింది గదిలోంచి. ఆమె కన్నా రెండడుగులు ముందుకు వేసి స్విచ్ ఆన్ చేశాను.

లైటు వెలిగింది.

ఆ వెలుతురులో ఆమెను చూశాను. చూడగానే నోట మాట రాలేదు నాకు.

ఆమె మేడమ్ కాదు. అచ్చం లాగే ఎత్తూ, లావూ వుంది. కాళ్ళ వేళ్ళూ, కనుపించకుండా సాక్స్. చేతి వేళ్లు కనుపించకుండా గ్లౌవ్స్ వేసుకుంది. అది నేను గుర్తించలేక పోయాను.

"అవెందుకు?" అడిగాను.

చేతి గ్లౌవ్స్ తీసి చూపించింది. ఆమె వేళ్ళు తెగి వున్నట్లున్నాయి.

ఆమె కుష్ఠురోగి అని తెలుసుకోవడానికి నాకు ఎక్కువ టైం పట్టలేదు. నా నెత్తిన పిడుగులు పడ్డట్లయింది.

"నువ్వెవరు?" గర్జించాను.

"లాలాగారి అమ్మాయిని. నాకోసం అమ్మా నాన్న సిటీకి దూరంగా వచ్చి వున్నారు. నాకు మగవాళ్ళంటే పిచ్చి. ఎవ్వరూ పెళ్ళాడరు. అప్పుడప్పుడు నీలాంటి వాళ్ళు వస్తారు. పోతారు."

"ఈ విషయం మీ అమ్మకూ నాన్నకూ తెలుసా?"

"ఊఁ! మా అమ్మదని చెప్పే బెడ్ రూం నాదే!" అంది ఆ అమ్మాయి.

నాకు ఒంట్లోని రక్తమంతా ఎరుపురంగునుంచి నలుపు రంగుకు తిరిగిపోయినట్లు, కాళ్ళూ చేతులూ తెగిపోయినట్లు ఫీలయ్యాను. కుప్పలా కూలబడుతూ "ఇది మోసం?" అన్నాను.

"నీది! మగతనం లేదని చెప్పావుట. మోసంకాదా?" అంటూనే లైటార్పి ఆమె గదిలోంచి వెళ్ళిపోయింది.

పెట్రోలు బంక్ వాడు ఫోన్ లో మాట్లాడింది, ఆ వెంటనే లాలా వచ్చి నన్ను తీసుకురావడం గుర్తొచ్చాయి. ఇదంతా ప్లాను ప్రకారం జరుగుతున్నదని అర్థమయిపోయింది.

అయినా నేను చెయ్యగలిగిందేమీ లేదు. నా రక్తంలో విషంచుక్క కలిసిపోయింది. జీవితమంతా దేన్ని చూసి భయపడ్డానో అదే నా శరీరంలో ఎక్కి కూర్చుంది. అలాగే పడిపోయాను.

—: ఐపోయింది :—

# ఏడుగురు దొంగలు!!

అజీజ్

"ఇన్నాళ్ళూ మనం చేసినవన్నీ చిన్న చిన్న నేరాలు. తడవకి పదివేలకన్నా ఎక్కువ సంపాదించలేకపోయాం! అందులో మళ్ళీ ఐదు వాటాలు! అప్పుడప్పుడూ జైలు కటకటాలు! ఎన్నాళ్ళీ ముతక బతుకులు?

అందుకే, ఈసారి తీవ్రంగా ఆలోచించి, అనేక అవస్థలు పడి, అత్యంత పటిష్టమైన ఓ పథకం అల్లాను. అది నిర్విఘ్నంగా పారిందంటే, మనకెంత గిట్టుబాటవుతుందో తెలుసా?" అన్నాడు అంబాదాస్ తనమిత్రులను చూస్తూ.

అంతవరకూ కుర్చీలో కునికిపాట్లు పడుతున్న రజాక్ ఉలిక్కిపడి, "ఎంత?" అని అడిగేడు.

"ఏభై లక్షలు!"

"బ్రేవ్" నోరు తెరిచాడు సుందర్‌సింగ్. కర్ణన్, అబ్రాహాంకూడా ఆశ్చర్యంగా చూశారు.

"ఇంతకీ పథకంఏమిటి?" అడిగేడు అబ్రాహాం సిగరెట్ అంటిస్తూ.

"చెవులు రిక్కించుకు వినండి! రేపు మధ్యాహ్నం రెండున్నర గంటలకు మనం ఐదుగురం కలిసి, పట్టపగలు మౌంట్ రోడ్డులోని నేషనల్ బ్యాంక్ దోచుకో బోతున్నాం!"

ఏదో విట్టువిన్నట్టు పకపక నవ్వేడు కర్ణన్. "నీకు పిచ్చిగానీ పట్టలేదుకదా? పథకమంటే ఇంకేమో అనుకున్నాను. పట్టపగలు నేషనల్ బ్యాంక్ దోచుకోడమే! ఇదేమైనా బొమ్మలాటనుకున్నావా? లేక, తెలుగు క్రైమ్ పిక్చర్ మాదిరి దోపిడీ అనుకున్నావా?

ఆ బ్యాంకు సంగతి నీకు తెలీదా? వాల్ట్ రూంలో ఎల్లప్పుడూ ఇద్దరు గార్డ్సు రైఫిళ్ళతో సహా కాపలా కాస్తుంటారు. అంతేకాదు. వాల్ట్ లోపల ఓ అలారమ్ పుష్ కూడా ఉందిట.

ఏదైనా ప్రమాదం ముంచుకొస్తే, ఆ పుష్‌బటన్ వత్తిన మరుక్షణం మౌంట్ రోడ్ పోలీస్ స్టేషన్‌లో అలారం మోగుతుంది. మరు నిమిషంలోనే పోలీసులు బ్యాంకును చుట్టుముట్టేస్తారు!"

"తెలుసు! ఆ సమస్య అన్నిటికీ పరిష్కార మార్గాలు ఆలోచించే, పథకాన్ని మీ ముందుంచుతున్నాను. ముందవి చూడండి!" అంటూ జేబులోంచి అరంగుళాల పొడవున్న ఓ గ్యాస్ ట్యూబూ, మడతపెట్టిన కొన్ని కాగితాలూ తీసి బల్లమీదుంచేడు అంబాదాస్.

గ్యాస్ ట్యూబ్ ఎత్తి మిగతా నలుగురికీ చూపుతూ_ "ఇందులో అత్యంత శక్తివంతమైన క్లోరోఫైడ్ గ్యాస్ నింపి వుంది. దీన్ని నేలకేసి కొట్టిన మరుక్షణం ట్యూబ్ పగిలి, గ్యాస్ బైటికొస్తుంది. ఎటువంటివారైనా క్షణంలో నేలకొరిగి మూర్ఛపోతారు!" అంటూ ఆ ట్యూబ్ బల్ల

మీద పెట్టేసి, కాగితాలందుకున్నాడు అంబాదాస్.

వాటి మడత విప్పి, అబ్రాహాంవైపు చూసేడు.

"నువ్వీ కాగితాలని క్షుణ్ణంగా పరిశీలించి అవగాహన చేసుకోవాలి. ఇవి ఆ బ్యాంకు ఎలక్ట్రిక్ సర్క్యూట్ బ్లూప్రింట్లు!

ఇవి లేకుండా మన పథకం అమలుజరపడం అసంభవం! వీటిని సంపాదించడానికి నేనెన్ని అవస్థలు పడ్డానో ఆ భగవంతుడికే తెలుసు. వీటిద్వారా ఆ బ్యాంకులో ఫ్యూజ్ బోర్డులెక్కడున్నాయో, అవి దేనికి సంబంధించినవో, ఏ వైరు ఎక్కడి కళ్తుందో స్పష్టంగా తెలుసుకోవచ్చు...

ఇహ నా పథకం ఏమిటో జాగ్రత్తగా వినండి:

బ్యాంకు 'వాల్ట్' రెండో అంతస్తులో వుంది. వర్కింగ్ అవర్స్‌లో అది తెరిచే వుంటుంది. ఆ గది మొత్తం ఎయిర్‌కండిషన్ చెయ్యబడింది, అగ్నిప్రమాదం సంభవించకుండా!

అక్కడ ఇద్దరు క్యాషియర్లు కూర్చుని డబ్బు లావాదేవీలు చూస్తుంటారు. వాళ్ళకు సహాయకారిగా ఓ కంప్యూటర్ కూడా వుంటుందక్కడ. వాల్ట్ రూంను కాపాడటానికి అది తెరిచున్నంతసేపూ, ఇద్దరు గార్డులు ఎల్లవేళలా లోపలుంటారు.

మధ్యాహ్నం రెండు గంటలకి బ్యాంకు బిజినెస్ కట్టెయ్యబడుతుంది. లోపల ఉద్యోగులు మాత్రం తమ తమ పనుల్లో నిమగ్నమై వుంటారు.

సరిగ్గా రెండుగంటల పదిహేను నిమిషాలకి అబ్రాహాం-ఎలక్ట్రికల్ డిపార్ట్‌మెంట్ మెకానిక్ యూనిఫాంలో, బ్యాంకులో అడుగుపెడతాడు.

సాధారణంగా ఆ బ్యాంకులో అడపాదడపా ఏదో ఒక ఎలక్ట్రిక్ డిఫెక్టు వస్తూనే వుంటుంది. వాళ్లు కార్పొరేషన్‌కు ఫోన్ చేసి, ఎలక్ట్రిషియన్లని పిలుస్తూనే వుంటారు. ఎలక్ట్రిషియన్ రాగానే బ్యాంకు ప్రవేశద్వారం ముందు నిల్చునే గూర్ఖా అతన్ని లోనికి తీసికెళ్ళి ఫ్యూజ్ బాక్స్ చూపిస్తాడు. లేదా, ఫ్యాన్ కప్పగిస్తాడతన్ని!

అబ్రాహాం పనల్లా — ఈ బ్లూప్రింట్స్ సహాయంతో సరిగ్గా రెండు గంటల ముప్ఫై నిమిషాలకు, వాల్ట్ రూం ఏర్‌కండీషనర్ కరెంట్ సర్క్యూట్ కట్ చెయ్యాలి! తరవాత, ఐదు నిమిషాల వ్యవధి ఇచ్చి, వాల్ట్ రూంలో వున్న కంప్యూటర్ సర్క్యూట్ కట్ చెయ్యాలి. దాంతో అది పని చెయ్యడం ఆపేస్తుంది. అది ఐ.బి.ఎమ్ కంపెనీ తయారుచేసిన కంప్యూటర్ ...

ఆ రెండు సర్క్యూట్‌లూ కట్ చేసిన అరగంట తరవాత, అంటే సరిగ్గా మూడు గంటలకు కట్ చేసిన ఏర్‌కండీషన్ సర్క్యూట్‌ను తిరిగి కలిపెయ్యాలి. అబ్రాహాం జెయ్యవలసిన పని ఇంతే!

ఇక మిగతావాళ్ళ డ్యూటీ—

సరిగ్గా రెండుగంటల ఇరవైఐదు నిమిషాలకు నేనూ, కరణ్, రజాక్, సుందర్‌సింగ్ ఓ స్టేషన్ వ్యాగన్‌లో, బ్యాంకు వెనకవైపు గేటుగుండా లోనికి ప్రవేశిస్తాం!

ఆ గేటు పక్కనే చిన్న కుటీరం వుంది. అందులో ఓ ముసలి వాచ్‌మెన్ ఎప్పుడూ డ్యూటీమీదుంటాడు. మన మందరం ఐ.బి.ఎమ్ కంపెనీ మెకానిక్స్ యూనిఫారాల్లో వుంటాము.

ఆ వ్యాన్ లోపల ఓ పెద్దసైజు కార్డ్‌బోర్డ్ పెట్టె వుంటుంది. దాని నాలుగువైపులా, ఐ.బి.ఎమ్ కంప్యూటర్

అని రాసివుంటుంది. నిజానికందులో వుండేది కంప్యూటర్ కాదు! రెండు గ్యాస్ మాస్క్‌లూ, రెండు లోడెడ్ రివాల్వర్లూ!

వ్యాన్ బ్యాంకు వెనక కంపౌండ్‌లో ఆగగానే, సుందర్ సింగ్, రజాక్, కర్ణన్ దిగి వ్యాన్ వెనక తలుపు తెరుస్తారు. తరవాత, కర్ణన్ అక్కడ కాపలా వుండే వాచ్ మెన్ దగ్గరికెళ్ళి, బ్యాంకులోని కంప్యూటర్ చెడిపోయిందనీ, వెంటనే కొత్త కంప్యూటర్ తీసుకురావలసిందిగా బ్యాంకు మేనేజర్ ప్రసాదరావు తమ కంపెనీకి ఫోన్ చేశారనీ, కొత్తకంప్యూటర్ తెచ్చామనీ చెప్పాలి!

సరిగ్గా అదే క్షణంలో బ్యాంకు లోపల అబ్రాహాం! కంప్యూటర్ సర్క్యూట్ కట్ చేసుంటాడు. వాచ్ మెన్ సందేహ నివృత్తికోసం, వాల్టరూంకు ఫోన్ చేసి కనుక్కుంటాడు, కంప్యూటర్ నిజంగా పాడయిందా అని!

ఔనని జవాబు వస్తుంది. దాంతో అతనికి మనమీద నమ్మకం ఏర్పడి, ఆ పెట్టె లోనికి తీసి కెళ్ళడానికి అనుమతిస్తాడు. కర్ణన్ అక్కడే అతనితో కబుర్లాడుతూ నిల్చుండిపోతాడు.

సుందర్ సింగ్, రజాక్ ఇద్దరూ కలిసి, ఆ పెట్టె మోసుకుంటూ బ్యాంకులో ప్రవేశించాలి. మెట్లెక్కి రెండో అంతస్థులో వున్న వాల్టరూం చేరుకోవాలి.

అక్కడ సుందర్ సింగ్ పెట్టెమూత తెరిచి, మెరుపులా అందులోవున్న రివాల్వర్ బైటికి తీసి, కేషియర్లనూ, గార్డులనూ చేతులు పైకెత్తించాలి.

ఆలోగా, రజాక్ గ్యాస్ మాస్క్ మొహానికి తొడుక్కుని, తన రివాల్వర్‌తో అందర్నీ కవర్ చేస్తూ నిల్చుంటాడు. ఆ వ్యవధిలో సుందర్ సింగ్ కూడా మాస్క్

తొడుక్కుని, గ్యాస్ ట్యూబ్ ను నేలకేసి కొడతాడు.
మరుక్షణం వాల్ట్ రూం గ్యాస్ తో నిండిపోతుంది.
కేషియర్లూ, గార్డులూ కిందకూలి మూర్ఛపోతారు. ఆ తరవాత మీరిద్దరూ సాధ్యమైనంత త్వరగా పెట్టెలో నోట్లకట్టలు నింపుకుని బైటపడాలి.

అదే క్షణంలో అబ్రాహాం వాల్ట్ రూం ఏర్ కండిషనర్ సర్క్యూట్ తిరిగి కలిపేస్తాడు. ఏర్ కండిషనర్ తన పని ప్రారంభించగానే,లోపలి గ్యాసంతా బైటికెళ్ళిపోతుంది.
మీరిద్దరూ గ్యాస్ మాస్కులు తీసిపడేసి, రివాల్వర్లు జేబుల్లో వేసుకుని, పెట్టెతో బైటపడాలి. బైట నిల్చున్న వాచ్ మెన్ మీరా పెట్టెలో చెడిపోయిన కంప్యూటర్ తెస్తున్నారేమో అనుకుని, దాన్ని తెరిచిచూసే ప్రయత్నం చెయ్యడు!

మీరు తిన్నగా పెట్టెని వ్యాన్ లో పెట్టేసి, తలుపు లాక్ చెయ్యాలి. ఆ తరవాత, మన మక్కుణ్నించి అదృశ్యం కావడానికి క్షణం పట్టదు.
ఇదీ పథకం! ఇందులో ఒక్కొక్క క్షణం అతి విలువైనది. పనులన్నీ ఫిక్సెడ్ టైమింగ్ లో జరిగిపోవాలి.
ఇందులో ఎవ్వరికైనా సందేహాలుంటే, ఇప్పుడే క్లియర్ చేసుకోడం మంచిది'' అన్నాడు అంబాదాస్.
''మా నలుగురికీ నాలుగు పనులైతే కేటాయించావ్, మరి నీ డ్యూటీ ఏమిటి?'' అడిగేడు రజాక్.

''నేను వయసులో మీకన్నా పెద్దవాణ్ని. పైగా గుండెజబ్బు గలవాణ్ని. ఏకాస్త ఎక్సైట్ మెంట్ కు గురైనా, ఏ కాస్త బరువెత్తడానికి ప్రయత్నించినా గుండెలో పోటు వస్తుంది!

అందుకే, నేను వ్యాన్ డ్రైవర్‌గా వ్యవహరించాలను కుంటున్నాను. ఫాస్ట్ డ్రైవింగ్‌లో నాకున్న ప్రావీణ్యం గురించి మీ అందరికీ తెలుసు! పథకం పారగానే, డబ్బుతోసహా మిమ్మల్ని సురక్షితంగా ఇక్కడికి చేర్చడం నా బాధ్యత!'' అన్నాడు అంబాదాస్.

''ఆల్ రైట్! ఇంతకీ వాల్ట్ రూంలో ఏర్ కండిషన్ దేనికి ఆఫ్ చేయాలంటావు?'' అడిగాడు అబ్రాహాం.

''ఎందుకంటే, చల్లని ప్రదేశాల్లో ఆ గ్యాస్ వెంటనే ప్రభావం చూపదు. ఏర్ కండిషనర్ వల్ల రూంలో వేడి అతి తక్కువగా వుంటుంది గనక, దాని ప్రభావం చాలా ఆల స్యంగా జరుగుతుంది!''

''ఓ.కే! మనం అనుకున్న ప్రకారం అంతా సవ్యంగా జరిగితే మంచిదే. ఖర్మగాలి ఏదైనా ముప్పు ముంచుకొస్తే ఎలా ఎదుర్కోవాలి? అడిగేడు సుందర్ సింగ్.

అంబాదాస్ పలకలేదు. జేబులో చెయ్యిపెట్టి, నెమ్మ దిగా పిస్తోలు బైటికి తీసి, ''ఇలా!'' అన్నాడు.

''అంటే, మేమక్కడ రక్తపాతం జరపడానిక్కూడా వెనకంజ వెయ్యొద్దంటావ్?''

అంబాదాస్ నవ్వి-''రక్తపాతం జరపడం నీకు కొత్త కాదుకదా? ఆc, ఇప్పటికే రాత్రి చాలా పొద్దుపోయింది. వెళ్ళి పడుకోండి. రేపుదయం తొమ్మిదిగంటలకల్లా వచ్చె య్యండి. ఒకసారి అన్ని విషయాలూ మళ్ళీ చర్చించుకో వచ్చు'' అన్నాడు.

అందరూ లేచి నిల్చున్నారు. వాళ్ళతోబాటు లేచిన కర్ణన్ వైపు చూస్తూ కన్నుగీటి, కూర్చోమని సైగచేశాడు అంబాదాస్.

మిగతా వాళ్ళు గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయారు.

కర్ణన్ తిరిగి కుర్చీలో కూర్చుని, ప్రశ్నార్థకంగా చూసేడు.

"నీ మోటర్ సైకిల్ తెచ్చావా ఇక్కడికి?"

"ఔను! బైట వుంది" అన్నాడు కర్ణన్.

"గుడ్! నువ్వు నా వెంట రావాలి!"

"ఎక్కడికి?"

"గ్యారేజ్ లో నా పాత అంబాసిడర్ వుంది. దాంట్లో నేనొక్కణ్ణీ బైలుదేరతాను. నువ్వు నీ మోటర్ సైకిల్ మీద నా వెనక రా! అక్కడే చెబుతాను" అన్నాడు అంబాదాస్ రహస్యంగా.

కర్ణన్ తలూపి లేచాడు.

చేతి గడియారంవైపు చూసుకున్నాడు అంబాదాస్. రాత్రి పన్నెండు గంటలు!

కర్ణన్ని పదమన్నట్లు సైగచేసి, తలుపు తెరుచుకుని బైటికి నడిచేడు.

కొద్ది నిమిషాల్లోనే రెండు వాహనాలూ మద్రాసు నగరందాటి, నిర్మానుష్యమైన మహాబలిపురం రోడ్డుమీద పరుగులు తియ్యసాగేయి.

అరగంట తరవాత, అంబాదాస్ తన అంబాసిడర్ కారును రోడ్డుమీంచి కుడివైపు దింపి, ముందుకు పోనిచ్చాడు. దాని వెనకే మోటర్ బైక్ కూడా దిగింది.

అలా దాదాపు మైలుదూరం నడిచేయి రెండు వాహనాలు. అక్కణ్ణించి రాళ్ళూ రప్పలూ, చెట్లూ, దట్టమైన పొదలూ ప్రారంభమయ్యాయి.

ఆ ఎగుడుదిగుడు నేలమీద మోటర్ బైక్ నడపడం చాలా కష్టంగా వుంది కర్ణన్ కి.

అంతలో అంబాసిడర్ ఓ దట్టమైన పొద ముందాగింది. కారు హెడ్ లైట్స్ వెలుగులో ఆ పొద-చెట్లూ చేమలూ విడదీసి, ఓ గుహలా రూపొందించబడున్నట్లు గమనించాడు కర్ణన్.

ఇప్పుడు కారు నత్తనడక నడుస్తూ ఆ పొదలోకి దూరింది.

అంబాదాస్ కారు దిగి, "కర్ణన్!" పిల్చాడు.

మోటర్ బైక్ ఇంజన్ ఆఫ్ చేసి, స్టాండు వేసి, అతన్ని సమీపించాడు కర్ణన్. అంబాదాస్ మౌనంగా కారు డిక్కీ తెరిచాడు. అందులో నింపివున్న సామాను చూడగానే కర్ణన్ కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

"నువ్వా బెడ్ హోల్డాల్ మోసుకురా! నేనీ సూట్ కేస తెస్తాను" అన్నాడు అంబాదాస్ సూట్ కేస్ అందుకుంటూ.

కర్ణన్ మారు మాటాడకుండా పెద్దసైజు బెడ్ హోల్డాల్ అందుకుని అతన్ననుసరించేడు. అంబాదాస్ కారు ముందుకెళ్ళి, గబగబ అక్కడున్న చెట్ల కొమ్మల్ని అటూ ఇటూ జరపసాగేడు.

మరుక్షణం అక్కడో సొరంగమార్గం ఏర్పడింది.

లోపల కారుచీకటి! అంబాదాస్ టార్చి తీసి వెలిగించి, లోన అడుగుపెట్టాడు.

దిగ్భ్రాంతితో తల మునక్కలౌతూ అతన్ని అనుసరించాడు కర్ణన్. లోపల విశాలమైన గుహలాటి శుభ్రమైన ప్రదేశం వుంది.

అంబాదాస్ ఆ సూట్ కేస్ ని ఓ మూల పెట్టి, "నువ్వెళ్ళి డిక్కీలో వున్న మిగతా సామాను పట్రా! నేను హృద్రోగిని, బరువు మోయలేను" అన్నాడు.

బెడ్ హోల్డాల్ కిందపడేసి, గుహ బైటికి నడిచేడు కర్ణన్. రెండు ట్రిప్పుల్లో డిక్కీలోని సామానంతా లోనికి తెచ్చాడు.

"ఈ ఏర్పాట్లన్నీ దేనికో అర్థమైందా?" అడిగాడు అంబాదాస్.

"అదే అర్థంగాక చస్తున్నాను. త్వరగా చెప్పు!"

"బ్యాంకు దోపిడీ జరగ్గానే, పోలీసులు మనకోసం మద్రాసంతా వేటకుక్కల్లా గాలిస్తుంటారు. దోపిడీ జరిగిన మరుక్షణం, స్టేషన్ వ్యాగన్‌లో నేనిక్కడికి వచ్చి, ఆ వాహనాన్ని మరో కంటికి కనిపించకుండా పొదల్లో దాచేస్తాను.

నెల రోజులు అష్టకష్టాలుపడి నేనొక్కణ్ణీ తయారు చేసిన రహస్య స్థావరమిది. డబ్బుతోసహా మనమిక్కడ నెలరోజులు నిశ్చింతగా దాక్కోవచ్చు. ఆలోగా పోలీసుల హడావుడి కాస్త తగ్గిపోతుంది.

ఆ తరవాత మన ఉనికికూడా వుండదీ చుట్టుప్రక్కల! ఏమంటావ్?" అడిగేడు.

తలూపేడు కర్ణన్, సాలోచనగా.

"వెరీగుడ్! ఇక పద!" అంటూ గుహలోంచి బైటికి వచ్చేడు అంబాదాస్.

## 2

మధ్యాహ్నం సరిగ్గా రెండుగంటల ఇరవై నిమిషాలకి స్టేషన్ వ్యాగన్ వచ్చి, నేషనల్ బ్యాంక్ వెనక గేటు ముందాగింది.

ఆ చప్పుడుకు తన చెక్క కుటీరంలో కూర్చుని సేద దీర్చుకుంటున్న వాచ్ మెన్, చెక్ పోస్ట్ కిటికీగుండా గేటు వైపు చూసాడు.

ముదురునీలం రంగులోవున్న ఆ వ్యాగన్ కిరుప్రక్కలా ఐ.బి.ఎమ్ అన్న పెద్ద పెద్ద అక్షరాలు కనిపించేయి.

వ్యాన్ వెనక తలుపు తెరుచుకుంది. కంపెనీ యూనిఫాంలోవున్న కర్ణన్ దిగి, చక చక అడుగులు వేసుకుంటూ వాచ్ మెన్ దగ్గరికి వచ్చేడు.

"లోపల వాల్ట్ రూంలో కంప్యూటర్ చెడిపోయిందని మా కంపెనీకి ఫోన్ చేసి చెప్పారు మేనేజర్! కొత్త కంప్యూటర్ తీసుకొచ్చాం!" అంటూ జేబులోంచి డెలివరీ చలాన్ తీసి వాచ్ మెన్ కందించాడు.

ఆ చలాన్ ఫారం అందుకుని పరిశీలించేడు వాచ్ మెన్. అంతా సరిగ్గానే వుంది!

అంబాదాస్ ఎంతో నేర్పుతో ఐ.బి.ఎమ్ కంపెనీనించి ఆ ఫారం కాజేసి, ఏమాత్రం అనుమానం రాకుండా ఫిలప్ చేసి, దాన్ని తయారుచేశాడు మరి!

సాలోచనగా తలూపుతూ, స్టాండుమీది టెలిఫోన్ అందుకున్నాడు వాచ్ మెన్. అప్పుడు ప్రారంభమయింది కర్ణన్ గుండెలో దడ! వాచ్ మెన్ వాల్ట్ రూంకు ఫోన్ చేస్తున్నాడు కంప్యూటర్ నిజంగా చెడిపోయిందా? లేదా? తెలుసుకోడానికి.

ఖర్మకాలి లోపల అబ్రాహాం పని ఇంకా పూర్తి కాకుంటే, తమ ప్లాన్ ఆదిలోనే పట్టికొట్టి, అందరూ జైల్లో ప్రభుత్వ ఆతిథ్యం స్వీకరించక తప్పదు!

వాచ్ మెన్ ఫోన్లో మాట్లాడి, రిసీవర్ క్రెడిల్ చేశాడు. ఊపిరి బిగబట్టి ప్రశ్నార్థకంగా చూసాడు కర్ణన్ అతని వైపు.

"నిజమే! కంప్యూటర్ పనిచెయ్యడం లేదుట!" అంటూ ప్రక్కనున్న రిజిస్టర్ తెరిచాడు వాచ్ మెన్.

అందులో ఆ డెలివరీ చలాన్ నెంబరూ వగైరా నోట్ చేసుకుని, చలాన్ ఫారంమీద క్లియరన్స్ ముద్ర వేశాడు.

కుదుటపడ్డ మనసుతో వ్యాన్ వైపు అడుగులు వేస్తూ, "కంప్యూటర్ బైటికి తియ్యండి!" అన్నాడు కర్ణన్ బిగ్గరగా.

మరుక్షణం వ్యాన్ లోంచి సుందర్ సింగ్, రజాక్ కిందికి దూకి, కార్డ్ బోర్డ్ పెట్టె ఇవతలికి లాగేరు. దాన్ని జాగ్రత్తగా మోస్తూ గేటుగుండా కాంపౌండ్ లోకి వచ్చారు.

"లోపలికి తీసికెళ్ళండి!" అంటూ తిరిగి వాచ్ మెన్ దగ్గరికెళ్ళి నిల్చున్నాడు కర్ణన్.

సుందర్ సింగ్, రజాక్ పెట్టె మోసుకుంటూ బ్యాంక్ బ్యాక్ డోర్ వైపు బైలుదేరారు. వ్యాన్ లో స్టీరింగ్ ముందు కూర్చుని, పక్కిన పేనులా ఇదంతా చూస్తున్నాడు అంబాదాస్.

వాచ్ మెన్ తో కబుర్లలోకి దిగేడు కర్ణన్!

# 3

సుందర్ సింగ్, రజాక్ లు లోపలికెళ్ళి అప్పుడే అర గంట కావస్తోంది.

పథకం ప్రకారం ఈపాటికి వాల్ట్ లోపల వాళ్ళ పని పూర్తి కావాలసింది. ఇంకా దేనికి రాలేదు? కొంపదీసి లోపలేదైనా ప్రమాదం జరగలేదు కదా?

బైట వాచ్ మెన్ తో మాట్లాడుతూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు కర్ణన్. అతని కళ్ళు మాటిమాటికీ బ్యాంక్ తలుపువైపు మళ్ళుతున్నాయి ఓరగా.

ఐదు నిమిషాల తరవాత అతని కళ్ళు తళ తళ మెరి శాయి.

కారణం, పెట్టె మోసుకుంటూ సుందర్ సింగ్, రజాక్ లు డోర్ గుండా కాంపౌండ్ లోకి వస్తున్నారు!

"పని అయిపోయిందా?" అడిగాడు అర్థవంతంగా.

రజాక్ తలూపి, "ఐపోయింది!" అన్నాడు కన్ను గీటుతూ.

సేషన్ వ్యాగన్ డ్రైవింగ్ సీట్లో—ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తున్న అంబాదాస్ వెంటనే ఇంజన్ స్టార్ట్ చేసి రెడీగా కూర్చున్నాడు.

కర్ణన్ ముందుకెళ్ళి, పెట్టె మోయడంలో వాళ్ళకు సాయం పట్టేడు. ముగ్గురూ గబగబ పెట్టెని సేషన్ వ్యాగన్ లో లోడ్ చేసి, తలుపు మూయబోయారో లేదో, సరిగ్గా అదే క్షణంలో బ్యాంకులోంచి ఫుల్ సూటులో వున్న ఓ వ్యక్తి ఇవతలికి వచ్చేడు.

మొట్టమొదటిసారి అంబాదాస్ దృష్టి పడింది అతని మీద! ఆ వ్యక్తి ఎవ్వరో కాదు. అక్షరాలా ఆ బ్యాంకు మేనేజర్ ప్రసాదరావు!!

అంబాదాస్ తన అనుచరుల కతని గురించి హెచ్చరించేలోగా, మేనేజర్ వ్యాన్ని సమీపించి, "ఎవరు మీరు? ఏమిటిదంతా?" అడిగేడు నోరు తెరుస్తూ.

ఆ నలుగురి గుండెలూ గుభిల్లుమన్నాయి! క్షణంపాటు ఏం జవాబివ్వాలో తోచలేదు.

కర్ణన్ వెంటనే అందుకుని, "మేము ఐ.బి.ఎమ్ కంపెనీ వర్కర్లంసార్! బ్యాంకులో కంప్యూటర్ చెడిపోతే కొత్త కంప్యూటర్ తెచ్చి, పాత కంప్యూటర్ తీసి కెళ్తున్నాం!" అన్నాడు ఇకిలిస్తూ.

"ఏమిటీ, ఈ పెట్టెలో పాత కంప్యూటరుందా?"

"ఔనండి!"

"మిమ్మల్నెవరు పిలిపించారిక్కడికి?"

"బ్యాంకు మేనేజరుగారు!"

అంబాదాస్ గుండె గతుక్కుమంది. ఆ ముగ్గుర్లో ఎవ్వరూ ఇదివరకు ఆ మేనేజర్ని చూళ్ళేదు. అంతా సజావుగా జరిగి, చివరి క్షణంలో ప్లాన్ పిల్లిమొగ్గ వేస్తోంది. చడీ చప్పుడూ కాకుండా వ్యాగన్ని ఫస్ట్ గేర్లో వేశాడు అంబాదాస్.

"ఆ పెట్టె తెరవండి!" అరిచాడు మేనేజర్.

సుందర్ సింగ్ పరిస్థితి వికటిస్తోందని పసిగట్టేశాడు. మేనేజర్ కన్నుగప్పి మెల్లిగా వ్యాన్ చాటుకు జరిగేడు. జేబులోంచి రివాల్వర్ తీసి, దాని సెఫ్టీ కాచ్ వెనక్కి లాగి, రెడీగా నిల్చున్నాడు.

కర్ణన్ తటపటాయిస్తూ వ్యాన్ లోపలున్న పెట్టెపైన చెయ్యివేశాడు. అంతే! మేనేజర్ గుండెకు గురిచూసి, ట్రిగ్గర్ నొక్కేడు సుందర్ సింగ్.

"ఢాం" అన్న శబ్దంతో పరిసరాలు మారుమోగడం, మేనేజర్ గుండె పట్టుకుని కింద కూలడం ఒకేసారి జరిగాయి.

సరిగ్గా అదే క్షణంలో, డ్రైవింగ్ సీట్లో కూర్చున్న అంబాదాస్ క్లచ్ రిలీజ్ చేసి, ఆక్సిలేటర్ని నొక్కేడు బలంగా.

అంతే! తుపాకి గుండులా అక్కణ్నించి దూసుకుపోసాగింది వ్యాన్.

మిగతా ముగ్గురూ దిగ్భ్రాంతితో అలాగే చూస్తుండి పోయారు కాసేపు. అంబాదాస్ తన అనుచరుల్ని మృత్యు ముఖంలో వదిలేసి, పారిపోతున్నాడు.

అంతవరకూ తన చెక్‌పోస్ట్‌లో కూర్చుని ఇలాగే చూస్తున్న వాచ్‌మెన్ మేనేజర్‌గారు ఆ కంపెనీ వర్కర్లతో ఏదో మాట్లాడుతున్నారనుకున్నాడు. కాని, హఠాత్తుగా పిస్తోలు పేలడం, మేనేజర్ గుండె పట్టుకుని కింద కూలడంతో పరిస్థితి అర్థమైపోయిందతనికి.

మరుక్షణం ఓ మూల నిలబెట్టివున్న డబుల్ బారల్ తుపాకి వచ్చేసిందతని చేతిలోకి. అదే క్షణంలో గేటు దగ్గర్నించి స్టేషన్ వ్యాన్ బాణంలా దూసుకుపోవడం కనిపించింది.

అప్పుడు పడింది వాచ్‌మెన్ దృష్టి సుందర్‌సింగ్ మీదా, అతని చేతిలోవున్న పిస్తోలుమీదా! మరేమీ ఆలోచించకుండా, కిటికీ అంచుపై తుపాకి ఆనించి, సుందర్‌సింగ్‌ని గురిచూసి ట్రిగ్గర్ వత్తేడు.

"ఢాం!" మనే శబ్దంతో దూసుకెళ్ళి సుందర్‌సింగ్ కణతలో దిగింది గుండు. అతను కాండం నరికిన చెట్టులా కూలిపోయేడు.

వాచ్‌మెన్ వెంటనే మరోసారి ట్రిగ్గర్ వత్తేడు.

ఈసారి గురితప్పింది! అంతే—

ఎక్కుపెట్టి వదిలిన బాణాల్లా అక్కణ్నించి పరుగు తీశారు కర్ణన్, రజాక్‌లు.

రెండు నిమిషాల్లో బ్యాంకు పరిసరాలు దాటి, మేన్ రోడ్ మీదికి వచ్చేరు. అదృష్టవశాత్తూ కనిపించింది ఓ ఖాళీటాక్సీ!

బాక్‌సీట్లో దూకుతూ, "మాంబళం పోనివ్!" అన్నాడు కర్ణన్.

# 4

వాల్ట్‌రూం ఏర్‌కండిషన్నర్ స్విచ్ తిరిగి ఆన్ జేసి, తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు అబ్రాహాం!

తన పని అంతవరకే. ఈపాటికి అక్కడ జరగవలసిం దంతా జరిగిపోయుంటుంది.

ఇహ ఒక్కక్షణం తనిక్కడుండకూడదు. టూల్ బాక్స్ అందుకుని గదిలోంచి బైటపడి నడవాలో అడుగు పెట్టాడు.

సరిగ్గా అదే క్షణంలో పక్క గదిలోంచి బైటికి వచ్చిన ఓ క్లర్కు అతన్ని చూడగానే చటుక్కున ఆగి, "నువ్వు ఎలక్ట్రిషియన్‌వి కదూ?" అడిగేడు.

తలూపాడు అబ్రాహాం!

"మా సెక్షన్లో ట్యూబ్‌లైట్ సరిగ్గా వెలగడంలేదు. కాస్త చూసివెళ్ళు!"

అబ్రాహాం గుండె గతుక్కుమంది. ఆలస్యం, అమృతం, విషం! తనిక్కణ్నించి ఎంత త్వరగా బైటపడితే అంత మంచిది. రానంటే క్లర్కు కనుమానం వేస్తుంది. ఏమిటి చెయ్యడం?

"ఐదు నిమిషాల్లో వెళ్ళిపోదువుగాని రా!" అన్నాడు క్లర్కు మళ్ళీ.

గత్యంతరంలేదు. మనసులో అతన్ని సవాలక్ష శాప నార్థాలు పెడుతూ "పదండి!" అన్నాడు నీరసంగా.

క్లర్కు అతన్ని పక్క గదిలోకి తీసికెళ్ళి, పైన వేళ్ళాడుతున్న ట్యూబ్‌లైట్ చూపించేడు. అబ్రాహాం బల్లమీద ఎక్కి చకచక దాని స్టార్టర్ చెక్ జెయ్యసాగేడు.

పని పూర్తి కావడానికి పది నిముషాలు పట్టింది.

'హమ్మయ్య' అనుకుంటూ బల్ల దిగాడో లేదో, బ్యాంకు వెనక తుపాకి పేలిన శబ్దం వినిపించింది. అబ్రాహాం గుండెలో గుర్రాలు దౌడు ప్రారంభించేయి.

"ఏమిటా చప్పుడు?" అన్నాడో క్లర్కు ఆశ్చర్యంగా.

అబ్రాహాం వెంటనే అందుకుని—"ఏదో కారు బ్యాక్ ఫైరింగ్ జరిగుంటుంది లెండి..." అన్నాడు.

"కాదు! తుపాకి ప్రేలుడులా వినిపించింది!" అన్నాడు మరో క్లర్కు.

అబ్రాహాం ఇంకా ఏదో చెప్పబోతుండగా, రెండో సారి మళ్ళీ వినిపించింది తుపాకి గర్జన!

"సందేహం లేదు! వెనక కాల్పులు జరుగుతున్నాయి. గూర్ఖా వెంటనే ఫ్రంట్ డోర్ మూసెయ్! నేను పోలీసులకి ఫోన్ చేస్తున్నాను..." అరిచాడో క్లర్కు.

అబ్రాహాం గుండెలో బండలు దొర్లుతున్నాయి. గూర్ఖా ఫ్రంట్ డోర్ మూసేశాడంటే, తన గతి బోనులో పడ్డ ఎలికలా అయిపోతుంది. వెంటనే ఇక్కణ్ణించి బైట పడాలి. టూల్ బాక్స్ అందుకుని, గబగబ గది దాటి ఫ్రంట్ డోర్ వైపు నడిచేడు.

అనుమతి లేకుండానే అతని కుడిచెయ్యి పిస్తోలువున్న జేబులోకి దూరి సిద్ధంగా వుంది! అప్పటికే అక్కడ కూర్చుని పనిజేస్తున్న బ్యాంకు సిబ్బంది కూడా హడావుడిగా తమ సీట్లలోంచి లేవసాగేరు. గూర్ఖా సింహద్వారం మూసేస్తున్నాడు.

అబ్రాహాం పెద్దపెద్ద అంగలతో అతన్ని సమీపించి, "నేను ఎలక్ట్రిషియన్ని! ప్లీజ్ నన్ను బైటకెళ్ళనివ్వు" అన్నాడు ప్రాధేయపడుతూ.

గూర్ఖా అతన్ని ఎగాదిగా చూసి, "ఎవ్వరూ బైటి

కాల్చడానికి వీల్లేదు.'' అన్నాడు ఖచ్చితంగా.

ఎక్కువ ఆలోచించడానికి వ్యవధిలేదు. కుడిచెయ్యి బైటికితీశాడు అబ్రాహాం! మరుక్షణం ఆ చేతిలోని పిస్తోలు పొగలు కక్కుతూ గర్జించింది!

గుండు తిన్నగా వెళ్ళి గూర్ఖా భుజంలో దిగింది. అతన్ని ఒక్క తోపుతోసి, అప్పటికే సగం మూసుకున్న తలుపు తెరుస్తూ పరుగు లంకించాడు బైటికి!

లోపల గగ్గోలు ప్రారంభమైంది!

అదృష్టవశాత్తూ బ్యాంకు కాంపౌండ్‌లో పార్కు జేసి వున్న ఫియట్ కారుమీద పడింది అబ్రాహాం దృష్టి. మెరుపులా దౌడు దీశాడు.

తలుపు దగ్గర గాయపడ్డ గూర్ఖా అంత బాధనూ లెక్కచెయ్యకుండా, తన రైఫిల్ అందుకుని, కారు దగ్గరికి పరిగెత్తుతున్న అబ్రాహాం వైపు ఫైర్ జేశాడు.

కారు ఫ్రంట్ డోర్ తెరిచి లోపల దూరబోతున్న అబ్రాహాంకు, కణకణలాడే ఎర్రని నిప్పుకణం ఏదో రివ్వున దూసుకువచ్చి తన పక్కటెముకల్లో దిగినట్టు తోచింది. కింద పడబోతూ నిలదొక్కుకుని, ఊపిరి బిగబట్టి శక్తినంతా కూడదీసుకుని, డ్రైవింగ్ సీట్లో కూలబడ్డాడు.

అదృష్టంకొద్దీ ఇగ్నిషియన్ రంధ్రంలో తాళంచెవి అలాగే వేళ్ళాడుతోంది. వెంటనే ఇంజన్ స్టార్ట్ జేసి, కారు ముందుకు పోనిచ్చాడు. గేటు దాటగానే ఎడం వైపు తిప్పి వేగం హెచ్చించాడు.

గుండు జేసిన రంధ్రం గుండా రక్తం స్రవిస్తూ అతని షర్టు తడిసిపోతోంది. మస్తిష్కంలో ఏదో మత్తు కమ్ముకుంటున్నట్టు తోస్తోంది. తను మూర్ఛపోకూడదు.

పళ్లు బిగబట్టి బాధను ఓర్చుకుంటూ, స్టీరింగ్ కంట్రోల్ చేస్తున్నాడు.

కారు బాణంలా దూసుకుపోతోంది మాంబళంవైపు!

## 5

అంబాదాస్ తన రహస్య స్థావరానికి సురక్షితంగా చేరుకున్నాడు.

పొదలతో కప్పివున్న ఆ గుహ చేరువలో వ్యాన్ ఆపి దిగాడు.

తన అదృష్టాన్ని లోలోపలే అభినందించుకుంటూ వ్యాన్ వెనక్కి వెళ్ళి, బ్యాక్ డోర్ తెరిచి, లోపలున్న పెట్టె మూత ఊడబెరికి ఆత్రంగా చూశాడు.

దాని పీకవరకూ పేర్చివున్న నోట్లకట్టలు కనిపించ గానే అతని కళ్ళు జిగేల్‌మన్నాయి! చిన్నగా నవ్వు కుంటూ చేత్తో ఆప్యాయంగా ఆ నోట్లని నిమిరేడు.

తన ప్లాన్ ఫుల్ సక్సెస్ అయింది. చివర్లో బ్యాంకు మేనేజర్ రావడంవల్ల కొద్దిగా బెణికిన మాట నిజమే గానీ, దానివల్ల తనకు జరిగిన నష్టమేమీ లేదు. మేనేజర్ వచ్చినా, రాకున్నా పెట్టె వ్యాన్‌లో చేరిన మరుక్షణం మిగతా వాళ్ళని అక్కడే వదిలి తను పారిపోయేవాడు.

వాళ్ళు మేనేజర్ని కాల్చి చంపడం ఒకందుకు మంచిదే అయింది. తను రియర్‌వ్యూ మిర్రర్‌లోంచి స్పష్టంగా చూసేడు, సుందర్‌సింగ్ వాచ్‌మెన్ తుపాకి గుండుకు బలికావడం! మిగతా వాళ్ళుకూడా అలాగే చస్తే పీడా విరగడవుతుంది!

ఈ రహస్య ప్రదేశం తెలిసిన వ్యక్తి కరణ్ ఒక్కడే! మిగిలిన ముగ్గురూ అక్కణ్ణించి ప్రాణాలతో బయట పడితే ఇక్కడికి వస్తారు.

రాగానే వాళ్ళని కిక్కురుమనకుండా కైలాసం పంపి, పొదల్లో రెడీగా వున్న కార్లో, డబ్బుతో ఎటైనా చెక్కెయ్యాలి. శత్రుశేషం వుంచుకోకూడదు. ఆలోచిస్తూ పెట్టెమూత యథాతథంగా మూసేసి, దాని రెండు కొసలూ పట్టుకుని లాగేడు అంబాదాస్.

అది అంగుళం కూడా కదల్లేదు. పెట్టె యింత బరువుంటుందనుకోలేదతను.

ఈసారి కాస్త గట్టిగా పట్టుకుని ఒక్క ఊపుతో లాగేడు తనవైపు.

పెట్టె కొద్దిగా కదిలింది. కాని, ఆ ఊపువల్ల హఠాత్తుగా అతని గుండెలో నెప్పి ప్రారంభమైంది. చేతులు అప్రయత్నంగా పెట్టెని వదిలేసి, గుండెమీదికి వచ్చేయి.

ఆ నెప్పిగురించి అతనికి బాగా తెలుసు. గత నాలుగేళ్ల నించీ హృద్రోగంతో బాధపడుతున్నాడు అంబాదాస్. ఏ కాస్త ఎక్సైట్‌మెంట్‌కు గురైనా, ఏమాత్రం ఎక్కువ బరువు లేపడానికి ప్రయత్నించినా అలాగే వస్తుంది గుండెపోటు!

ఛాతీ అదుముకుంటూ కాసేపు కింద కూర్చుండి పోయాడు.

గంట తరవాతగానీ ఆ నెప్పి కాస్త స్థిమిత పడ్డట్టనిపించలేదు. ఇహ ఆ పెట్టి ఎత్తడం చాలా ప్రమాదం!

నెమ్మదిగా లేచి నిల్చుని, జేబులోంచి స్టేషన్ వ్యాగన్ తాళం చెవులు తీశాడు. వాటితో వ్యాన్ తలుపులన్నీ లాక్ చేసి, అడుగులో అడుగు వేసుకుంటూ పొదలవైపు నడిచేడు.

అతి కష్టంమీద కొమ్మలూ, రెమ్మలూ తొలగించుకుంటూ గుహలో ప్రవేశించేడు.

ఇప్పుడు తనకు పూర్తిగా రెస్టు కావాలి. జేబులోంచి రెండు కాంపోస్ మాత్రలు తీసి, మింగి, నెమ్మదిగా బెడ్ హోల్డాల్ విప్పి కింద పరిచేడు.

మాత్రలు మింగడంవల్ల నెప్పి రవంత ఉపశమనం కలిగిస్తోంది.

పక్కమీద వాలి, కళ్ళు మూసుకున్నాడు అంబాదాస్.

## 6

"ఇక్కడ ఆపు!" అన్నాడు కర్ణన్ టాక్సీడ్రైవర్‌తో.

వీధి మొదట్లో ఆగింది టాక్సీ. కర్ణన్ పర్సుతీసి మీటర్ బిల్ యిచ్చేశాడు.

టాక్సీ వెళ్ళిపోయేవరకూ అక్కడే వుండి, గబగబ అడుగులు వెయ్యసాగేరు అంబాదాస్ ఇంటివైపు.

"ఆ రాస్కెల్ మనల్ని చవటల్ని చేసి, డబ్బుతో పారిపోయాడు" అన్నాడు రజాక్ పళ్ళు నూరుతూ.

"వాడిమీద దేనికి విరుచుకుపడతావ్?"

"లేకుంటే ఏమిటి? మనందర్నీ సుడిగుండంలో వదిలేసి, వాడు డబ్బుతో పారిపోవడం న్యాయమేనంటావా?"

"ఔను! అంబాదాస్ సమయానికి చాలా తెలివిగా ప్రవర్తించేడు. ఆ పరిస్థితిలో సాధ్యమైనంత త్వరగా ఆ డబ్బును ఆ పరిసరాలకి దూరంగా తీసికెళ్ళడమే సరైన పని.

ప్రమాదాల నెదుర్కోవడం మనకు కొత్తకాదు. మనం సులభంగా అక్కణ్ణించి తప్పించుకోగలమని వాడికి తెలుసు. అందుకే, నిశ్చింతగా వుడాయించాడు. వాడి అంచనా ప్రకారం మనం నిక్షేపంగా బైటపడ్డామా, లేదా?" అన్నాడు కర్ణన్.

"మనమైతే బైటపడగాలిగాం గానీ, పాపం సుందర్ సింగ్ పుణ్యానికి ప్రాణాలు పోగొట్టుకున్నాడు."

"ఏం చేస్తాం చెప్పు! ఎవ్వడి చావు ఎప్పుడు ఎలా రాసిపెట్టుందో ఎవరు చెప్పగలరు? ఒకరోజు మనమూ పోయేవాళ్ళమే గదా?" అన్నాడు కర్ణన్ వేదాంతిలా.

అంబాదాస్ ఇల్లు వచ్చేసింది.

గేటుగుండా కాంపౌండ్‌లో ప్రవేశించి ఆశ్చర్యపోయారిద్దరు.

ఎడంవైపు గోడవారగా పార్కు చేసుందో ఫియట్ కారు!

"కొంపదీసి పోలీసులు కాదు కాదా?" అన్నాడు కర్ణన్ ఖంగారుగా.

"తెలివితక్కువగా మాట్లాడక! పోలీసు లెక్కడైనా కార్లో వస్తారా?"

"మరీ కారెవరిది?"

"నాకేం తెలుసు? లోపలికెళ్ళి చూస్తేగానీ తెలీదు."

ఇద్దరూ మూసున్న తలుపుముందాగి, చెవులు రిక్కించుకున్నారు. లోపలినుంచి సన్నగా ఎవరో మూలుగుతున్న శబ్దం వినిపిస్తోంది!

మెల్లిగా తలుపుతట్టాడు రజాక్.

"ఎవరు?" అడిగిందో కంఠం ఆయాసపడుతూ.

అది అబ్రాహాం కంఠం!

ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"మేము! తలుపు తెరువ్!" అన్నాడు కర్ణన్.

"త్... తెరిచే వుంది... తొయ్యండి!"

తలుపు తోశాడు రజాక్!

ఎదురుగా కనిపించిన దృశ్యం వాళ్ళని చకితుల్ని

చేసింది. నేలమీద రక్తసిక్తమైన బట్టలతో పడున్నాడు అబ్రాహాం!

"ఏమిటిది? ఎలా జరిగింది?" అంటూ అతని దగ్గరికి పరిగెత్తారిద్దరూ.

జరిగింది క్లుప్తంగా వివరించాడు అబ్రాహాం.

రజాక్ గబగబ బెడ్‌రూంలోకెళ్ళి, కత్తితో మంచం మీది పరుపును కొద్దిగా కోసి, దాంట్లోంచి దూదిలాగి, ఓ తెల్లదుప్పటందుకుని వచ్చాడు. కర్ణన్ ఆ దూదితో అబ్రాహాం గాయాన్ని శుభ్రంగా తుడిచేసి, తెల్లదుప్పటి చింపి గాయానికి కట్టుకట్టేడు.

"గుండు పక్కటెముకల్లో ఇరుక్కుంది! సలుపుతోంది!" అన్నాడు అబ్రాహాం ఆయాసపడుతూ.

"ఓర్చుకోవాలి. తప్పదు. ఇక్కడికి డాక్టర్ని పిలవడం కోరి ప్రమాదాన్ని కొనితెచ్చుకోవడమౌతుంది!" అన్నాడు కర్ణన్.

ఇద్దరూ అతన్ని ఎత్తి, బెడ్ రూంలోకి తీసికెళ్ళి మంచంమీద పడుకోబెట్టారు. అబ్రాహాం కళ్ళు మూసుకున్నాడు అసహనంగా.

"నా బుర్ర మొద్దుబారిపోతోంది కర్ణన్! కడుపులో కాస్త కాఫీ నీళ్ళు పడితేగానీ మామూలు మనిషినయ్యేలా లేను. పద, ముందు కాఫీ చేద్దాం!" అన్నాడు రజాక్.

ఇద్దరూ వంటింట్లోకెళ్ళి, డబ్బాలూ అవీ వెదికారు.

అన్నీ ఖాళీ! నువ్వు గింజ కూడా లేదు! ఈ రోజు తాము ఎలాగైనా ఇక్కడే తలదాచుకోవాలి. పోలీసుల సందడి తగ్గాక రేపు వీలుచూసుకొని ఆ రహస్య ప్రదేశానికి చేరుకోవచ్చు.

సాలోచనగా తలూపుతూ జేబులోంచి పర్సు తీశాడు

కర్ణన్. "బైట అబ్రాహాం తెచ్చిన ఫియట్ కారుంది. దానిమీద ఎవ్వడి దృష్టి పడకముందే, ఎక్కడైనా వదిలి రావాలి. ఇంట్లో మింగ మెతుకులేదు. నా దగ్గర టాక్సీ బాడుగకు పోను, ఇంకా ముప్ఫై రెండు రూపాయలు మిగిలాయి. నీ దగ్గరెంతుంది?"

రజాక్ జేబులోంచి డబ్బుతీసి లెక్కపెట్టి, "నలభై ఎనిమిది రూపాయలు!" అన్నాడు.

"వెరీగుడ్! ఈ డబ్బంతా తీసికెళ్ళి, కారెక్కడైనా వదిలేసి, వారానికి సరిపడే డ్రైఫుడ్ తీసుకురా. సిగరెట్లూ, అగ్గిపెట్టెలూ మరవక! అన్నట్టు ఓ క్వార్టర్ బాటిల్ బ్రాందీ కూడా పట్రా. మనకోసం కాదు. అబ్రాహాం కోసం! కనీసం బ్రాందీ తాగైనా ఆ బాధ మర్చిపోతాడు." అన్నాడు కర్ణన్ పర్సు రజాక్ కందిస్తూ.

అతను తలూపి, "కారుతోబాటు ఈ యూనిఫామ్స్ కూడా వదిలేస్తే మంచిది. విప్పేయ్!" అన్నాడు తన యూనిఫాం తీస్తూ.

ఇద్దరూ గబగబ ఆ దుస్తులు విప్పి, తమ పాతబట్టలు తొడుక్కున్నారు. రజాక్ వాటిని చుట్టచుట్టి, చంకలో ఇరికించుకుని బైటికి నడిచేడు.

కర్ణన్ తలుపుమూసి, హాలు మధ్య కుర్చీలో చతికిలబడి, సిగరెట్ కాలుస్తూ తీవ్రాలోచనల్లో మునిగిపోయాడు.

దాదాపు రెండు గంటల తరవాత మోగింది కాలింగ్ బెల్.

"ఎవరు?" అన్నాడు కర్ణన్ జేబులోని పిస్తోలు తడుముకుంటూ.

"నేను రజాక్‌ని!!"

వెళ్ళి గడియ తీశాడు. చేతిలో పెద్ద వెదురు బుట్టతో లోనికి వచ్చాడు రజాక్. పళ్ళూ, ఫలహారాలూ, బ్రెడ్లూ, బిస్కెట్లూ, జామ్ టిన్లూ, కేకులూ, సిగరెట్లూ నిండా వున్నాయందులో.

"బ్రాందీ తేలేదా?" అడిగాడు కర్ణన్ ఆశ్చర్యంగా.

రజాక్ తలూపి, బుట్ట అడుగునున్న బాటిల్ బైటికి తీసేడు.

"పద, ముందు అబ్రాహాంకు బ్రాందీ ఇచ్చి, వాడి బాధ మరిపిద్దాం!" అన్నాడు కర్ణన్ బెడ్‌రూంవైపు నడుస్తూ.

తలుపు మూసి, బుట్టతో అతన్ననుసరించేడు రజాక్.

అబ్రాహాం కళ్లు మూసుకుని, వెల్లకిలా పడుకున్నాడు మంచంమీద.

మంచాన్ని సమీపించి, "అబ్రాహాం!" పిల్చేడు కర్ణన్.

అతను పలకలేదు.

"అబ్రాహాం! నీకోసం బ్రాందీ తెప్పించాను. తాగి పడుకో!" అన్నాడు కర్ణన్ మళ్ళీ.

ఐనా, అబ్రాహాం కళ్ళు తెరవలేదు.

ఏదో అనుమానం వేసి, చటుక్కున అతని గుండె మీద చెవి ఆనించేడు కర్ణన్. "పోయాడు!" అన్నాడు దిగ్భ్రాంతితో.

తన శరీరంలో ప్రవహిస్తున్న రక్తం క్షణంపాటు స్తంభించిపోయినట్టు తోచింది రజాక్‌కు. "ఇప్పుడెలా?" అనగలిగేడు తేరుకుని, అతి కష్టంమీద.

"శవాన్ని ఇలా వుంచామంటే, కుళ్ళి కంపుకొడుతుంది! గత్యంతరం లేదు. పెరట్లో గొయ్యితీసి పాతేద్దాం!" అన్నాడు కర్ణన్ నీరసంగా.

ఇద్దరూ గబగబ ఇల్లంతా వెతకసాగేరు, గొయ్యి తవ్వడాని కుపయోగించే వస్తువేదైనా దొరుకుతుందేమో నని. వంట గదిలో పాత సామాను వేసే అటకమీద కని పించిందో గునపం!

దాన్నందుకుని, "పద పెరట్లోకి!" అన్నాడు కర్నల్.

# 7

"ఈ పక్కనించి ఓ షార్ట్‌రూట్ వుంది! అలా వెళ్ళా మంటే, మద్రాసు వెళ్ళే మేన్‌రోడ్ చేరుకుంటాం!" అన్నాడు ఆంజనేయులు కారు డ్రైవ్ చేస్తూ భార్యతో.

జగదాంబ పలకలేదు. మూతి మూడొంకర్లు తిప్పి, కూర్చుంది మౌనంగా.

ఆ రోజు ఉదయం మద్రాసునించి భార్యా సమేతంగా తన ఫోర్డ్ కారులో కాంచీపురం వెళ్ళాడు ఆంజనేయులు పిక్నిక్ పేర కాస్త కులాసాగా గడిపివద్దామని. ఐతే, తిరుగు ప్రయాణంలో సగందూరం వచ్చేసరికి చీకటి పడి పోయింది. ఇహ షార్ట్‌రూట్‌లో సాధ్యమైనంత త్వరగా మెయిన్‌రోడ్ చేరడం తప్ప మరో గత్యంతరం కనిపిం చడం లేదు!

హెడ్‌లైట్స్ కాంతిలో కారును మెల్లిగా రోడ్డు దింపించి, ముందుకు పోనిచ్చాడు. గరగర శబ్దంచేస్తూ గతు కుల్లో పడి మన్ను తిన్న పాములా నడుస్తోంది కారు.

జగదాంబ ఆ చీకాకును మరగడానికి, ఒళ్ళో వున్న బుష్‌బారన్ ట్రాన్సిస్టర్ని ట్యూన్ చెయ్యాలని పట్టువదలని విక్రమార్కుణిలా ప్రయత్నిస్తోంది. కారు కుదుపులవల్ల ఆమె ప్రయత్నం ఫలించడంలేదు.

రేడియో ఆఫ్ చేసి, "నేరకపోయి వచ్చాను మీ వెంట.

ఈ డొక్కు కారు పుణ్యమా అని ఇప్పటికే నా అవయ వాలు ఎక్కడికక్కడ కొబ్బరి చట్నీ అయిపోయాయి!" అంది విసుగ్గా.

ఉబికి వస్తున్న కోపాన్ని అతి కష్టంమీద దిగ మింగాడు ఆంజనేయులు. ముందుకెళ్తున్న కొద్దీ దారి మరీ దుర్భరంగా తయారవుతోంది. మరీ ఇంత ట్రబుల్ రూట్ అయ్యుంటుందనుకోలేదతను.

అంతలో, హఠాత్తుగా ఎడంవైపు చక్రం ఠుస్సు మంటూ కూర్చుండిపోయింది. ఆ ఊపుకు "ఓరి దేవు డోయ్!" అంటూ ఓవైపు ఒరిగిపోయింది జగదాంబ.

ఆంజనేయులు డోర్ తెరిచి, అతి కష్టంమీద భార్యని ఇవతలికి లాగగలిగేడు.

"అయిందా సంబడం? షార్ట్ రూట్, షార్ట్ రూట్ అంటూ నన్నీ కీకారణ్యంలోకి తెచ్చి పడేశారుగదా?" అంది జగదాంబ భర్తమీద విరుచుకుపడుతూ.

"కాసేపు నోరు మూసుకూర్కో! ఏదైనా కారు ఈ వైపొస్తే లిఫ్ట్ అడిగి వెళ్దాంగానీ!" అన్నాడు ఆంజ నేయులు అసహనంగా.

"అందరూ మీలాగే తెలివిలేనివాళ్ళనుకున్నారా? బుర్రున్న వాడెవ్వడైనా ఈ గతుకుల్లో పడి వస్తాడా చావడానికి? నా ఖర్మగాకపోతేనూ!"

"ఐతే, ఇక ఆర్.టి.సి. బస్సే మనకు శరణ్యం!"

"మీ రిక్కడ ఇరుక్కుపోయారని పాపం, ఆ ఆర్.టి.సి వాళ్ళు మాయా కమండలంలో చూశారుకదూ? వెంటనే పంపిస్తారెండి ఓ స్పెషల్ బస్సు."

"అది కాదే, ఇక్కణ్నించి మేన్ రోడ్ చేరుకున్నా

మంటే, మద్రాసు వెళ్ళడానికి ఏదో ఒక వాహనం దొరక్కపోదు!''

''ఆ మెయిన్ రోడ్ ఎక్కడ తగలడింది?

''బహుశా, మైలుదూరం వుంటుంది!''

''వల్ల కాదు. అంతదూరం నడవడం నావల్ల కాదు.''

ఇక కోపాన్ని దిగమింగ లేకపోయాడు ఆంజనేయులు.
''నడవకపోతే, నిన్ను భుజాన ఎత్తుకెళ్ళమంటావా?... అదుగో, అవతల నక్కలూ, తోడేళ్ళూ అరుస్తున్నాయి!''

ఆ అస్త్రం పనిచేసింది. లీలగా వినిపిస్తున్న నక్కల ఊలలతో ఆమె హడలిపోయి, మారు మాటాడకుండా భర్తకన్నా ముందుగా నడక సాగించింది. లోలోపల నవ్వుకుంటూ ఆమె ననుసరించాడు ఆంజనేయులు.

అలా ఫర్లాంగు దూరం వెళ్ళారో లేదో, ఓ పొదల దగ్గర చటుక్కున ఆగిపోయింది జగదాంబ.

''ఏమైంది?'' అడిగాడు ఆంజనేయులు.

జగదాంబ పలకలేదు. చేత్తో కుడివైపు సైగ చేస్తోంది. చటుక్కున అటుచూసి నోరు తెరిచాడు ఆంజనేయులు.

మసక చీకట్లో ఆ పొదల దగ్గర కనిపించింది ఓ నీలం రంగు స్టేషన్ వ్యాగన్.

''అరె! ఈ వ్యాన్ ఇక్కడికెలా వచ్చింది?'' అన్నాడు ఆశ్చర్యంగా.

''చుట్టు పక్కల ఎవ్వరైనా వున్నారేమో! కేకెయ్యండి!''

రెండుమూడుసార్లు గట్టిగా కేకేశాడు ఆంజనేయులు.

ఎవ్వరూ జవాబివ్వ లేదు!

''హమ్మయ్య! ఆ భగవంతుడే నా మొరాలకించి, ఈ వాహనాన్నిక్కడ ప్రత్యక్షం చేసుంటాడు. ఇంజన్

స్టార్టవుతుందేమో చూడండి!'' అంది జగదాంబ ఉత్సాహంగా.

''అనుమతి లేకుండా దీన్ని దొంగలించుకు పోదామనా నీ ఉద్దేశం?''

''ఖర్మ! ఇది దొంగతన మెలా అవుతుంది? అరగంట లోపల మనం మద్రాసు చేరుకుంటాం! తరవాత మన గ్యారేజ్ లోంచి మీరు స్పేర్ వీల్ తీసుకొచ్చి, మన కారుకు బిగించి, దీన్నిక్కడొదిలి, మన కార్లో తిరిగి వచ్చెయ్యండి!''

ఐడియా బాగానే వుంది! సాలోచనగా తలూపుతూ జేబులోంచి తాళంచెవులగుత్తి తీశాడు ఆంజనేయులు. అతను మద్రాసులోని ఓ కార్ల కంపెనీలో టెస్టింగ్ గ్రూప్ ఇంజనీర్ గా పనిచేస్తున్నాడు.

అతని తాళంచెవుల గుత్తిలో ఓ ప్రత్యేకమైన వెహికల్ మాస్టర్ కీ వుంది. దాంతో ఏ రకం వాహనాల డోర్ లాక్సైనా సులభంగా తెరవ్వచ్చు. ఏ రకం ఇగ్నిషియన్స్ కైనా ఉపయోగించవచ్చు.

ఆ తాళం చెవితో, ముందు ఫ్రంట్ డోర్ లాక్ తెరిచాడు ఆంజనేయులు, డ్రైవింగ్ సీట్లో కూర్చుని, తాళం చెవి ఇగ్నిషియన్ హోల్లో దూర్చి, సెల్ఫ్ స్టార్టర్ లాగేడు.

ఇంజన్ స్టార్టయింది!

''హమ్మయ్య! మీకు తెలివితేటలున్నాయి సుమండీ!'' అంటూ రోడ్ రోలర్లాంటి తన కాయాన్ని ఫ్రంట్ సీట్లోకి చేర్చింది జగదాంబ.

ఆంజనేయులు వెంటనే ఇంజన్ ఆఫ్ చేశాడు.

''ఎందుకూ?''

"చెబుతానుండు!" అంటూ జేబులోంచి పాకెట్ డైరీ బాల్ పెన్ తీశాడు అంజనేయులు.

కేబిన్ లోపల లైటు వెలిగించి, స్టీరింగ్ మీద డైరీ వుంచి గబగబ రాయడం ప్రారంభించేడు.

'నా కారు ఫ్రంట్ టైర్ బర్స్ట్ అయిన కారణంగా, విధిలేక మీ స్టేషన్ వ్యాగన్ తీసికెళ్ళవలసి వస్తోంది. గంట లోపల స్పేర్ వీల్ తో తిరిగొస్తాను. దయచేసి మన్నించగలరు.

నా చిరునామా:
క. అంజనేయులు,
8-1-146,
తంబుచెట్టి స్ట్రీట్,
మద్రాసు.'

డైరీలోంచి ఆ కాగితం చింపి, "కూర్చో! ఇప్పుడే వస్తాను." వ్యాన్ దిగాడు అంజనేయులు.

గబగబ తన కారువైపు అడుగులు వేశాడు. ఐదు నిమిషాల్లో చేరుకున్నాడక్కడికి.

రాసిన చీటీని మడతబెట్టి, విండ్ స్క్రీన్ వైపర్ కింద ఇరికించి తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు. ఆ వ్యాన్ తాలూకు మనుషు లెవ్వరైనా వస్తే ఈ చీటీ చూసి, సంతృప్తి పడతారు.

అనుకుంటూ కారు వెనక్కి వెళ్ళి, డిక్కీ తెరిచి, తాము పిక్నిక్ కోసం తీసికెళ్ళిన ప్లాస్టిక్ బుట్టలూ, స్టీలు కేరియర్ వగైరా తీసి, స్టేషన్ వ్యాగన్ వైపు నడిచాడు అంజనేయులు.

మాస్టర్ కీతో వ్యాన్ బ్యాక్ డోర్ తెరిచి, ఆ సామానందులో పెట్టి, కళ్లు చిట్లించాడు. లోపల పెద్ద సైజు కార్డ్ బోర్డ్ పెట్టె కన్పిస్తోందతనికి. దాని కిరువైపులా

ఐ.బి.ఎమ్. అనే పెద్ద పెద్ద అక్షరాలు పెయింట్ చేసున్నాయి.

పెట్టెమీద చెయ్యివేసి కదిపేడు. చాలా బరువున్నట్టు తోచింది. లోపల ఏముందో చూడాలన్న కుతూహలం కలిగిందతనికి.

అంతలో— "మీ తలతిక్క పనతో ఇక్కడే తెల్లారేటుంది. త్వరగా వస్తారా? లేదా?" అన్న జగదాంబ కేకతో, చటుక్కున డోర్ మూసేసి, ఫ్రంట్ సీట్ వైపు వెళ్లాడు.

స్టీరింగ్ ముందు కూర్చుని, ఇంజన్ స్టార్ట్ చేసి, ముందుకు పోనిచ్చాడు.

వ్యాగన్ అన్ని గతుకుల్లోనూ సాఫీగా సాగిపోతోంది.

దాంతో జగదాంబ చిరాకంతా మాయమై, హుషారు చోటుచేసుకుంది. ఒళ్లో వున్న ట్రాన్సిస్టర్ని ఆన్ చేసి, నాలుగైదు స్టేషన్లుతిప్పి, లోకల్ స్టేషన్ మీదికి తెచ్చింది నీడిల్ని.

"శ్రోతలకు ఒక ముఖ్య ప్రకటన! ఈ రోజు మధ్యాహ్నం మూడు గంటలకు నేషనల్ బ్యాంకులో కనీవినీ ఎరగని విచిత్రమైన రీతిలో ఏభై లక్షల దోపిడీ జరిగింది!

మధ్యాహ్నం రెండున్నర ప్రాంతంలో, ఐ.బి.ఎమ్. కంపెనీ యూనిఫాంలు వేసుకున్న ఐదుగురు దొంగలు ఓ నీలిరంగు స్టేషన్ వ్యాగన్‌లో బ్యాంకు వెనకవైపు వచ్చి దిగారు. వాల్ట్ రూంలోవున్న కంప్యూటర్ చెడిపోయినట్లు బ్యాంకు మేనేజర్ తమ కంపెనీకి ఫోన్ చేశాడనీ, కొత్త కంప్యూటర్ తీసుకొచ్చామనీ చెప్పారు అక్కడ కాపలా వున్న వాచ్‌మెన్‌కు.

వ్యాన్‌లోంచి పెద్దసైజు కార్డ్‌బోర్డ్ పెట్టె దించి లోపలికి తీసికెళ్ళారు.

ఆ పెట్టె నాలుగువైపులా ఐ.బి.ఎమ్ అనే అక్షరాలు పెయింట్ చేసున్నాయి. ఆ పెట్టెను వాల్ట్‌రూంలోకి తీసికెళ్ళి, అక్కడున్న ఇద్దరు కేషియర్లనూ, గార్డులనూ మూర్ఛపోగొట్టి, పెట్టెలో నోట్లు నింపుకుని బైటపడ్డారు.

వాళ్ళు పెట్టెని వ్యాన్‌లో పెట్టి పారిపోబోతున్న సమయంలోనే మేనేజర్ అక్కడికి రావడం, హంతకులు అయన్ను కాల్చి చంపడం, అంతలో వ్యాన్ అక్కణ్ణించి పారిపోవడం క్షణాల్లో జరిగిపోయింది...

ఆ తరవాత మిగతా హంతకులుకూడా పరారయ్యారు.

అదృష్టవశాత్తూ ఆ వ్యాన్ నెంబర్ని వాచ్‌మెన్ చూడగలిగేడు. దాని నెంబర్ 8853. ఆ నెంబర్‌గల స్టేషన్ వ్యాగన్ ఎక్కడ కనిపించినా సరే, తక్షణం పోలీసులకి తెల్పి, తగిన బహుమతి పొందవలసిందిగా నగర పోలీస్ కమీషనర్ ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నారు...''

ఆంజనేయులు కాళ్ళు అప్రయత్నంగా క్లచ్ - బ్రేక్ వత్తేశాయి! వ్యాన్ ఒక్క కుదుపుతో ఆగిపోయింది. ఆ కుదుపుకు జగదాంబ తల డేష్‌బోర్డుకు గుద్దుకుంది.

''మళ్ళీ ప్రారంభించారా మీ వానర చేష్టలు!'' అంది మండిపడుతూ.

''అది కాదే, రేడియోలో ఇంతక్రితం వచ్చిన ఆ వార్త విన్నావా?''

''విన్నాను! ఏం?''

''ఆ దొంగలు నీలంరంగు స్టేషన్ వ్యాగన్ ఉపయోగించారు కదూ?''

''ఔను. అవన్నీ మీ కెందు కిప్పుడు?''

"వెర్రిదానా, ఆ వ్యాన్‌లోనే ఇప్పుడు మనం ప్రయాణిస్తోంది!"

"ఏమిటీ!" జగదాంబ నోరు తెరుచుకుంది.

"అంతేకాదు. ఆ దొంగలు నోట్లు నింపుకెళ్ళిన కార్డ్‌బోర్డ్ పెట్టికూడా ఇందులోనే వుంది! నా కళ్ళారా చూశాను."

"మీరూ పెట్టి తెరిచారా?"

"లేదు!"

"ఆ నోట్లింకా అందులో ఉన్నాయో, లేవో!"

"ఉన్నట్టున్నాయి! పెట్టి చాలా బరువుగా వుంది!"

"ఐతే, వెంటనే ఇంటికి పదండి!"

"అమ్మో! ఆ నేరం కాస్తా మనమీదికొస్తే?"

"చాల్లెండి, ఆ స్టేషన్ వ్యాగన్ ఇదేనని ఏమిటి రుజువు? దాని నెంబర్ 8853 అని చెప్పింది అనౌన్సర్. దీని నెంబర్ 1362..."

"దీని రంగుకూడా నీలం కదు టే!"

"పిల్లకాయలా మాట్లాడకండి. వీటిని తయారుచేసిన కంపెనీ ఒక్కటే చేసిందా నీలంరంగు వ్యాను? ఆ పెట్టెలో ఇంకేమైనా ఉండొచ్చు. మళ్ళీ నోరెత్తకుండా నే చెప్పినట్లు పదండి ఇంటికి!"

పెళ్ళాం ముందు నోరులేని పక్షి ఆంజనేయులు. కిక్కురుమనకుండా వ్యాన్ని ముందుకు పోనిచ్చాడు.

కొద్దిసేపటికే మద్రాసు వెళ్ళే మెయిన్‌రోడ్ వచ్చేసింది. వ్యాన్ రోడ్డెక్కగానే ఎడంవైపు తిప్పి స్పీడ్ పెంచాడు.

మైలుదూరం వెళ్ళారో లేదో, ఎదురుగా చెక్‌పోస్ట్ కనిపించింది. అక్కడ బారులుదీరి ఆగివున్నాయి అనేక

వాహనాలు.డజన్లకొద్దీ పోలీసులు అటూ, ఇటూ తిరుగుతూ చెక్ చేస్తున్నారు ఆ వాహనాలని!

"చూశావా, ఎదురుగా పోలీసులు రోడ్ బ్లాక్ చేసి చెక్ చేస్తున్నారు" అన్నాడు ఆంజనేయులు వణికే కంఠంతో.

జగదాంబ కిటికీగుండా అవతలికి తొంగి చూసి, "మీరేం ఖంగారు పడకండి! వాళ్ళు మద్రాసునించి బైటికెళ్ళే వాహనాలనే చెక్ చేస్తున్నారు. బైటినుంచి నగరంలోకెళ్ళే వాహనాలని చూట్టంలేదు" అంది నిర్లక్ష్యంగా.

"నా మాట విను! ఇక్కడే పోలీసులకా పెట్టెగురించి చెప్పేద్దాం!" అన్నాడు ఆంజనేయులు నీళ్ళు నములుతూ.

జగదాంబ మొహం చిట్లిస్తూ భర్తవైపు చూసి, "వాళ్ళీ వ్యాన్ చెక్ చెయ్యడానికి ప్రయత్నిస్తే అలాగే చెప్పండి. లేదా, నోరు మూసుకు కూర్చోండి!" అంది.

అంతలో చెక్‌పోస్టను సమీపించింది వ్యాన్. జగదాంబ అంచనా సరైనదే! పోలీసులు కేవలం మద్రాసు నించి బైటికెళ్ళే వాహనాలనే చెక్ చేస్తున్నారు.

స్టేషన్ వ్యాగన్ వాళ్ళను సమీపించగానే, రోడ్డు కడ్డంగా వున్న కర్ర పైకి లేపి, వెళ్ళమన్నట్లు సైగ చేశారు.

తేలిగ్గా ఊపిరి తీసుకుంటూ ఏక్సిలేటర్ని బలంగా నొక్కాడు ఆంజనేయులు. వ్యాన్ బాణంలా దూసుకు పోతూ గంటలోపల చేరుకుంది తంబుచెట్టి స్ట్రీట్.

ఇంటి కాంపౌండ్‌లో ప్రవేశించగానే, "గ్యారేజ్ దగ్గరాపండి!" అంది జగదాంబ.

గంగిరెద్దులా తలూపి, గ్యారేజ్ ముందు వ్యాన్

ఆపేడు ఆంజనేయులు. తాళం చెవులందుకుని వ్యాన్ దిగింది జగదాంబ. గ్యారేజ్ తాళం తీసి, తలుపులు బార్లా తెరిచింది.

వ్యాన్ని లోపలికి తీసికెళ్ళి ఆపేడు ఆంజనేయులు. జగదాంబ వెంటనే గ్యారేజ్ తలుపులు మూసి, లోపల లైటు వెలిగించింది.

అంతలో ఆంజనేయులు వ్యాన్ వెనక్కి వెళ్ళి బ్యాక్ డోర్ తెరిచాడు.

ఇద్దరూ కలిసి ఆ పెట్టెని అతి ప్రయాసతో కిందికి దించేరు. జగదాంబ వెంటనే పెట్టె మూత ఊడబెరికింది లోపల పేర్చివున్న నోట్ల కట్టలు చూడగానే ఆమె కళ్లు జిగేల్మన్నాయి!

మరుక్షణం ఆమె మొహంలో విచారరేఖలుకూడా పొడసూపేయి. "మీరు చేసిన ఓ మూర్ఖపు పనివల్ల ఈ అదృష్టం కాస్తా మూణ్నాళ్ల ముచ్చటయ్యేట్లుంది మనకు!"

"నేనేం చేశాను?" అన్నాడు ఆంజనేయులు అర్థంగాక.

"ఆ చీటీమీద మనింటి చిరునామా రాసి, అక్కడ వదిలేసొచ్చారుగా? అది ఆ దొంగల కంటబడిందంటే ఇంకేమైనా వుందా?"

"అయ్ బాబోయ్! ఐతే! వెంటనే మనం పోలీసుల్ని కలుసుకుతీరాలి!"

"పిచ్చి పిచ్చి వాగుడు కట్టిపెట్టండి!"

"మరేం చేద్దాం?"

"ముందీ పెట్టెని మన పెరట్లో పాతెయ్యాలి. దోపిడీ హడావుడి తగ్గేవరకూ ఈ డబ్బు జోలికి పోవద్దు మనం! తరవాత మీరు గ్యారేజ్లో వున్న మన కారు స్పేర్ వీల్

తీసుకొని, టాక్సీలో అక్కడికెళ్ళి, కారుకు స్పేర్ వీల్ తగిలించి, శుభ్రంగా వచ్చెయ్యండి! ఈలోగా యీ వ్యాన్ ను ఎక్కడైనా వదిలిరండి!"

"నా సహధర్మచారిణివై వుండి, నన్నొక్కణ్ణీ ఆ నిర్జన ప్రదేశాని కెళ్ళమంటావా జగదం!" అన్నాడు ఆంజనేయులు నీళ్ళు నములూ.

"ఖర్మ! సర్లెండి, నేనూ వస్తాను. ముందీ పెట్టెని త్వరగా పెరట్లో పాతిపెడదాం పదండి!" అంటూ గ్యారేజ్ మూల ఉన్న గునపం అందుకుంది జగదాంబ.

## 8

"నిద్ర రావడంలేదా?" అడిగాడు రజాక్ రిస్టువాచీ చూసుకుంటూ.

రాత్రి పది గంటలవుతోంది.

"లేదు! అబ్రాహాం దయనీయ మరణంతో నా మనసెందుకో ఛిన్నాభిన్నమై పోయింది. కాసేపు కూర్చుంటాను. నువ్వెళ్ళి పడుకో!" అన్నాడు కర్ణన్.

రజాక్ ఆవులిస్తూ లేచి, బెడ్ రూంవైపు నడిచేడు. అబ్రాహాం కోసం తెచ్చిన బ్రాందీని, ఇద్దరూ చెరిసగం లాగించేశారిదివరకే.

రజాక్ వెళ్ళాక, సిగిరెట్ మీద సిగిరెట్ కాలుస్తూ హాల్లోనే కూర్చుండిపోయేడు కర్ణన్. పరిసరాలు నిశ్శబ్దంలో నిదరబోతున్నాయి.

ఆ రహస్య ప్రదేశం తనొక్కడికే తెలుసు. రేపు రజాక్ కు తెలియకుండా తనా ప్రదేశం చేరుకోవాలి. అంబాదాస్ ని మట్టుబెట్టి ఆ డబ్బంతా తనే దక్కించుకోవాలి. అరగంట తరవాత, అతని ఆలోచనలను భగ్నం చేస్తూ, హఠాత్తుగా తలుపు తట్టిన చప్పుడైంది. కర్ణన్ ఉలిక్కిపడి కుర్చీలోంచి లేచాడు.

"ఎవ్వరు?"

"టెలిగ్రాం సార్!" వినిపించింది అవతలినించి.

ఇది అంబాదాస్ ఇల్లు. వాడికే వచ్చుంటుంది టెలిగ్రాం! ఎక్కణ్ణించి వచ్చిందో, ఎవ్వరు చేశారో తన కనవసరమైనా, తీసుకోక తప్పదు.

లేకుంటే ఆ పోస్టల్ ఉద్యోగికి అనుమానం వేస్తుంది. ఇంటికి వచ్చిన టెలిగ్రాంని ఎవ్వరూ నిరాకరించరు మరి!

ఆ ఉద్యోగి తనను పోల్చుకోకుండా కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటున్నట్లు నటించాలి. అనుకుంటూ కర్చీఫ్ తీసి, తలుపు దగ్గరికెళ్ళి, గడియ తీశాడు కర్ణన్.

కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటున్నట్లు అభినయిస్తూ మెల్లిగా తలుపు తెరిచాడు.

ఎదురుగా నిల్చున్నది పోస్టల్ ఉద్యోగి కాదు.

పోలీసులు!!

కర్ణన్ గుండె గుభిల్లుమంది.

వాళ్ళు మామూలు లోకల్ పోలీసులుకూడా కాదు.

క్రైం బ్రాంచి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి, సార్జంట్ డేవిడ్.

ఇద్దరి చేతుల్లోనూ పిస్తోళ్ళు మెరుస్తున్నాయి.

కర్ణన్ని చూడగానే తక్షణం పోల్చుకున్నారు వాళ్లు, బ్యాంక్ రాబర్స్‌లో వాడూ ఒకడని.

"కదలక! చిటికనవేలు కదిల్చినా, ఏమాత్రం తెగించినా మా పన్నెండు గుళ్ళూ నీ గుండెలో కాపరం పెడతాయి జాగ్రత్త!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి పిస్తోలు ఊపుతూ.

కర్ణన్ ఇంకా ఆ షాక్‌లోంచి తేరుకోలేదు. శిలా ప్రతిమలా, రెప్పవెయ్యకుండా వాళ్ళనే చూస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ చిన్నగా నవ్వి- "మేము నిన్నెలా గుర్తు పట్టామా అని ఆశ్చర్యపోతున్నావు కదూ? వ్యాన్‌లో పారిపోయిన మీ అనుచరుణ్ణి తప్ప, మిగతా వాళ్ళని తాను స్పష్టంగా చూశానన్నాడు బ్యాంక్ వ్యాచ్ మెన్. అందులో నీ పోలికలు గల వ్యక్తి తనతో చాలాసేపు బాతాఖానీ కూడా కొట్టాడని చెప్పాడు...

ఆ దోపిడీ గురించి పోలీస్ కమీషనర్ రేడియోలో ప్రకటన జారీచేయించారు. వాళ్ల ఆచూకీ తెల్పినా, ఆ వ్యాన్ వివరాలు తెల్పినా తగిన బహుమతి ఇవ్వబడుతుందని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

గంటక్రితం, ఓ టాక్సీడ్రైవర్ క్రైంబ్రాంచి హెడ్ క్వార్టర్స్‌కు వచ్చి, ఈరోజు మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో, నేషనల్ బ్యాంక్ ప్రాంతంలో పార్క్ చేసున్న తన టాక్సీలోకి, ఐ.బి.ఎమ్. కంపెనీ యూనిఫారాలు తొడుక్కున్న ఇద్దరు వ్యక్తులు హడావుడిగా వచ్చి ఎక్కి, మాంబళం వీధి మొదట్లో దిగారని చెప్పాడు.

మా బలగాన్నంతా ఈ వీధిలో వదిలి, ఇంటింటికీ వెళ్ళి గాలింపు చర్యలు ప్రారంభించాం. అదృష్టవశాత్తూ మీరు నా గాలానికే తగిలారు. నువ్వు తలుపు తెరిచే వరకూ మీరీ ఇంట్లోనే వున్నారని నాకు తెలీదు. దోచుకున్న డబ్బూ, నీ మిగతా అనుచరులూ ఇక్కడే వున్నారన్నమాట! ఆల్ రైట్, చేతులు పైకెత్తి అలాగే వెనక్కి నడు!" అన్నాడు ఆజ్ఞాపిస్తూ.

కర్ణన్ ఒళ్ళంతా చెమటలతో తడిసిపోతోంది. అబ్రాహాం చనిపోయిన సంగతీ, అంబాదాస్ డబ్బుతో మాయమైన సంగతీ ఇన్‌స్పెక్టర్‌కు తెలీదు. రజాక్ లోపలున్నాడు. నిద్రపోతున్నాడు. ఏమిటి చెయ్యడం?

ప్రాణాలు పణంగా పెట్టి పడ్డ శ్రమంతా ఇంత త్వరగా నేలపాలవుతుందని తను ఊహించలేదు.

"సార్జంట్! నువ్వు వీణ్ణి కవర్ జేస్తూ ఇక్కడే వుండు. నేను లోపలికెళ్ళి మిగతా వాళ్ళ సంగతి చూస్తాను..." ఇన్‌స్పెక్టర్ నోట్లోంచి ఇంకా వాక్యం పూర్తికాలేదు.

"ధాం...ధాం...ధాం..." వెనకనించి వరసగా కాల్పులు ప్రారంభమయ్యాయి. మరుక్షణం ఇన్‌స్పెక్టర్ సార్జెంట్ చేతుల్లోని పిస్తోళ్ళు కూడా ఎదురు కాల్పులు ప్రారంభించేయి. ఫైరింగ్ శబ్దాలు తప్ప, ఎవరు ఎవరి మీదా కాల్పులు జరుపుతున్నారో అర్థంకాలేదు క్షణం పాటు.

కన్నుమూసి తెరిచేలోగా ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డీ, సార్జంట్ డేవిడ్, కర్ణన్ ముగ్గురూ మొదలు నరికిన వృక్షాల్లా నేలకూలేరు. ఇన్‌స్పెక్టర్ శరీరంలో మూడు తూటాలు దిగబడ్డాయి. కింద కూలుతూ అతను కర్ణన్ని షూట్ చేశాడు రెండుసార్లు.

బెడ్‌రూం తలుపు పక్కన నక్కి వాళ్ళమీద కాల్పులు జరిపాడు రజాక్. మగత నిద్రలోవున్న అతనికి బైట ఇన్‌స్పెక్టర్ సంభాషణ వినిపించింది. పిల్లిలా లేచి తలుపుపక్క నక్కి అంతవరకూ అవకాశం కోసం ఎదురు చూశాడు.

ఐతే, రజాక్ చాలా దూరంనించి పిస్తోలు పేల్చడం వల్ల సార్జెంట్‌కూ, ఇన్‌స్పెక్టర్‌కూ ప్రాణాంతకమైన ప్రదేశాల్లో తగల్లేదు గుళ్ళు. అందుకే వాళ్ళిద్దరూ నేల కూలి స్పృహ కోల్పోయారు.

ఐతే, కర్ణన్ ఇన్‌స్పెక్టర్‌కు అతి చేరువలో వున్న కారణంగా, అతను పేల్చిన గుళ్లు కర్ణన్ ఛాతీలోనూ,

కడుపులోనూ దిగబడ్డాయి. ముగ్గురూ నేల కూలగానే, బెడ్ రూం తలుపు పక్కనించి ఇవతలికి వచ్చేడు రజాక్.

కర్ణన్ ఇంకా ప్రాణాలు వదల్లేదు. కిందపడి మూలుగుతున్నాడు. రెప్పపాటులో అతన్ని సమీపించాడు రజాక్. కర్ణన్ కళ్లు నిద్ర ముంచుకవస్తున్నట్లు మూతలు పడుతున్నాయి.

చటుక్కున కింద కూర్చుని—"కర్ణన్ కర్ణన్!" పిల్చేడు రజాక్.

కర్ణన్ అతికష్టంమీద కళ్లు తెరిచేడు. అప్పటికే అతని కళ్ళు తాగినవాడిలా బాగా ఎరుపెక్కి వున్నాయి.

"బాధ...భరించలేని బాధ...రజాక్...నేనింక...ఎక్కువసేపు...బ్రతకను...ఆ నీచుడు...అంబాదాస్...మ్ మనల్ని...మోసం చేశాడు. ఆ డబ్బుతో...వాడిప్పుడెక్కడున్నాడో...నాకు తెల్సు...వ్ వెంటనే...వెళ్ళి...వ్ వాడి...అంతు చూడు..." అంటూ అంబాదాస్ తనని తీసికెళ్ళిన రహస్య స్థావరం ఎక్కడుందో పూసగుచ్చినట్లు వివరించి, తల పక్కకి వాల్చేశాడు కర్ణన్.

చేతిలోని పిస్తోలు విరిచి చూసుకున్నాడు రజాక్. అంతక్రితం జరిగిన పోరాటంలో అందులోని గుళ్లన్నీ ఖాళీఅయ్యాయి. దాన్ని కిందపడేసి, గబగబ కర్ణన్ జేబులు వెదికేడు. కర్ణన్ ఇంతవరకూ పిస్తోలు ఉపయోగించలేదని అతనికి తెలుసు.

దాన్నందుకుని లేచాడు రజాక్. ఇక తనిక్కడ ఎక్కువసేపుండకూడదు. పిస్తోళ్ళు పేలిన శబ్దాలు వీధిలో తిరుగుతున్న పోలీసులు వినివుంటారు. ఏ క్షణంలోనైనా వాళ్ళిక్కడికి పరుగెత్తుకొస్తారు.

కర్ణన్ కు స్వంత మోటర్ సైకిల్ వుంది. అదిప్పుడు గ్యారేజ్ లోనే వుండివుంటుంది. క్షణం వృధా చెయ్యకుండా బైటికి పరిగెత్తాడు రజాక్.

గ్యారేజ్ లో కనిపించింది మోటర్ బైక్. రెప్పపాటులో దాన్ని స్టార్ట్ చేసి, గేటువైపు పోనిచ్చేడు.

గేటు దాటగానే ఎడంవైపు తిప్పి వేగం హెచ్చించాడు. కొద్దిసేపట్లోనే అనేక రోడ్లు కట్ చేసి, మహాబలిపురం వెళ్ళే రోడ్డుమీద పరిగెత్తసాగింది మోటర్ బైక్.

నగరందాటిన కాసేపటికి, ఫర్లాంగు దూరంలో రోడ్డుకిరుపక్కలా ఆగివున్న వాహనాలు కనిపించేయతనికి. సందేహంలేదు. పోలీసులు వచ్చేపోయే వాహనాలని చెక్ చేస్తున్నారు. ఆ ఛాయలకి వెళ్ళడం ప్రమాదం!

ఇంజన్ ఆఫ్ చేసి, హెడ్ లైట్ ఆర్పి, మోటర్ సైకిల్ని రోడ్డు ఎడంవైపు తోసి, రోడ్డు కుడివైపు దిగి, అడ్డదారిన పరుగుతీశాడు.

కర్ణన్ చెప్పిన ప్రదేశాన్ని సమీపించేసరికి రెండు గంటలు పట్టింది.

అంతలో ఎదుటినుంచి పొదలని చీల్చుకుంటూ ఏదో కారు వస్తున్నట్టు కనిపించి, చటుక్కున ఓ చెట్టుగుబురు వెనక్కి తప్పుకున్నాడు.

# 9

ఆ దంపతులిద్దరూ స్టేషన్ వ్యాగన్ లో వెళ్ళిపోయిన గంట తరవాత గానీ అంబాదాస్ గుండెనొప్పి తగ్గలేదు. ఇప్పుడతనికి నరనాడులన్నీ యథాస్థితికి వచ్చి, శక్తిని పుంజుకుంటున్నాయి.

జేబులోంచి మరో రెండు కాంపోస్ మాత్రలు తీసి నోట్లో వేసుకున్నాడు. నీళ్ళవసరం లేకుండానే వాటిని

గటుక్కున మింగేశాడు. అతని బుర్రలో అగి ఆగి అనేక ప్రశ్నలు ఉత్పన్నమౌతున్నాయి.

ఆ దంపతు లెవరు? తమ స్టేషన్ వ్యాగన్ తీసుకెళ్లడం తను పొదలలోంచి చూశాడు. ఎందుకు తీసికెళ్ళారు? అసలీ నిర్జన ప్రదేశానికి వాళ్ళెలా రాగలిగేరు?

అప్పుడు తట్టింది అంబాదాస్‌కు, వాళ్ళింతదూరం కాలి నడకన రావడం అసంభవం గనక, కార్లోనో, స్కూటర్ మీదో వచ్చుంటారని.

టార్చిలైట్ అందుకుని, మెల్లిగా లేచి నిల్చున్నాడు. అడుగులో అడుగు వేసుకుంటూ గుహ ముఖద్వారం దగ్గర నిల్చున్నాడు. కొమ్మలూ, రెమ్మలూ విడదీసి, బైట అడుగు పెట్టాడు. చుట్టూ మసక చీకటి కమ్ముకుంది.

టార్చి ఫోకస్ చుట్టూ దూరదూరం వరకూ వేసి చూశాడు. ఎడంవైపు కొద్దిదూరంలో ఏదో వాహనం ఆగివున్నట్టు కానవచ్చింది. చీకట్లో చిరుదివ్వెలా కనిపించిన ఆ వాహనంవైపు సాధ్యమైనంత త్వరగా అడుగులు వెయ్యసాగేడు.

రెండు నిమిషాల్లో చేరుకున్నాడక్కడికి.

అది ఫోర్డ్ కారు! దాని విండ్ స్క్రీన్ వైపర్ క్రింద ఏదో కాగితం ఇరికించి వున్నట్టుతోచి, చటుక్కున దాన్నందుకుని చూశాడు. మరుక్షణం అంబాదాస్ కళ్ళు జిగేల్ మన్నాయి.

ఇహ ఒక్క క్షణంకూడా అక్కడుండ లేదు. ఆచీటీ చూడగానే అంబాదాస్‌కు తన శరీరంలో వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టు తోచింది.

గబగబ అడుగులు వేస్తూ తిరిగి పొద దగ్గరికి నడిచేడు. గుహలో ప్రవేశించి, ఓ మూల వున్న సూట్ కేస్ తెరిచాడు.

అంబాదాస్ ఆరితేరిన నేరస్థుడు! నేరం చేశాక, ఎప్పుడే సమస్య ఉత్పన్నమౌతుందో, దాన్నెలా ఎదుర్కోవాలో అతనికి బాగా తెలుసు. ఆ సూట్ కేస్ లో సాధారణ బట్టలతో బాటు, కొన్ని విగ్గులూ, ఇతర మేకప్ సామాన్లూ నిండి వున్నాయి.

సూట్ కేస్ కింద బోర్లించి, మేకప్ సామాను విడదీసి పక్కన పెట్టాడు. ఓ అద్దం ముక్క ముందుంచుకుని, చక చక ప్రారంభించేడు మేకప్ చేసుకోడం.

అరగంట తరవాత ఆ గుహాలో అంతవరకూ వున్న అంబాదాస్ అదృశ్యమై ఓ చర్చి ఫాదర్ ప్రత్యక్ష మయ్యేడు.

భుజాలవరకూ పడుతున్న తెల్లని జుత్తు, బారెడు గడ్డం, పండిపోయిన కనుబొమలు, మొహంమీద అక్కడక్కడా ముడతలు, కళ్ళల్లో వాత్సల్యం, పాదాలవరకూ వేళాడుతున్న పాలనురుగులాటి తెల్లని గౌను. మెడలో గొలుసు. ఆ గొలుసు చివర ఛాతీమీద వేళాడుతున్న క్రాసు.

అద్దంలో ఆ అవతారాన్ని చూసి, చిన్నగా నవ్వుకున్నాడు అంబాదాస్. ఆ మేకప్ కు ఫైనల్ ఫినిషింగ్ ఇస్తూ, మహాత్మాగాంధీ టైపు గుండ్రని అద్దాలుగల కళ్ళజోడు పెట్టుకున్నాడు.

ఇప్పుడతన్ని ఏ ప్రబుద్ధుడైనా చూస్తే రెండుచేతులూ జోడించి భక్తి ప్రపత్తులతో దండంపెట్టక మానడు!

పక్కనున్న పిస్తోలందుకుని విరిచి చూసేడు. ఛేంబర్లో నిండుగా నిదరబోతున్నాయి గుళ్ళు. సేఫ్టీ కాచ్ బిగించి గౌను జేబులో వేసుకున్నాడు దాన్ని.

ఆ చీటీ అందుకుని, మరోసారి ఆంజనేయులు ఇంటి అడ్రస్ చూసుకున్నాడు.

అంబాదాస్ మస్తిష్కంలో ఆ చిరునామా శాశ్వతంగా ముద్రించుకుపోయింది. అది ఆంజనేయులు చిరునామా కాదు. యాభై లక్షల అడ్రసు.

ఇక తాత్సారం చెయ్యకూడదు. అడుగులో అడుగు వేసుకుంటూ గుహ చివరి కెళ్ళాడు. అక్కడున్న తన అంబాసిడర్ మీంచి కొమ్మలు తొలగించి, లోపల కూర్చున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేసి, హెడ్ లైట్లు వెలిగించి, ముందుకు పోనిచ్చాడు.

పొదల బైటికి రాగానే కుడివైపు తిప్పి స్పీడ్ హెచ్చించాడు. ఐనా, గతుకుల దారి గనక, కారు నెమ్మదిగా నడుస్తోంది. ఫర్లాంగు దూరం వెళ్ళాక ఓ పొద ముందు నుండి వెళ్ళసాగింది కారు.

చీకట్లో ఆ పొద వెనక నిల్చున్న రజాక్ దృష్టి ఆ కారుమీదా, డ్రైవింగ్ సీటుమీదా పడగానే ఉలిక్కి పడ్డాడు.

అది అంబాదాస్ అంబాసిడర్.

ఈ నిర్జన ప్రదేశంలో, ఆ కారును ఒక ఫాదర్ నడుపుతూ వెళ్ళడం ఏమిటి? వుంది ఏదో మిస్టరీ.

అంబాదాస్ జిత్తులమారి నక్క. వాడే ఆ ఫాదర్ వేషం వేసుకు వెళుతున్నాడేమో. బహుశా, డబ్బుతో పలాయనమౌతున్నాడేమో?

కారు పొద దాటగానే, చటుక్కున చీకట్లోంచి బైటికి వచ్చి, అటు పరుగుతీశాడు రజాక్.

దారి బాగులేనందువల్ల నత్తనడక నడుస్తోంది కారు. రెండు నిమిషాల్లో చేరుకున్నాడు దాని దగ్గరికి.

ముందుకు చూస్తూ డ్రైవింగ్ గొడవలో వున్నాడు అంబాదాస్.

ఎగిరి కారు వెనక బంపర్ మీద కూర్చున్నాడు రజాక్. కాసేపలా కూర్చుని, చడీ చప్పుడూ చెయ్యకుండా డిక్కీ మూత తెరిచి చూశాడు. డిక్కీలో నోట్లపెట్టె లేదు.

కారు బాక్ సీట్లో పెట్టుకున్నాడా? ఇదీ ఒకందుకు మంచిదే అయింది. తను డిక్కీలో దూరి, వాణ్ని వెంబడించవచ్చు. అనుకుంటూ డిక్కీలో ప్రవేశించి, పైన మూత వేసుకున్నాడు రజాక్.

అంతలో మద్రాసు వెళ్ళే రోడ్డును సమీపించింది కారు. రోడ్డెక్కగానే ఎడంవైపు తిప్పి ఫుల్ స్పీడ్‌తో పోనివ్వసాగేడు అంబాదాస్.

అరగంట తరవాత నగరాన్ని సమీపించింది కారు.

ఎదురుగా అనేక వాహనాలు నిల్చున్నట్టు కనిపించడంతో స్పీడ్ కాస్త స్లో చేశాడు. పోలీసుల సోదా ఇంకా నడుస్తూనే వుంది. వాళ్ళని చూసి ఏమాత్రం చలించలేదు అంబాదాస్. నగరంనించి బైటికెళ్ళే కార్లనే వాళ్ళు చెక్ చేస్తున్నారని అతనికి తెలుసు.

ఏభై లక్షల దోపిడీకి మూలకారకుడైన అంబాదాస్‌ని పోలీసులు ఆపలేదు. పైగా, ఎంతో గౌరవం చూపుతూ, చెక్‌పోస్ట్ దాటనిచ్చేరు.

అంబాసిడర్ని వాయువేగంతో పోనిస్తూ గంట తరవాత తంబుచెట్టి, స్ట్రీట్‌లో ప్రవేశించేడు అంబాదాస్.

ఆ వీధిలో, నెంబర్ 3-1-146 డాబా ఇల్లు కనుక్కోడం అతనికేమంత కష్టం కాలేదు. తెరిచివున్న గేటు గుండా కాంపౌండ్‌లోకి తిప్పేడు కారుని.

సరిగ్గా అదే సమయంలో, డబ్బుగల పెట్టె పెరట్లో

పాతి, గ్యారేజ్ వైపు వెళుతున్న ఆంజనేయులూ, జగదాంబా కారు హెడ్ లైట్లు చూసి ఆగిపోయేరు.

అంబాదాస్ వాళ్ళకెదురుగా కారాపి దిగేడు. వేళ గాని వేళ తమ ఇంటికి ఓ ఫాదర్ రావడంతో ఆ దంపతులు చకితులై చూస్తున్నారు.

అంబాదాస్ వాళ్ళని సమీపించి "ఆంజనేయులు మీరేకదూ?" అడిగేడు చాలా మర్యాదగా.

"ఔను. మీరు?"

"నన్ను రెవరెండ్ జాన్ బాబు అంటారు! మీతో కాస్త మాట్లాడాలి."

"ఏం మాట్లాడాలి? అడిగింది జగదాంబ.

"డబ్బు విషయం."

"క్షమించాలి. మేము చర్చిలకి చందాలివ్వం. ఐనా, చందాలడగడానికో వేళా పాళా వుండాలి. ఇదా సమయం?" అంది జగదాంబ నిర్మొహమాటంగా.

అంబాదాస్ నవ్వి-"మీరు పొరబడుతున్నారు. నేను చందాకోసం రాలేదు" అన్నాడు సౌమ్యంగా.

"మరి?"

"యాభై లక్షలతో నిండి వున్న ఆ పెట్టికోసం వచ్చాను."

నెత్తిన పిడుగులు పడ్డట్టు అదిరిపడ్డారా దంపతులు.

ఆంజనేయులు మొహం చూడగానే పసిగట్టేశాడు అంబాదాస్ వాళ్ళకా పెట్టిగురించీ, అందులో వున్న ధనం గురించీ తెలిసిపోయిందని.

జగదాంబ వెంటనే తమాయించుకుని — "ఏ పెట్టి? ఏ డబ్బు? మీరంటున్నదేమిటో అక్షరం ముక్క అర్థమై చావడంలేదు మాకు" అంది డబాయిస్తూ.

అంతవరకూ చిరు దరహాసం చిలకిస్తున్న అంబాదాస్ మొహం క్రూరంగా మారిపోయింది. గౌన్ జేబులో చెయ్యిపెట్టి, "ఇప్పుడే అర్థమాతుంది!" అంటూ బైటికి తీశాడు.

ఆ చేతిలో పొగలు కక్కడానికి సిద్ధంగా వున్న పిస్తోలు చూడగానే ఆ దంపతుల గుడ్లు బైటికి వచ్చేయి.

"ఏమిటిది?" అంది జగదాంబ కంఠం పెగుల్చుకుని.

"పిస్తోలు చేబీ, పిస్తోలు. బొమ్మ పిస్తోలనుకునేవు. కావాలంటే, గున్న ఏనుగులాటి నీ శరీరాన్ని ఒక్క గుండుతో నేల కరిపించగలను... అరిచి గోలచెయ్యడానికి ప్రయత్నించారంటే, ఆ క్షణంలో హరీమంటారు జాగ్రత్త. ఊఁ,బుదిగా ఇంట్లోకి నడవండి!" అన్నాడు అంబాదాస్ పిస్తోలు ఊపుతో.

ఇద్దరూ సర్కస్ కునకాల్లా ఆ రింగ్ మాస్టర్ ఆజ్ఞానుసారం ఇంటివైపు నడిచారు. ఆంజనేయులు గజగజ వణుకుతూ, తలుపు తాళం తెరిచాడు. ముగ్గురూ ఇంట్లో అడుగు పెట్టగానే చటుక్కున తలుపు గడియపెట్టి వెనుదిరిగాడు అంబాదాస్.

"ఇదంతా నీవల్లే జరిగింది. అప్పుడే పోలీసుల్ని కలుసుకుందామంటే విన్నావా?" అన్నాడు ఆంజనేయులు భార్యని.

"కాదు. అంతా మీ మందబుద్ధివల్లే జరిగింది. మన ఇంటి అడ్రస్ రాసిన చీటీ అక్కడే వదలడంవల్లే కదా, ఇతనిక్కడికి రాగలిగేడు?" అంది జగదాంబ మండిపడుతూ.

"ముందా పెట్టె ఎక్కడ పెట్టారో చెప్పి, తరవాత తీరిగ్గా పోట్లాడుకోండి..." అరిచాడు అంబాదాస్.

"పెరట్లో పాతిపెట్టాం!" అన్నాడు ఆంజనేయులు గజగజ వణుకుతూ.

అంబాదాస్ ఏదో అనడానికి నోరు తెరిచాడు.

సరిగ్గా అదేక్షణంలో తలుపు తట్టిన చప్పుడయింది! ముగ్గురూ వులిక్కిపడ్డారు.

"ఎవరొచ్చారు?" అడిగేడు అంబాదాస్.

"నా స్నేహితుడు రామోజీరావయుంటాడు. మేము పిక్నిక్‌నించి రాగానే వచ్చి కలుస్తానని చెప్పేడు." అన్నాడు ఆంజనేయులు.

"ఆల్ రైట్! తలుపు కొద్దిగా తెరిచి, అలసివున్నావనీ రేపొచ్చి కలవమనీ చెప్పు. ఈ వాక్యాలకు మించి ఒక్క అక్షరం నీనోట్లోంచి వెలువడ్డా నీ భార్యని కుక్కని కాల్చినట్టు కాల్చిపారేస్తాను. నేను సోఫాలో కూర్చుని పిస్టలుతో కవర్ చేస్తుంటాను." అంటూ సోఫావైపు నడిచేడు అంబాదాస్.

జగదాంబ బిక్కుబిక్కుమంటూ ఓ పక్కగా నిలబడింది.

అంబాదాస్ సోఫాలో కూర్చుని, గోను చాటున పిస్తోలు దాచి. తలుపువైపు గురిపెట్టి వుంచేడు.

అడుగులో అడుగు వేసుకుంటూ తలుపువైపు నడిచేడు ఆంజనేయులు.

# 10

కారు డిక్కీలోంచి అంబాదాస్‌కూ, ఆ దంపతులకూ జరిగిన వాగ్వివాదాన్ని చెవులు రిక్కించి విన్నాడు రజాక్. అప్పుడర్థమైందతనికి అసలు సంగతి!

తరవాత, అంబాదాస్ ఆ దంపతుల్ని పిస్తోలుతో బెదిరించి, ఇంట్లోకి తీసికెళ్ళడం, తలుపులు మూసుకున్న శబ్దం వినిపించడంతో తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటూ డిక్కీ మూత తెరిచి బైటపడ్డాడు.

జేబులోంచి పిస్తోలు తీసి, సేఫ్టీ కాచ్ వెనక్కిలాగి, అడుగులో అడుగు వేసుకుంటూ తలుపువైపు నడిచేడు. తలుపుముందాగి చెవులు నిక్కబొడిచి, లోపల జరుగుతున్న సంభాషణ వినసాగేడు.

ఆంజనేయులు ఆ పెట్టిని పెరట్లో పాతిపెట్టామని చెప్పగానే, తలుపుమీద టకటక వాయించేడు రాజాక్.

లోపల కాసేపు గుసగుసలు వినిపించేయి. ఎవ్వరో తలుపు దగ్గరికే వస్తున్నారు. తలుపు కవతల ఆగిపోయింది శబ్దం. గడియ తీస్తున్న సవ్వడి.

తయారుగా నిల్చున్నాడు రజాక్.

తలుపు కొద్దిగా తెరుచుకుంది. బైటికి తొంగిచూశాడు ఆంజనేయులు.

అంతే!—

బలంగా ఒక్కతోపుతోశాడు రజాక్ అతన్ని వెనక్కి. ఆంజనేయులు అమాంతం వెనక్కి పడిపోయాడు.

లోనికి మారుతూ రెండుసార్లు పిస్తోలు పేల్చాడు రజాక్.

గుళ్ళు రెండూ గురి తప్పకుండా వెళ్ళి, అంబాదాస్ గుండెల్లో దిగబడ్డాయి. అతని నోట్లోంచి కనీసం చిన్న అరుపుకూడా బైటికి రాలేదు.

అలాగే ఒరిగిపోయేడు సోఫాలో.

"లే!" అరిచాడు రజాక్ పిస్తోలు ఊపుతూ.

ఇంకా కిందపడి వణుకుతున్న ఆంజనేయులు చటుక్కున లేచి నిల్చున్నాడు.

"పదండి పెరట్లోకి. ఆ పెట్టి ఎక్కడ పాతారో చూపండి" అన్నాడు రజాక్ కర్కశంగా.

దంపతులిద్దరూ తోలుబొమ్మల్లా తలలూపి, పెరట్లోకెళ్ళే తలుపువైపు కదిలేరు.

తలుపు మూద్దామని వెనుదిరిగిన రజాక్, వెయ్యి పిడుగులు ఒకేసారి నెత్తిన కురిసినట్లు అదిరిపడ్డాడు.

తలుపు దగ్గర డజనుమంది కానిస్టేబుళ్లతో నిల్చున్నాడు అసిస్టెంట్ పోలీస్ కమీషనర్. వాళ్ళ ఆయుధాలన్నీ అతనివైపే గురిపెట్టి వున్నాయి.

రజాక్ చేతిలోంచి అప్రయత్నంగా పిస్తోలు జారి కింద పడిపోయింది.

“నీ ఆచూకీ మాకెలా తెలిసిందా అని ఆశ్చర్యపోతున్నావు గదూ? మాంబళంలోని ఆ ఇంట్లో నువ్వు ఇన్ స్పెక్టర్ రాజారెడ్డినీ, సార్జంట్ డేవిడ్ నీ గాయపరిచాక కొన ఊపిరిలో వున్న నీ అనుచరుడు-దోచుకున్న డబ్బూ, మీ నాయకుడూ ఎక్కడున్నాడో నీకు వివరించి, ప్రాణం విడిచాడు.

ఇన్ స్పెక్టర్ గాయపడ్డాడే కాని, పూర్తిగా మూర్ఛపోలేదు. నీ అనుచరుడు నీతో చెప్పిన వివరాలన్నీ వినగలిగేడు.

నువ్వు మోటర్ బైక్ మీద వెళ్ళిన కొద్ది సేపటికే, పిస్తోళ్ళ శబ్దములు విన్న మా సిబ్బంది ఆ ఇంట్లో ప్రవేశించారు. అప్పుడు చెప్పాడు ఇన్ స్పెక్టర్ వాళ్ళకు జరిగిందంతా.

నేను వెంటనే ఇద్దరు సబిన్ స్పెక్టర్లకు ట్రాన్స్ మీటర్లిచ్చి, నిన్ను ఫాలో చెయ్యమని పంపేను...మహాబలిపురం వెళ్ళే రోడ్డుమీద వాహనాలు చెక్ చేస్తున్న పోలీసుల్ని చూడగానే నువ్వు మోటర్ బైక్ రోడ్డుపక్కన పడేసి, కాలి నడకన, అడ్డదారిన బయలుదేరావ్.

ఇన్ స్పెక్టర్లిద్దరూ ఆ విషయం మాకు తెలీజేసి, తమ వాహనాలు అక్కడే వదిలి నిన్ను వెంబడించారు. నువ్వా రహస్యప్రదేశం చేరగానే పొదల్లోంచి ఓ అంబాసిడర్

బయటికి రావడం, నువ్వా కారు డిక్కీలో దూరడం చూసి, వెంటనే ఆ కారు రంగూ, నెంబరూ మాకు తెలీ శేశారు...

చెక్‌పోస్ట్ దగ్గర కావాలనే మేమా కారును పాస్ చేసి, వ్యాన్‌లో వెంబడించి ఇక్కడికి చేరాం. మా బలగం ఈ ఇంటిని చుట్టుముట్టేలోగా నువ్వు నీ బాస్‌ని కాల్చేశావ్ ... మీ ఐదుగురు దొంగల్లో ఇక మిగిలింది నువ్వొక్కడివే!

అదృష్టవశాత్తూ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డీ, సార్జంట్ డేవిడ్‌లు నీ ఆయుధానికి ఆహుతి కాలేదు. ఇప్పుడు సురక్షితంగా హాస్పిటల్లో చికిత్స పొందుతున్నారు..." అన్నాడు అసిస్టెంట్ పోలీస్ కమీషనర్ నవ్వుతూ.

రజాక్ చేతికి బేడీలు పడ్డాయి. దంపతులిద్దరూ తెల్లబోయి చూడసాగారు.

—: ఐపోయింది :—

## " ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ "

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 15 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పైసలు స్టాంపులు షంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చేనెల మాస పత్రికలో చూడండి. *

## " హోమ్ డెలివరీ "

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరుకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి.తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలి-వరీ' లో పంపగలము. *



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## ఉపయోగం?

దారినపోతున్న రంగారావుకి ఒక సంచిలో నాలుగు రకాల మారణాయుధాలు దొరికాయి.

అందులో వున్నవన్నీ రకరకాల పిస్తోళ్లు.

వాటిని యెలా వుపయోగించాలో తెలియని రంగారావు ఎదురుగా వస్తున్న ఒక ఆసామిని ఆపి, వాటిగురించి చెప్పమన్నాడు.

ఆ వ్యక్తి ఓపికగా వాటి వివరాలు యెలా వుపయోగించాలో వివరించి, ఆఖరుసారిగా సైలెన్సర్‌ని చూపిస్తూ "దీంతో ఎవర్నైనా చంపావంటే ప్రక్కనున్న వాడికి కూడా శబ్దం వినిపించదు" అని చెప్పాడు.

రంగారావు అటూ యిటూ చూసి, ఆ సైలెన్సర్‌తోనే ఆ ఆసామిని చంపేసి, అతడి చంకలోవున్న జిప్‌బేగ్‌తో పరారైపోయాడు.

—కాళ్ళగోవిందరావు, ఆమదాలవలస.

## "బక్కపలచని—బలవర్ధని"

ఆరోగ్యానికి సంబంధించిన మందులు తయారుచేసే బోగస్ సంస్థ "బలవర్ధని" అనే మందు తయారుచేసి, "బక్క పలచని వారిని సైతం లావుగా మార్చగలదు" అంటూ పేపర్లో ఇలా ప్రకటన వేసింది.

"మా మందు వాడకముందు" అని వ్రాసి దానిక్రింద ఒక బక్కపలచని మనిషి ఫోటో వేసింది. తరువాత అతనిదే స్థూలంగావున్న మరో ఫోటోను "మా మందు వాడిన పిదప" అనే మకుటం కింద వేసింది.

ఈ ప్రచారం జనాన్ని బాగా ఆకట్టుకొంది. లావు కావా లనుకొనే వాళ్ళందరూ ఎగబడి ఆ మందు కొని, వాడి, ఫలితం శూన్యంకాగా నిరాశపడి ఆ మందుల కంపెనీని తిడుతూ ఉత్తరాలు వ్రాశారు.

"తిస్తే తిట్టారు మనకు బోలెడు ఆదాయం లభించింది చాలు," అన్నాడు జనరల్ మేనేజరు.

"మనప్రచారం జనంమీద బాగా పనిచేసింది. మరిదాన్ని ఎలా రూపొందించారు?" అన్నాడు అసిస్టెంట్ మేనేజర్.

"ఓహ్ అదా! బాగా స్థూలంగావున్న వాణ్ణి ఒకణ్ణి వెతికిపట్టి ఒక ఫోటో తీసాను. తరువాత వాడికి ఓ పదిహేను రోజులు "బలవర్ధని" మందు ఇచ్చాను. అంతే వాడు చీపురుపుల్లలా అయ్యాడు. అప్పుడు మరో ఫోటో తీసి, ఆ ఫోటో వేసి, తారుమారుగా మకుటాలు వేసి ప్రచారంచేశాం. అంతే" అన్నాడు తాపీగా జనరల్ మేనేజర్.

—గంగిశెట్టి శివకుమార్, గూడూరు.

## ఈ ప్రశ్నకు బదులేది?

ఒక మాసపత్రికలో పాఠకుల ప్రశ్నలకు జవాబులు రాస్తున్న ఒక డాక్టరుకు, ఒక పాఠకుడిదగ్గర నుండి ఒక ఉత్తరం ఇలా వచ్చింది.

"డాక్టర్! నాకు చచ్చిపోవాలని వుంది. శరీరానికి ఎటు వంటి కష్టంలేకుండా చచ్చిపోవటానికి ఎన్ని రకముల

పాయిజన్స్ ఉన్నవి? వాటిలో ఏ పాయిజన్ 'క్విక్'గా పనిచేస్తుంది?"

—ఎన్. రామారావు, రాయగడ.

## వెనుకటి జీవితం!!

"ఇదిగో మావోయ్! ఇంద ఈ పదిరూపాయలట్టుకెళ్ళి పిల్లాడికి 'డాక్టరుబాబు' రాసిన మందు లట్టుకురా!" అంది మాలక్ష్మి.

"హోసోస్! అదెంతసేపూ ఇలాగెల్లి అలా లగెత్తుకు రానూ!" అంటూ భార్యచేతిలోని పదిరూపాయల నోటునూ డాక్టర్ రాసిన 'చీటీ'నీ అందుకున్నాడు సూరిగాడు.

చీటీనీ పదిరూపాయల నోటునూ నిక్కరు జేబులో పెట్టుకొని పాకలోనుండి బయటకొచ్చాడు. పాకముందున్న రిక్షాను పేటలో నుండి రోడ్డుమీదకు లాక్కెళ్ళి సీటెక్కి రిక్షా తొక్కసాగాడు.

ఆ రోడ్డుపై సాఫీగా సాగిపోతుంది రిక్షా. హుషారుగా 'ఈల' వేసుకుంటూ త్రొక్కుతున్నాడు సూరిగాడు. తొక్కుతూనే తన మునుపటి జీవితానికీ ఇప్పటి జీవితానికీ మధ్యనున్న మార్పులనూ ఆ మార్పులు తెచ్చిన లాభ నష్టాలనూ 'బేరీజు' వేసుకుంటున్నాడు.

తలచుకుంటున్న కొలదీ ఈ జీవితమే ఎంతో ఆనందం అనిపించసాగింది సూరిగాడికి. పగలంతా రిక్షా తొక్కి సంపాదించగా వచ్చిన డబ్బులతో తనూ, మాలచ్మి, పిల్లాడూ, ముగ్గురికీ ఆనందంగా గడిచిపోగా యింకా నాలుగు డబ్బులు మిగులుతూనే వున్నాయి. ఒకడికి భయ పడాల్సిన పనిలేదు. కష్టపడడం సంపాదించడం ఆనందంగా గడపడం.

కాని గతంలో—

ఇలా కాదు. అది ఉత్త 'ముళ్ళదారి'. ఉదయం నుండీ సాయంత్రం వరకూ ఎవరి జేబులు బరువుగా వున్నాయో వెదకడంతోనే సరిపోయేది. తీరా జేబు కనబడిన తరువాత ఏ పోలీసోడి కంటా బడకుండా దాన్ని కత్తిరించేదాకా గుండె లదురే। అందుకే ఆ జీవితాన్ని వదలి రిక్షా చేపట్టాడు.

తన ముందుజీవితంలో అవలీలగా జేబులు కత్తిరించే వాడు సూరిగాడు. కానీ ఇప్పుడు 'పాకెట్‌మార్' సూరిగాడు కాదు రిక్షాసూరిగాడు.

రిక్షా ఒక మందులషాపు ముందాగింది. తన మాసిన నిక్కరు జేబులోనుండి మాయని పదిరూపాయల నోటునూ చీటీనీ తీసి చేత్తో పట్టుకొని షాపులోకి నడిచాడు సూరిగాడు. కౌంటర్‌ముందు నిలుచున్నాడు.

సూరిగాడి ప్రక్కనే ఎవరో ఒక దొర (సూరిగాడి దృష్టిలో) నిలబడివున్నాడు. బెల్‌బాటమ్ పాంట్, పులులూ, మేకలూ, బొమ్మలతో నున్న షర్ట్‌తో, చేతిలోనున్న 'పర్సు'లోని నోట్లను లెక్కపెట్టుకుంటున్నాడు. సేల్స్‌మాన్ దొరగారడిగిన మందులు తీసి యిస్తున్నాడు.

దొర ఒకసారి ప్రక్కకు తిరిగి సూరిగాడివైపు చూశాడు. అప్పుడే సూరిగాడు కూడా దొరవైపు చూశాడు. దొర వెంటనే తన పర్సును పేంట్‌వెనక జేబులో పెట్టేసుకుని సూరిగాడి చేతిలోనున్న పదిరూపాయల నోటువై ఒకసారి చూసి దృష్టిని సేల్స్‌మాన్ వైపు మరల్చాడు.

"సార్। ఇవిగోనండి మీ మందులూ ప్రిస్క్రిప్షన్" అంటూ దొరగారికి అందించాడు సేల్స్‌మాన్.

"బిల్!" అడిగాడు దొర.

"డబ్బులివ్వందే బిల్ యెలాయిస్తాం? డబ్బులివ్వండి!"

"ఇప్పుడిక్కడ పదిరూపాయల నోటు పెట్టానుగా!" అంటూ సూరిగాడు నిల్చున్నవైపు చూపి తనూ చూసాడు దొర.

"ఏవీ ఇక్కడ లేవే! మర్చిపోయుంటారు మరొక్క సారి చూసుకోండి" అన్నాడు సేల్స్‌మాన్.

"వాట్! నాన్సెన్స్ నే నిప్పుడిక్కడ పెట్టాను." సీరియస్‌గా అన్నాడు దొర. సూరిగాడికెందుకో అనుమానమేసి తన పదిరూపాయల నోటును గట్టిగా పట్టుకున్నాడు.

"ఇదిగో బెగ్గర్! వీడు తీసేసినట్టున్నాడు" అంటూ సూరిగాడి చెయ్యి పట్టుకున్నాడు దొర.

"ఇది నాదీ! నేను ఈ మందులకోసమొచ్చాను" అన్నాడు సూరిగాడు.

దొర చేయి వెంటనే గాలిలోకి లేచింది. మరుక్షణం సూరిగాడి చెంపను తాకింది. "యూ బెగ్గర్! నే నిప్పుడిక్కడ పెట్టిను నోటును తీసేసి నీదంటావా?" పళ్లు కొరుకుతూ అన్నాడు దొర.

సేల్స్‌మాన్‌తోపాటు అక్కడున్న కొద్దిమందీ సూరిగాడి వైపు చూచారు. మాసిన బనియనూ, చిరిగిన నిక్కరూ, చింపిరి జుత్తూ మురికితో కూడుకున్న వళ్లూ. సూరిగాడి రూపాన్ని చూసిన వారెవ్వరూ ఆ పదిరూపాయలనోటు సూరిగాడిదేనని చెప్పలేకపోయారు. (పదిరూపాయలు పట్టుకోగలిగేవారు వారిదృష్టిలో దొరలాగా వుండాలేమో!)

దొర బలవంతంగా నోటును లాగబోయాడు. సూరిగాడు ఆ నోటు తనదని బ్రతిమాలాడు. ప్రమాణాలు చేశాడు. ఆ తరువాత ఇవ్వనని పెనుగులాడాడు. ఫలితంగా మరో రెండుసార్లు చెయ్యి చేసుకున్నాడు దొర.

సూరిగాడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వెంటనే మెదడులో ఒక ఆలోచన మెరిసింది. ఆఖరుసారిగా మరొక్కసారి పెనుగులాడి నోటు వదిలేసాడు. నీళ్ళు తిరుగుతున్న కళ్ళతో రిక్షాను చేరుకున్నాడు.

* * *

రిక్షా ఊరిచివర కొచ్చింది. రిక్షా ఆపి క్రిందకు దిగాడు సూరిగాడు. జేబులోనుండి 'పర్సు' తీసాడు. పర్సులోని డబ్బు లెక్కపెట్టాడు. నాలుగువందలయాభై-రూపాయలు. "హూ! చదుకున్నోడు దొరలా యాసమేసుకొచ్చి నా పది రూపాయలు జబర్దస్తీగా కొట్టేయాలనుకున్నాడు....నాయాల్ది! ఆడికి బుద్ధిసెప్పడానికి తిరిగి నా'పాతపనే' సేయాల్సొచ్చింది ....ఛీ!....యదవ పెపంచకం పాడైపోనాది .... మంచిగా బతుకుదామన్నా బతకనీదు....పదిరూపాయల ఎంగిలికూడు కోసం....నాలుగొందల యాభై వొదులుకున్నాడు...." అనుకుంటూ రిక్షాను పాకవైపు పోనిచ్చాడు సూరిగాడు.

—జ్యోత్స్న, రాయగడ.

